శార్వరీయ యోగసాహిత్యం - 2

# సద్గురు రమణ

మాస్టర్ శార్వరి



శార్వరి ధ్యానక్షేత్రం ప్రచురణ

SAARVARIIYA YOGA SAAHITYAM - 2

# SADGURU RAMANA

*by*

**MASTER SARVARI**

Gen. Editor : **Dr. Vaasili Vasanta Kumar**

First Edition : January, 2007
Second Edition : December, 2007
Third Edition : January, 2009
Fourth Edition : January, 2012

**Revised Edition : October, 2015**

**Price : Rs. 200/-**

For Copies :

**MASTER YOGAASHRAM**
Plot 89, Krishna Enclave, Military Dairy Farm Road,
Trimulgherry, SECUNDERABAD - 500 015.
Phone : 040-27790094 Cell : 93 93 93 39 46
E-mail : drvaasili@yahoo.co.in
www. yogaalaya.org www.yogalaya.in

**Price : $ 10**

Distributors in USA
**SPIRITUAL FOUNDATION, INC.,**
7062 S. BERINGER DRIVE
CORDOVA, TN 38018, USA
PHONE: 901-387-9646
E-mail : ramanavvasili@gmail.com, ramanavvasili@hotmail.com

# సద్గురు రమణ

## నిజంగానే నిజం



అవునండీ నిజం ... నిజంగానే నిజం ... నిప్పులాంటి నిజం ...

నా మీద ఒట్టు .. భగవాన్ రమణ మహర్షి పైన ఆన ...

భగవాన్ పైన రాసేంత శక్తి నాకు లేదు. సాహసం లేదు. అంత తపస్సు లేదు. మహర్షి ఆధ్యాత్మిక మహారణ్యంలో కల్పవృక్షం. నేనొక చిన్న తులసి మొక్కను. పైగా, మహర్షి పట్ల రవంత ఆరాధనతప్ప గాఢానుబంధం ఉన్నవాడిని కాను.

అసలేం జరిగిందంటే ...

ఒక రోజున మహర్షి నా ధ్యానంలో నెమ్మదిగా ప్రవేశించారు. నేను సాధారణంగా ధ్యానానికి కూర్చుంటే ఒక గంట, రెండు గంటలు అలా కూర్చుండి పోతాను. ఒల్లు మరచిపోతాను. అయిదు నిమిషాలలో నాలోని ఆత్మ నా నుండి వేరవుతుంది. నేను శూన్యమైపోతాను. శూన్యంలో లయించి పోతాను. రూపాలు అరూపాలై, ఆలోచనలు లయించి, భావాలు వివశమవుతాయి. హృదయం చూపే మార్గంలో నా ఆత్మ అన్వేషిస్తుంది. శూన్యంలో పయనిస్తుంది. బ్రహ్మాన్ని అనుభూతిస్తుంది.

అటువంటి స్థితిలో మహర్షి నా హృదయంలోకి, నా ధ్యానంలోకి ప్రవేశించారు. పోనీ, మహర్షి కదా! వచ్చారే అనుకుందాం. మహర్షులందరికీ యోగహృదయాలలో ప్రవేశించే హక్కు ఉంటుంది. ఏదో కాస్త ఆశీర్వదించి, అభినందించి వెళ్లవచ్చు గదా! ఉహుఁ అలాంటి పనిచేయలేదు సరికదా :

'శార్వరీ!' అని నా చైతన్యాన్ని కదిలించారు. కళ్లు విప్పలేదు గానీ, హృదయం తలుపులు తెరిచి, 'భగవాన్, మీరా దయచేయండి' అని స్వాగతించాను. ఏదో పనిబడి వచ్చి ఉంటారు.

"చెప్పండి మహర్షీ! ఈ కింకరునితో తమకేం పని, సెలవీయండి" అన్నాను.

"శార్వరీ, నామీద ఒక పుస్తకం రాయవూ?" అన్నారు.

వెనకటికి దేవుళ్లు – కవుల కలల్లో కనిపించి కావ్యాలు రాయించుకుని, అంకితాలు పుచ్చుకున్న సంఘటనలు నాకు మదిలో కదిలాయి.

భగవాన్ రమణ మహర్షిపైన అనేక పుస్తకాలు వచ్చాయి. ఇంకా నేను రాయడం ఏమిటి? ఎందుకు?

"భగవాన్, నేనేమిటి? మీపైన రాయడం ఏమిటి? మీ ధ్యానం వేరు, నా ధ్యానం వేరు. మీ తపస్సు వేరు, నా యోగం వేరు. అయినా, మీ గురించి నాకేం తెలుసునని".

నామాట విని మహర్షి మందస్మితం చేశారు. అప్పుడే విచ్చిన కలువలా మెత్తగా నవ్వారు. ఎంత అందమైన నవ్వు ... ఎంతటి పారవశ్యం ఆ నవ్వులో.

"మిగిలే వుంది శార్వరీ! తపస్సు గురించి రాయి చాలు" అన్నారు. భగవాన్ తపస్సుకు మరోపేరు మహర్షి ... ధ్యానానికి మారు పేరు భగవాన్.

"మీరే తపస్సు గదా! తపస్సంటేనే మీరు గదా! ఇంకా రాయడం ఎందుకు?"

"ఇంతకుముందు ఏమీ తెలియదన్నావు. ఇప్పుడు, 'తపస్సే రమణ' అంటున్నావు. తప్పించుకోవద్దు రాయి ... తపస్సు గురించి రాయి".

ఏం రాయను? ఎలా రాయను? ఏది మొదలు? ఏది చివర? నా మనస్సు పని చేయడం లేదు. భగవాన్‌నే వేడుకున్నాను.

"ఊఁ మనస్సు అవతలపెట్టు ... మనస్సు దాటి హృదయం తలుపులు తెరువు. ఆత్మ సహాయం అర్థించు."

"మహర్షీ! మీరు నాకు పరీక్ష పెడుతున్నారు!"

"నువ్వు శ్రీకారం చుట్టు. ఆకారం నేనిస్తాను" అన్నారు భగవాన్.

'సద్గురు రమణ' అని శ్రీకారం చుట్టాను. అది మహర్షికి అంగీకారమైంది.

★ ★ ★

75 సంవత్సరాల జీవితకాలంలో నేను ఎన్నడూ రమణాశ్రమం వెళ్లాలను కోలేదు. రమణాశ్రమమే కాదు, ఏ ఆశ్రమానికీ వెళ్లింది లేదు. అయినా మహర్షుల గురించి, మహా యోగుల గురించి చదివాను. వారితో పరిచయం ఉంది. అందరిపట్ల ఆరాధన ఉంది. ఈ మధ్యకాలంలో షిరిడీ, పాండిచ్చేరి, తిరువణ్ణామలై, కుంభకోణం వెళ్లడం జరిగింది. అన్నట్లు నాకు దేవాలయాలకు వెళ్లాలన్న తపన ఉండేదికాదు. 2005లో కుంభకోణం వెళ్లాం మా యోగమిత్రులంతా కలిసి. అరవిందాశ్రమం దర్శించి, చిదంబరం, కుంభకోణం వెళ్లి, ఆపైన తంజావూరు బృహదీశ్వరాలయం దర్శించి, తిరుగు ప్రయాణంలో రమణాశ్రమం చేరుకున్నాం.

ఒకసారి తన భక్తుడు విరూపాక్ష గుహకు వెళ్లి, రమణ మహర్షిని దర్శించాలని ఎంతగా తహతహలాడినా వీలైంది కాదట. ఏవో అవాంతరాలు ఎదురయ్యేవి. అతనికి శేషాద్రి స్వామి ఎదురుపడి 'రమణ సన్నిధికి చేరాలంటే ముందు ఈశ్వరానుగ్రహం కావాలయ్యా! ముందు మహేశ్వరుని ధ్యానించు. మార్గం చూపిస్తాడు ఆయనే' అని సలహా చెప్పాడు. ఆ భక్తుడు మూడు రోజులు ఈశ్వర ధ్యానం చేశాడు. అరుణాచలేశ్వరాలయంలో ఒకరాత్రి నిద్రచేశాడు. ఈశ్వరుని దర్శించాడు. తెల్లవారి అరుణాచలంపైకి వెళ్లి రమణ శిష్యుడైనాడు.

నేను రమణాశ్రమం వెళ్లడానికి ముందు బృహదీశ్వరాలయం వెళ్లడం యాదృచ్ఛికం కాకపోవచ్చు. రమణమహర్షి హృదయ కుహరంలో ప్రవేశానికి ఈశ్వర

దర్శనం అవసరమేమో! అలా జరిగింది నా రమణాశ్రమ దర్శనం. ఆనాడు రమణాశ్రమంలో ధ్యానం చేస్తుండగానే మహర్షి స్వప్నదర్శనమైంది. కొన్ని కొన్ని సంఘటనలు - అవి జరిగినప్పుడు వాటి 'పరమార్థం' మనకు తెలియదు కానీ, తర్వాత ఎప్పుడో వాటి విశేషార్థాలు తెలుస్తుంటాయి.

1960-61 ప్రాంతంలో నా ఉద్యోగం విజయవాడలో, చిన్న ఇల్లు, చిన్న సంసారం, చిన్న సంపాదన ... అప్పటికే మాకు ఇద్దరు అబ్బాయిలు, వసంత కుమార్, శ్యాంసుందర్. నా శ్రీమతి యామినీదేవికి భక్తి, పూజలు ఉన్నాయిగానీ, అవి చాదస్తం కాదు. తనకు 'రమణ మహర్షి' ఒకరోజు కలలో దర్శనమిచ్చారు. మంచిదే కదా! ఆ మర్నాడే మా మూడవ అబ్బాయికి తల్లి అయింది. ఆ అబ్బాయి పేరు రమణ. అలా రమణ మహర్షి అప్పుడే మా గృహప్రవేశం చేశారన్నమాట. మా రమణ పెద్ద వాడైన తర్వాత చాలాసార్లు రమణాశ్రమం వెళ్లి వస్తుండేవాడు. శ్రీమతి యామినీదేవిది 'ప్రవిమలభక్తి', బయటపడని స్వభావం.

ఈ సందర్భంలో మరొక విషయం చెప్పడం అసందర్భం అనిపించదు. మా అమ్మగారి పేరు ఈశ్వరమ్మ. ఆమెది వస్తుతః 'అచల' సంప్రదాయం. ధ్యానం, యోగం, తపస్సు లాంటివి చాలా చేస్తుండేది. వాటితో అప్పట్లో నాకు సంబంధం లేదు. ఆమె మహర్షి రమణ భక్తురాలు. తరచుగా తిరువణ్ణామలై వెళ్లి రమణాశ్రమంలో నెలల తరబడి ఉండి వస్తుండేవారు. ఆశ్రమం, అక్కడి వాతావరణం, వారి ఆదరణ ఆమెకు నచ్చాయి. చాలా డబ్బు ఆశ్రమానికి విరాళంగా ఇచ్చింది. నన్ను వెళ్లమని అడిగేది, కానీ, నాకు ఎప్పుడూ కుదిరింది కాదు. మా అమ్మగారికి, రమణమహర్షి తల్లిగారు అలగమ్మాళ్‌కు చాలాపోలిక లుండేవి.

★ ★ ★

అవి, ఈ పుస్తకం రాయడానికి నాకున్న పూర్వపరిచయాలు. ఇవి అనుబంధాలా? కాదు. మరొక గట్టి అనుబంధం వుంది. అది స్వేచ్ఛ. స్వతంత్రంగా ఎవరికి వారు 'ఆత్మవిచారణ' జరిపి 'ఆత్మదర్శనం' పొందాలన్నది రమణ సూత్రం. యోగం విషయంలో నేను కాస్త మొండివాడిని. నేను ఎన్నుకున్న మార్గం నుండి అంగుళం కూడా తప్పడం నాకు ఇష్టం ఉండదు. అయినా రమణ మహర్షిగారి సమతాదృక్పథం, సమదర్శనం నాకు నచ్చాయి. ఎవరూ 'తమ' మార్గాన్ని మార్చుకో నవసరం లేదని, ఎవరు నమ్మిన మార్గంలో, ఎన్నుకున్న పద్ధతిలో వారు సాధన చేయాలని మహర్షి అంటారు. ఎన్ని ఆశ్రమాలు దర్శించినా, ఎందరు మహర్షుల, మహాయోగుల చరిత్రలు అధ్యయనం చేసినా నా మార్గం నాది, నా యోగం నాది. నా వద్దకు ఎవరు వచ్చినా వారి పద్ధతిని గౌరవిస్తాను.

'నేనెవరు?' అన్నది రమణ మహర్షి ధ్యానసూత్రం. ఆ సూత్రానికి 'భాష్యం' ఆత్మవిచారణ. "మహర్షీ! ఇంతకీ మీరెవరు?" అన్నది నా ప్రశ్న కాదు ... విచారణ. మహర్షి ఆంతర్యం తెలియాలంటే, మహర్షిని అర్థం చేసుకోవాలంటే, వారి తపస్సులోని ఉషస్సులు దర్శించాలంటే 'నేనెవరో' తెలుసుకోవాలి. అప్పుడే 'నేను'లోని శ్లేష 'పోయి'

‘శూన్యశేషం’ మిగులుతుంది. ఆత్మతత్వం తెలిస్తే, శూన్యతత్వం తెలుస్తుంది, మహర్షి ధ్యానతత్వం తెలుస్తుంది. హృదయ కుహర మధ్యలోని అహాన్ని అర్థం చేసుకోగలమా?

అందరూ ‘భగవాన్ రమణ మహర్షి’ అంటారు. నేను ‘సద్గురు రమణ’ అనడం జరిగింది. నా ఉద్దేశంలో రమణది సద్గురు తత్వం. చాలా కాలం క్రితం పంచ మహాపురుషులలో రమణ మహర్షిని ఒకరుగా పేర్కొనడం జరిగింది. మాస్టర్ సి.వి.వి., రమణ మహర్షి, అరవిందయోగి, షిరిడిసాయి, పరమహంస మహా గురువులు. వీరు మృత్యువును జయించినవారు, అమృతత్వాన్ని నేటికీ అందరికీ పంచుతున్నవారు. ఏ ఒక్క ‘మాస్టర్’తో మన ఆత్మల్ని ‘లింక్’ చేసుకోగలిగినా, వారి తపశ్శక్తి మనకు అనుభోక్తమవుతుంది.

ఈ పుస్తకం ఎలా రాశానో, ఎలా రాయగలిగానో నాకైతే తెలియదు. మహర్షి శ్రీకారం చుట్టమన్నారు. వారి ఆదేశానుసారం శ్రీకారం చుట్టాను. అంతవరకే నా మైండ్ పని చేసింది. అంతవరకే నాకు జ్ఞాపకం. ఆ తర్వాత నేను శూన్యం అయినాను. ఒక్క ఆలోచన లేదు. చూస్తున్న కళ్లు, రాస్తున్న కలం, ఎదురుగా ఉన్న కాగితాలు ... ఆ మూడు తప్ప పరిసరాల జ్ఞానం లేదు. నాకు బాహ్య స్మృతి బొత్తిగా లేదు. ఏదో మైకం నన్ను ఆవహించేది. మనస్సు పనిచేస్తే గదా ఆలోచనలు, మనం కదిలించినట్లు కలం కదిలేది!

కావ్యకంఠ గణపతిమునిగారు ‘ఉమా సహస్రం’ ఇరవై రోజుల్లో పూర్తి చేయాలని సంకల్పించారు. పౌర్ణమినాడు అరుణాచలేశ్వరాలయంలో ‘కావ్యపఠనం’ కార్యక్రమం. ఆయన 750 శ్లోకాలు రాశారు. కుడిచేతి బొటనవేలు వాచింది. ‘కురుపు’. ఏం రాస్తారు. తెల్లవారితే పౌర్ణమి. ఆ రాత్రి ఎలాగైనా సహస్రం పూర్తి చేయాలని నలుగురు శిష్యులతో కూర్చున్నారు. తాను ఆశువుగా చెప్పేట్లు వారు రాసుకునేటట్లు. ప్రక్కన రమణమహర్షి వచ్చి మౌనంగా కూర్చుని, కళ్లు మూసుకున్నారు. గణపతిమునిగారు చెబుతున్నారు, శిష్యులు రాస్తున్నారు. రాత్రి ఒంటి గంట వరకు కార్యక్రమం సాగింది. రమణ మహర్షి కళ్లు విప్పి ‘చెప్పిందంతా జాగ్రత్తగా రాసుకున్నారా?’ అని లేచిపోయారు. ఆ రాత్రి ఏం రాసిందీ గణపతిముని గారికి గుర్తు లేదు. అది రమణ మహర్షి చమత్కృతి ... పేరుకు అది గణపతిముని కృతి.

అయ్యా! నా పరిస్థితీ అదే. రెండు నెలల కాలంలో రెండు వందల పేజీలు రాసింతర్వాత చూస్తే ఇది రాసింది ఎవరు? అనిపించింది. చేతి వ్రాత నాదే కాని, ‘రాత’ నాది కాదు. రాయించింది ‘సద్గురు రమణ’. వారి కరుణ నా కలం లోంచి జాలువారింది. అక్షర రూపం ధరించింది.

నా తరఫున, చదివే మీ అందరి తరఫున రమణ మహర్షి గారికి హృదయ పూర్వక నమస్కారాలు, కృతజ్ఞతలు.

సద్గురువుల అనుగ్రహం ఏ మాత్రం పొందగలిగినా అందరం అదృష్ట వంతులమే!

– శార్వరి




# 1. మహర్షీ! మీ రెవరు? నే నెవరు?

**నాయమాత్మా ప్రవచనే నలభ్యో**

**న మేధయా న బహూ నాశ్రుతేన ।**

**యమేవైష వృణుతే తేన లభ్య**

**స్తస్యైష ఆత్మా వివృణుతే తనూస్వాం ॥ – కఠోపనిషత్**

*వేదపఠనంవల్ల గాని, మేధోసంపదవల్ల గాని, పవిత్రగ్రంథాలు చదవడం వల్ల గాని, పాండిత్యంవల్ల గాని ఆత్మస్వరూపం తెలియదు. 'ఆత్మ' కోసం అన్వేషించేవారికి మాత్రమే 'ఆత్మ' దర్శన మవుతుంది. ధ్యానులకు, తాపసులకు, యోగులకు మాత్రమే ఆత్మరూపం ఎరుకపడుతుంది.*

'నేను' ఎవరినో తెలుసుకోవడం – 'జ్ఞానం'
నేనెవరినో తెలుసుకోలేనంతవరకు ఉండేది అజ్ఞానం.

'నేను' ఎవరినో తెలుసుకోవాలన్న తపనకు మరోపేరు జిజ్ఞాస –
తనలోకి నిష్క్రమిస్తూ తనను 'తాను' అన్వేషించడం తపస్సు.

తపస్సుకు మూలం తపన, ధ్యానానికి ఆధారం ఆత్మ.
తపస్సుకు గమ్యం ఆనందం, ఆత్మకు అవధి ఆనందం.

నేను అంటే 'ఆత్మ' అని గ్రహించడం వివేకం – అది తొలి ప్రకరణం.
నేను అంటే శరీరం కాదని తెలియడం మలి ప్రకరణం
శరీరం వేరు, ఆత్మ వేరని విశ్లేషించడం మూడవ ప్రకరణం
**ఆత్మను శరీరం నుండి వేరు పరచడం నాలుగవ ప్రకరణం.**

అందుకు నిర్ద్వందంగా ఆత్మకు సర్వసమర్పణ కావాలి
హృదయ కుహరంలోకి నిర్భయంగా, నిర్మోహంగా ప్రవేశించాలి
అక్కడి శూన్యంలో శూన్యమై 'తన్మయం' కావాలి.

## మహర్షి ఎవరు?

మాట తూలని మాటకారి, బహుదూరపు బాటసారి ... రమణమహర్షి
సూటి బాట చూపిన నిర్మోహమాటస్తుడు ... భగవాన్ రమణ
మౌనానికి భాష్యం, జ్ఞానానికి మాటలద్దిన చిరంజీవి ... శ్రీరమణుడు.

నేనెవరు? అని ప్రశ్నించి, తానే సమాధానంగా నిలచినవాడు ఆ మనీషి. రమణ మహస్సు తెలిసినవారు, రమణ హృదయం స్పృశించినవారు కొందరు. రమణ మహర్షి సాధించిన ఆధ్యాత్మిక వర్చస్సును అందుకున్నవారు కొందరే కావచ్చు. అవసరానికి ముందుగానే అవతరించిన బ్రహ్మతేజం, చైతన్యం ఆయన.

ఆత్మలో, ఆత్మతో జీవిస్తూ ఆధ్యాత్మిక శిఖరారోహణ చేసిన నవనవోన్మేష మహర్షి. అందరి హృదయాల తలుపులు తట్టి, ఆత్మను నిద్రలేపిన మహర్షి.

## మహర్షి సాధన, అన్వేషణ ఒక్కటే

నీ హృదయంలోకి చొచ్చుకొనిపో ... నీలోకి నీవు నిష్క్రమించు!
అవిశ్రాంతంగా నిన్ను కలవరపరుస్తున్న ఆలోచనల స్థావరాలు చేరుకో!
సమూలంగా ఆలోచనల్ని తొలగించు.
అక్కడ ఆలోచనల మూలస్థానంపైన ధారణ నిలుపు. ధ్యానం చేయి.
అక్కడి నిశ్శబ్దంలోని ప్రశాంతిలో విశ్రమించు, సేదతీరు ...
ఆపైన అంతా ఆత్మసాక్షాత్కారమే. అంతా ఆత్మసామ్రాజ్యమే.

## మహర్షి మాటల్లో ఆధ్యాత్మిక సత్యం

'ఆధ్యాత్మిక సత్యం' అన్నది నీలోపల నీవు అన్వేషించవలసింది.
మనస్సు దాటిన తర్వాతనే 'ఆనందం' అనుభూతికి అందుతుంది.
ఆనందం కోసం బయట ప్రపంచంలో వెతకటం అజ్ఞానం.
బయట వెతికినంతకాలం 'ఆనందం' నీతో దాగుడుమూతలాడుతుంది.

## మహర్షి బుద్ధత్వం

కష్టాలు, కన్నీళ్లు, బాధలు, నిరాశలు తొలగించుకోడానికి వివేకం అవసరం.
అసలు కారణాలను వెతికి పట్టుకోవడం ... బాధానివారణ సూత్రం.

**మనిషి కష్టాలకు, విచారాలకు పరిస్థితులు కారణం కాదు - మనస్సు.**

ఆత్మకు 'శరణాగతి' అయితే అన్ని బాధలు తొలగిపోతాయి.

ఆనందం మనిషికి చేరువవుతుంది. ఆత్మ ఒక్కటే ఆనంద నిలయం.

## మహర్షి సందేశం!

నేను ఎవరు? 'నేను' అంటే ఏమిటసలు? ఈమాటలు చిన్నవి.

జీవిత సమస్యలన్నింటికీ పరిష్కారం వాటి వెనుకనే ఉన్నది

'నేనెవరు?' అన్న ప్రశ్న మహర్షి తపస్సుకు, అన్వేషణకు ఆధారం.

సాధన మాత్రమే ఆ ప్రశ్నలకు సరైన సమాధానం చూపగలదు

జీవితానికి అర్థం చెప్పి పరమార్థ పథగాముల్ని చేయగలది 'సాధన'.

## అన్వేషణ ఎందుకు?

మనం మనుషులం. మనం ఉండేది భూలోకం. మనుషులు భూలోకంలో ఉంటారు. భూలోకం ఆవల భువర్లోకం. ఆపైన సువర్లోకం. అది దేవలోకం - దేవతలు ఉండేలోకం. మనవి భౌతిక శరీరాలు. భువర్లోక జీవులవి సూక్ష్మశరీరాలు. దేవలోకవాసులవి దివ్యశరీరాలు.

మనిషికి తన పూర్వజన్మ వాసన ఉండదుగాని, స్వర్గసుఖాలపైన మమకారం ఉంటుంది. ఎందుకుంటుంది? ఎవరూ స్వర్గం చూచింది లేదు గదా! మనుషులు ముందు స్వర్గంలో ఉన్నవారే. మానవజన్మపై మమకారం వదలక మరల మరల మానవజన్మకు వస్తుంటారు. స్వర్గ సుఖాలు మన పూర్వ స్మృతులు. మన ఇంద్రియాలకు తెలియకపోయినా, అంతరాత్మకు తెలుసు ఆ దేవరహస్యం. మన సూక్ష్మ శరీరాలకు తెలుసు స్వర్గసుఖాలు ఎలాంటివో, ఏమిటో? ఎన్నడో అనుభవించిన స్వర్గసుఖాలు మళ్లీ పొందాలనుకోవడం మనిషి నైజం. అందుకే 'స్వర్గం, నరకం' అని కలవరిస్తుంటారు.

ఇంకాస్త పైకిపోతే తపోలోకాలు ఉంటాయి. అక్కడ ఉండేది జనన మరణాలకు అతీతులైన మహాత్ములు. అది తాపసులకు, మహాయోగులకు, పుణ్య పురుషులకు శాశ్వతావాసం. ఆధ్యాత్మికంగా అవసరం ఏర్పడినప్పుడు ఆ తపోలోకాల నుండి ఒకరిద్దరు మహాత్ములు, భూలోకంలో జన్మిస్తుంటారు. మనుషులలో, అర్హతగల వారిలో ఆధ్యాత్మిక జ్యోతులు వెలిగించడం ఆ మహాత్ముల పని. అలా అవతరించిన 'మహాత్మ' రమణ మహర్షి.

భౌతిక శరీరాలు, వాసనలు లేకపోయినా, తమవి దివ్యశరీరాలైనా, అవి మానవ రూపాలకు ప్రతిరూపాలేనని వారికి తెలుసు. అంచేతనే దేవలోక వాసులకు

మానవలోకం పైన మక్కువ ఎక్కువ. ఇక్కడ మనుషులు భౌతిక శరీరాలతో 'తెగ' సుఖపడిపోతున్నారని అసూయపడుతుంటారు. అక్కడి స్వర్గసుఖాలు 'తనివి' తీరా అనుభవిస్తున్నారని మనుషులు 'తెగ' బెంగపడి పోతుంటారు. వారి సుఖాలు వీరికి కావాలి. వీరి శరీరాలు వారికి కావాలి. మనుషులకు, దేవలోక వాసులకు మధ్య సంబంధం విచిత్రంగా ఉంటుంది. వద్దన్నా వెంటపడే స్వభావం దేవుళ్లది. ఏ వరాలూ వర్షించకపోయినా దేవుళ్ల వెంటపడే నైజం మనుషులది. స్వర్గలోకంలోని దేవుళ్లందరికీ భూలోకంలో ఇళ్లున్నాయి. అవే గుళ్లు. అక్కడ వైకుంఠం, కైలాసం, స్వర్గం, ఇంద్రసభ, నందనవనాల డూప్లికేట్లు ఇక్కడ భూలోకంలో వెలిశాయి. అప్సరసలు, దేవతాస్త్రీలు, భోగాలు చెప్పనవసరం లేదు. భూలోకంలో అన్నీ సెకండ్ సెటప్‌లు. అవి చూచి, వాటిని అనుభవిస్తూ, స్వర్గసుఖాలు చవిచూస్తుంటారు మనుషులు. కైలాసం నుండి కన్యాకుమారి వరకు మన దేశం మొత్తాన్ని దేవుళ్లు ఆక్రమించుకున్నారంటే అతిశయోక్తి కాదేమో! అందుకే మనది దేవభూమి. కొండలపైన, అడవుల్లో, నదీ తీరాలలో దేవాలయాలు ఏర్పడడానికి అదే కారణం. దేవుళ్లకు చాలా 'ప్రైవసీ' అవసరం!





# 2. రమణాయణం

**మ**హాత్ములందరూ కారణజన్ములే. అసామాన్యులు. పూర్వజన్మకర్మ ఫలాలు అనుభవించడం కోసం జన్మించినవారు కారు. ఎప్పుడో జనన మరణ వలయాలు దాటి తపోలోకాలలో, పుణ్యలోకాలలో ఉన్నవారు లోకోద్ధరణ కోసం, ఆధ్యాత్మిక వికాసం కలిగించడం కోసం భూలోకానికి వచ్చిపోతుంటారు. వారి మూలాలు మన అంచనాలకు అందవు. వారి జన్మకారణం మన బుద్ధికి అందదు. సాధారణంగా మనుషులు చాలా నెమ్మదిగా బ్రతుకు సాగిస్తూ, సాగదీస్తూ నడక సాగిస్తారు. కొందరు మాత్రమే గమ్యాన్ని చేరగలుగుతారు. కొందరు లక్ష్యాల్ని ఏర్పరచుకుని, గమ్యం చేరలేక మధ్యలో కూలబడిపోతుంటారు. అదిగో! అలాంటి వారికి కాస్త చేయూతనిచ్చి, ముందుకు సాగించడం కోసం మహాత్ములు అవతరిస్తుంటారు. మహాత్ములు ఈ జన్మలో వచ్చినపని పూర్తికాగానే నిష్క్రమిస్తారు. వారి తపస్సును, వర్చస్సును, మహస్సును ఈ లోకంలో వదలిపోతారు. వారు కర్మబద్ధులు కారు. ఇతరుల్ని కర్మవిముక్తుల్ని చేయడం ఒక్కటే వారి ఏకైక లక్ష్యం, వారి జన్మరహస్యం. అటువంటి కారణజన్ముడు రమణ మహర్షి.

### రమణ మహర్షి జన్మించింది తిరుచ్చుళిలో

తిరుచ్చుళి ప్రసిద్ధమైన ప్రాచీన యాత్రా స్థలం. అక్కడ **ఒక శివాలయం ఉంది. శివుని భూమినాథునిగా, అమ్మవారిని సహాయవల్లిగా ఆరాధిస్తారు.** ఈ దేవాలయాన్ని పూర్వం శ్రీ అప్పర్, శ్రీ సుందరార్, శ్రీ మాణిక్య వాచకర్, శ్రీ వాగీశ్వర్ వంటి రుషులు దర్శించారు. వారు అనేక గీతాలు రచించారు.

అక్కడ దేవాలయానికి ఎదురుగా ఒక కోనేరు ఉంది. దానిని త్రిశూల తీర్థం అంటారు. శివుడు తన త్రిశూలం విసరగా అక్కడ జల ఉద్భవించిందట. మాసి మాసంలో (ఫిబ్రవరి, మార్చి) పంచమి నుండి పౌర్ణమి వరకు పదిరోజులు కోనేరు నీరు అంచెలంచెలుగా పెరిగి పౌర్ణమి నాటికి నిండుతుంది. మరల మర్నాటి నుండి కాస్త కాస్త తగ్గుతూ పదిరోజుల్లో మామూలు మట్టానికి చేరుతుంది.

ఒకసారి రమణ భక్తురాలు సూరి నాగమ్మ తిరుచ్చుళి వెళ్లి వచ్చి ఆ కోనేరు మహత్తు చెబుతుండగా మహర్షి తన చిన్ననాటి స్మృతుల్ని ఇలా చెప్పారు : "ఈ కాలంలో కోనేరు నీరు అంతబావుండదు. మాఘమాసంలో 'మఖ' నక్షత్రం రోజు కోనేరు పొంగుతుంది. ఆ రోజునే అభిషేకోత్సవం. అది బ్రహ్మోత్సవం పదవరోజు. ఆ రోజున ఉత్సవమూర్తిని మండపంలోకి తీసుకువస్తారు. త్రిశూల తీర్థంతో అభిషేకం చేస్తారు. అభిషేకం తర్వాత అందరు కోనేరులో స్నానాలు చేస్తారు. నా చిన్నప్పుడు పిల్లలం మెట్లపైన చేరి రోజూ గీతలు గీస్తూండేవాళ్లం. ఎంత మట్టం పెరిగిందోనని. అదొక సరదా ఆరోజుల్లో. పదిరోజుల ముందునుండి రోజుకు ఒక మెట్టు ప్రమాణంలో నీరు పెరిగేది. పౌర్ణమి నాటికి కోనేరు పూర్తిగా నిండేది".

తిరుచ్చుళి, రామనాథపురం జిల్లాలో ఒక తాలూకా కేంద్రం. చిన్న పట్టణం. మదురైకి 38 మైళ్ల దూరం. అక్కడ 500 లోపు ఇళ్లుండేవి. సుందరం అయ్యర్ పట్టాలేని ప్లీడరు. ఆయన భార్య అలగమ్మాళ్ గొప్ప భక్తురాలు. సుందరం అయ్యర్ మేజిస్ట్రేటు కోర్టులో వకాల్తా ప్లీడరు. పట్టాలేకపోయినా ప్రతిభ, అనుభవం ఉన్నవాడు. ఉదయం వేళల్లో ఇల్లు వచ్చిపోయే వారితో కళకళ్లాడు తుండేది. ఇల్లు విశాలం. కోర్టు పనిమీద వచ్చేవారు అక్కడే మకాం వేసే వారు. బదిలీ మీద ఉద్యోగులు ఎవరు వచ్చినా, వేరే ఇల్లు దొరికే వరకు ఆయన ఇంటనే ఉండేవారు. సుందరం అయ్యర్‌కు మంచివాడని పేరు. ఉద్యోగులకు సాయం చేస్తుండేవాడు. కోటు, తలపాగా ధరించి గుర్రం బండి మీద తిరిగేవాడు. ప్లీడరీ ఉద్యోగం అంటే మాటలా? ఆ హోదాను బట్టి ధనవంతుడని జనం భావించేవారు.

ఆ రోజుల్లో ధన సంపాదన ముఖ్యం కాదు. మంచివాడన్న పేరు గడించిన వాడు గొప్పవాడు. మనిషికి శీలం ముఖ్యం. ఆధ్యాత్మికత సంపద. మొదట్లో సుందరం అయ్యర్ నెలకు రెండు రూపాయల ఉద్యోగంలో చేరాడు 12వ ఏట. తర్వాత అర్జీలు రాసిపెట్టే పని. ఆ తర్వాత ప్లీడరు. ఆయనకు మతపిచ్చి లేదు. ఒక దేవుడని లేదు. అన్ని పద్ధతుల్ని గౌరవించేవాడు. రకరకాల దేవతామూర్తులకు పూజచేసి, నైవేద్యం పెట్టిగాని భోజనం చేసేవాడు కాదు. అప్పుడప్పుడు

దేవాలయాలకు వెళ్లేవాడు. పురాణాలు వినేవాడు. మత గ్రంథాలు చదివేవాడు. ఆ కుటుంబానికి ఒక శాపం ఉంది. ప్రతి తరంలోను ఒకరు సన్యసిస్తారని ఒక సాధువు శపించాడట. సుందరం అయ్యర్ పినతండ్రి ఒకరు కాషాయబట్టలు కట్టి, కమండలం ధరించి, భిక్షచేసి బ్రతికాడు. పూర్వం ఎప్పుడో ఒక సాధువు వారింటికి వచ్చి భిక్ష అడిగాడు. ఇంటివారు అతనిపట్ల అమర్యాదగా ప్రవర్తించారు. "సన్యాసివేషం వేసుకుని అడుక్కోవడం ఎందుకని" మాటతూలారు. అతను శపించాడు. సుందరం అయ్యర్ తన పిల్లలు ఎవరూ సన్యాసి కాకూడదని భావించాడు.

1879 డిసెంబరు 30 శ్రీ రమణ జననం. సుందరం అయ్యర్ అలగమ్మాళ్‌కు ఆయన ద్వితీయ సంతానం. శ్రీ రమణ జన్మించిన ఇల్లు కార్తికేయన్ వీధిలో ఉంది. అది తిరుచ్చుళి దేవాలయానికి దగ్గర. తిరుచ్చుళి అంటే 'కర్మ విపాకం' అని అర్థం. శ్రీ రమణ జన్మించింది 'ఆర్ద్ర దర్శనం' రోజున. పునర్వసు నక్షత్రం రాత్రి ఒంటిగంటకు జననం. ఆనాడు తిరుచ్చుళి వీధుల్లో నటరాజమూర్తిని రథంలో ఊరేగిస్తారు. పూర్వం గౌతమ మహర్షి, పతంజలి, వ్యాఘ్రపాదుడు, మాణిక్య వాచకర్‌కు శివుడు నటరాజ స్వామిగా అక్కడ దర్శన మిచ్చాడంటారు. ఊరేగిన రథం అర్ధరాత్రి దేవాలయంలో పునఃప్రవేశం జరుగుతున్న సమయంలో రమణోద్భవం జరిగింది.

1880లో సుందరం అయ్యర్ వకీలుగా మారాడు. ఒక్కొక్క కేసులో రెండు పార్టీలవారు ఆయన వద్దకు వచ్చి తమ కేసు వాదించమనేవారు. ఆయన కోర్టుకు వెళ్లకుండా తీర్పు చెప్పేవాడు. పేదలకు, నిమ్నకులాల వారికి ఆయన దేవుడితో సమానం. మహా మహానేరస్తులు, హంతకులు సైతం ఆయన్ని గౌరవిస్తుండేవారు.

ఒకసారి ఒక సంఘటన జరిగింది. తిరుచ్చుళికి దూరంగా ఒక ఊరిలో మేజిస్ట్రేట్ కాంపు. అక్కడికి వెళ్లి విచారించాలి. మేజిస్ట్రేట్ తన సిబ్బందితో రెండెడ్ల బండిలో బయలుదేరాడు. సుందరం అయ్యర్ మరొక బండిలో బయలుదేరాడు. మేజిస్ట్రేట్ ఎక్కిన బండి ఆగమేఘాల మీద ముందు వెళ్లిపోయింది. సుందరం అయ్యర్ బండి వెనక పడ్డది. రోడ్డు మలుపు తిరిగిన తర్వాత మేజిస్ట్రేట్ బండి కనిపించకుండా మాయమైంది. కొంతదూరం వెళ్లాక దొంగలు దారికాచి బెదిరించారు. బండివాడు 'మేజిస్ట్రేట్ సారు' అని చెప్పినా దొంగలు వినిపించుకోక డిస్పాచ్‌బాక్స్ తీసుకుని పారిపోతుండగా వకీలు గారి బండి అక్కడికి చేరుకుంది. "అరే వకీల్ స్వామి" అని వాళ్లు డబ్బా అక్కడ పడేసి ఉడాయించారు. మేజిస్ట్రేట్ సుందరం అయ్యర్‌కు నమస్కారం చేశాడు క్షమించమని అర్థించాడు. తాను మేజిస్ట్రేట్ నన్న గర్వం ఆరోజుతో పోయింది.

రాంనాడ్ రాజావారు ఒకసారి తిరుచ్చుళి వచ్చి భూమినాథాలయం మరమ్మత్తు పనులు చేయించ సాగాడు. స్థానికంగా ఉన్న పెద్దలు, ఉద్యోగులు అంతా వచ్చి రాజా వారిని దర్శించుకున్నారు. రాజావారు సుందరం అయ్యర్ మంచితనం గురించి లోగడ విన్నాడు. ఆయన తనను చూడడానికి రాలేదని తెలిసి కబురుచేశాడు. తనవల్ల ఏదైనా పొరపాటు జరిగితే క్షమించమని కబురుపంపాడు. మూడు రోజులు గడిచినా సుందరం రాజావారి దర్శనానికి రాలేదు. సుందరం వినయంగా సమాధానం పంపాడు "అయ్యా! నేను మామూలు మనిషిని. రాజా వారిని దర్శించే అవసరం నాకు లేదు. నాకు వారితో పని లేదు. వారికి నాతో పని లేదు."

రాజావారు గ్రహించారు తిరుచ్చుళిలో సుందరం అయ్యర్ లేకుండా ఏ పని జరగదని. దయచేసి దేవాలయం పునరుద్ధరించడంలో తనకు సహకరించమని రాజావారు కబురుచేశారు.

మహర్షి తన తండ్రిగారి గురించి ఎక్కువగా చెప్పేవారు కాదు. ఆయన ఔన్నత్యాన్ని, ఉదార స్వభావాన్ని మనస్సులోనే అభినందించేవారు. రమణ మహర్షి పరాశర మహర్షి సంప్రదాయంలోని వారు. పరాశరుదు 'అగ్ని' స్వభావం కలవాడు. "ప్రతి హృదయంలో అగ్ని జ్వలిస్తుంది. హృదయ కుహరంలోని తేజస్సే విశ్వచైతన్యం". అది రమణుని హృదయ విద్యా రహస్యం. ఆత్మవిద్య వల్లనే కర్మలు భస్మమై పోతాయన్నది రమణ ధ్యాన సూత్రం. సత్యదర్శనంలో ఎదురయ్యే అవరోధాలను ఆ హృదయాగ్ని తొలగిస్తుంది, భస్మం చేస్తుంది. మొదట అరుణాచల జ్యోతికి ఆద్యంతాలు లేవు. తర్వాత ఆ జ్యోతి శిలా రూపం ధరించి, అరుణాచలంగా రూపాంతరం చెందింది. అరుణాచలమే ఒక మహాలింగం, శివలింగం.

★ ★ ★

రమణ బాల్యం సాదా సీదాగా జరిగింది. అందరు పిల్లల్లాగే పెరిగాడు. ఆ పిల్లవాడు ఓ సన్యాసి అవుతాడని గాని, మహర్షి అవుతాడని గాని ఎవరూహిస్తారు? జీవితంలో ఒక మలుపు తిరిగినప్పుడో, మనసు ఎదురు తిరిగినప్పుడో విపరీతం జరిగిపోతుంది. రమణ అన్నగారి పేరు సాగస్వామి, తమ్ముడు నాగసుందరం, చెల్లెలు అలమేలు. రమణ ఎర్రగా, బుర్రగా ఉండేవాడు, ముద్దొచ్చేవాడు. పిల్లలు లేని దంపతులు మరిమరీ ముద్దులు కురిపించేవారు. అలాంటి వారిలో తాసీల్దారు గణపతి అయ్యర్, సబ్ రిజిస్ట్రార్ నారాయణస్వామి అయ్యర్ ముఖ్యులు. వకీలు గారి అబ్బాయి గదా!

రమణ తన తండ్రిని 'నాయనగారు' అని పిలిచేవాడు. 'అప్ప' తమిళం, 'నాయన, నాన్న' తెలుగు పదాలు. వారి బంధువు లక్ష్మణ అయ్యర్‌కు తెలుగు బాగా వచ్చు. ఆయనే రమణకు తెలుగు నేర్పాడు. లక్ష్మణ అయ్యర్ 'వెంకట్రామన్' అని పిలవకుండా 'రమణ' అని పిలిచేవాడు. ఆయన 'వాక్శుద్ధి' ఎలాంటిదో గాని, చివరకు వెంకట్రామన్‌కు 'రమణ' పేరు స్థిరపడ్డది. తిరుచ్చుళి వదిలి వచ్చిన తర్వాత ఆపేరు కనుమరుగైంది. తర్వాత గణపతిముని నోటివెంట వెలువడి సార్థకమైంది. సుందరం అయ్యర్‌ను ఊళ్లో జనం, బంధువులు సైతం 'నాయన' అని పిలవసాగారు. అది 'రమణ' వాగమృతం!

ఒకసారి ఏదో పెళ్లిలో రమణ చిన్నతప్పు చేస్తే, మామ సుబ్బయ్యర్ తిట్టాడని సహాయాంబ దేవాలయానికి వెళ్లి కడుపార ఏడ్చి ఏడ్చి, అమ్మవారికి క్షమాపణ చెప్పుకున్నాడు. రమణమహర్షి జ్ఞాపక శక్తి అద్భుతం. చేతివ్రాత కూడా చక్కగా అచ్చు అక్షరాల్లా ఉండేది. తిరుచ్చుళి ఊరుబయట కౌండిన్య నది ఉంది. రమణ స్నేహితులతో వెళ్లి నదీతీరంలో ఆడుకునేవారు. నదిలో స్నానాలు చేసి కాలయార్ ఆలయంలోని లింగానికి అభిషేకం చేసి, నైవేద్యం పెట్టి అప్పుడు ప్రసాదం తినేవారు. అది ఆనాటి రమణ భక్తి!

పదేళ్ల వరకు రమణ చదువుసాములు తిరుచ్చుళిలోనే సాగాయి. తర్వాత హైస్కూలు చదువుకోసం దిండిగల్ వెళ్లవలసి వచ్చింది. చిన్నాయన సుబ్బయ్యర్‌కు దిండిగల్‌లో ఉద్యోగం. దిండిగల్‌లో ఒక కోట ఉంది. పిల్లలు ఆడుకోడానికి విశాలంగా బావుండేది, కానీ లోపలకు ఎవరినీ పోనిచ్చేవారు కాదు. గేటు వద్ద కాపలా ఉండేది. రమణ, స్నేహితులతో ఒక మూలన గోడపైకి పాకి, లోపలకు దూకేవారు.  కోటగోడ వెనక, ఒక రంధ్రం చేసి ఉండేది. ఆటలైన తర్వాత దాంట్లో దూరి బయట కొచ్చేవారు! మహర్షులైనా బాల్యంలో అల్లరిచిల్లర పనులు చేస్తారేమో!

ఆ రోజుల్లో రమణ గాఢనిద్రకు ప్రసిద్ధి. నిద్రపోతే సమాధిలో ఉన్నట్లే. బొత్తిగా స్పృహ ఉండేది కాదు. కొట్టినా, కుదిపినా మేలుకునేవాడు కాదు.

రమణాశ్రమానికి ఒకసారి ఒక బంధువు వచ్చాడు. ఆయన్ని చూచి రమణ అన్నారు : "మిమ్మల్ని చూస్తుంటే నాకు దిండిగల్ నాటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. అప్పుడు మీ చిన్నాన్న పెరియప్ప శేషయ్యర్ దిండిగల్‌లో ఉండేవారు. ఊరిలో ఏదో వేడుక జరిగింది. అందరూ వెళ్లారు. అక్కడ నుండి గుడికి వెళ్లారు. నేను ఇంట్లోనే ఉన్నాను. లోపల గడియ బిగించి పడుకున్నాను. అందరూ తిరిగి

వచ్చి తలుపులు బాదారు. ఉహుఁ నాకు వినిపిస్తేగా? ఎలాగో దొడ్డి తలుపు తెరిచి లోపలకు వచ్చి నన్ను కొట్టి నిద్రలేపడానికి ప్రయత్నించారు. తెల్లవారింది. నాకేం జ్ఞాపకం లేదు, రాత్రి సంఘటన. అది మన నిద్ర – మోహనం".

"మదురైలోనూ మన కథ 'షరా మామూలే'. బాబయ్యకు బదిలీ కావడంతో నేనూ మదురై చేరాను. నేను మేల్కొని ఉన్నప్పుడు పిల్లలు నా జోలికి వచ్చేవారు కాదు. మనమంటే హడల్. నిద్రపోయేటప్పుడు నామీద ప్రతాపం చూపించేవారు. కసి తీరే వరకు కొట్టి వెళుతుండేవారన్నమాట. ఎంత కొట్టినా నాకు నిద్రమెలకువ రాదని వాళ్లకు నమ్మకంగా తెలుసు. మర్నాడు 'వాళ్లు' చెబితేగాని నాకు తెలిసేది కాదు".

రమణకు పన్నెండు సంవత్సరాల వయసులో తండ్రి కాలం చేశాడు. అంతిమ సంస్కారాలు జరిగిన రోజున రమణ "మృత్యువంటే ఏమిటి? పుట్టుక లక్ష్యం ఏమిటి?" అని సుదీర్ఘంగా ఆలోచించసాగాడు. అమ్మ, అన్నయ్య, తమ్ముడు అందరూ ఏడుస్తున్నారు. శవ ఖననం తర్వాత విచారించాడు : 'శరీరం చూస్తుంది, నడుస్తుంది, తింటుంది'. ఈ పనులు చేస్తున్నది శరీరం అయినా, చేయిస్తున్నది ఎవరు ...? లోపలి ఆత్మ. ఇప్పుడు 'నేను' ఇంతగా ఆలోచిస్తున్నది ఎవరు? నా శరీరం కాదు, లోపల చైతన్యం. నాలోని 'నేను' ఉన్నది కానీ, నాయనలోని 'నేను' లేకుండా పోయింది. శరీరాన్ని వదిలిపోయింది.

ఇది 'రమణ' తొలి 'ఆత్మ' వివేచన.

నాలుగు సంవత్సరాల తర్వాత మదురైలో అది పునరావృతమైంది.





# 3. మదురై నగరిలో ...

రమణుని కుదిపేసింది, గొప్ప మలుపు తిప్పింది మదురై.

1892లో సుందరం అయ్యర్ మరణం తర్వాత కుటుంబంలో చీలిక ఏర్పడ్డది. అలగమ్మాళ్ చిన్నపిల్ల లిద్దరిని తీసుకుని మనమదురై వెళ్లిపోయింది. నాగస్వామి, రమణ మదురైలో చిన్నాన్న ఇంటికి చేరుకున్నారు. మీనాక్షి దేవాలయం సమీపంలోని చొక్కప్పనాయకన్ వీధిలో ఇల్లు. మొదట్లో రమణ స్కాట్స్ మిడిల్ స్కూలులో చేరాడు. తర్వాత అమెరికన్ మిషన్ హైస్కూలుకు మారాడు. కష్టపడి చదివేవాడు కాదు, కాని జ్ఞాపకశక్తి ఎక్కువ. ఆటలంటే ఆసక్తి. ఫుట్‌బాల్, ఈత బాగా ఇష్టం. రాత్రిళ్లు రమణ, నాగస్వామి ఇంట్లోంచి దొంగతనంగా బయటపడి స్నేహితులతో కలిసి వైగైనది ఒడ్డున ఇసుకలో గడిపేవారు లేదా పిల్లయ్యార్ పాల్యెం చెరువులో ఈతలు కొట్టేవారు.

ఒకసారి ఫుట్‌బాల్ ఆడుతుంటే రమణ కాలికి బాగా గాయమైంది. జ్వరం వచ్చింది. అప్పుడు రమణ మిత్రుడు, సాబ్‌జాన్ ఇద్దరూ కలిసి సుబ్రహ్మణ్యస్వామి ఆలయంలో కూర్చొని గడిపేవారు. రమణ అనేవాడు, "భగవత్ సృష్టి ఎంత చిత్రం! సృష్టిలో భేదం లేదు! భగవంతుడు ఒక్కడే! తేడాలు మనుషులు సృష్టించుకున్నవి".

రమణ చిన్నాన్న ఉండే ఇంటి పైభాగంలో ఎవరూ ఉండేవారు కాదు. అక్కడొక చిన్నగది ఉండేది. రమణ ఆ గదిలో గంటల తరబడి పద్మాసనం వేసుకుని గడిపేవాడు. తనకు అలా కూర్చోవడం నేర్పమని మిత్రుడు నారాయణ

స్వామి రమణను అడిగాడొకసారి. రమణ అతనిని కూర్చోమని, బలవంతంగా తొడపైకి పాదాలు లాగి పెట్టి, భ్రూ మధ్యన పెన్సిల్‌తో గుచ్చాడు. అతనికి అరగంట సేపు స్పృహ లేకుండా పోయింది. అతను కళ్లు విప్పేసరికి రమణ ఆనందంగా నవ్వుతున్నాడు.

రమణ, మిత్రులతో కలిసి వరద పెరుమాళ్ ఆలయంలోని గాలిగోపురం మూడవ అంతస్తులో దాగుడుమూతలు ఆడేవారు. అప్పట్లో రమణను 'తంగక్కై' అనేవారు. అంటే బంగారు చేయి అని. ఆ పేరు ఎలా వచ్చింది అంటే రమణ అంటారు : "నేనెప్పుడు ఆటల్లో ఫస్టు. అవి కుస్తీ పోటీలు గాని, ఈత పోటీలు గాని. ఏ ఆటలు గాని గెలుపు నాదే. మా చిన్నమ్మ అప్పడాలు చేస్తూ నన్ను పిలిచేది. 'ఒక్కసారి చేయివేసి పోరా' అనేది. అది మన చేతి మహాత్మ్యం అన్నమాట. పిన్నికి నేనంటే మహా గురి. ఆమె ఏది చెప్పినా చేసే వాడిని. ఆమెతో ఎన్నడూ అబద్ధాలు చెప్పలేదు."

మదురై వద్దగల అలగర్ కోయిల్‌లో ప్రసాదం అంటే రమణకు ఇష్టం. మళ్లీమళ్లీ అడిగి తీసుకునేవాడు. ఆ పూజారి ముచ్చటపడి మిగిలిన ప్రసాదం పొట్లం కట్టి 'ఇంటికి తీసుకుపో' అని ఇచ్చేవాడు. ప్రసాదం వేసిన గిన్నెలు తలపైన పెట్టుకుని మోసుకువచ్చేవాడు. ఆ గుడి ఊరికి చాలా దూరం! అయినా భక్తుడికి దూరంతో నిమిత్తం ఉండదు. "అది చాలా బరువు. ఎంత బరువు అంటే మెడ కండరాలు నొప్పిపెట్టేంత బరువు. పొంగల్ ప్రసాదం మళ్లీ అడిగి పెట్టించు కున్నందుకు అది తగిన శిక్ష అనుకునేవాడిని".

రమణకు చదువుపట్ల ఆసక్తి తక్కువ. మొక్కుబడిగా స్కూలుకు వెళ్లి వచ్చేవాడు. అమెరికన్ మిషన్ హైస్కూలులో బైబిల్ పాఠం చెప్పేవారు. రమణకు చదువంటేనే నిర్లక్ష్యం. బైబిల్ అంటే అసలు పడేది కాదు. 1896 వరకు సుందరం అయ్యర్ పిల్లల్లో ఎవరికీ ఆధ్యాత్మిక చింతన ఉండేదికాదు. పెద్దవాడు నాగస్వామి తెలివిగలవాడు. తల్లి ఆశలన్నీ అతనిపైనే ఉండేవి. గవర్నమెంటు ఉద్యోగంలో చేరితే డిప్టీ కలెక్టరు అవుతాడని ఆశపడేది. చిన్నవాడు నాగసుందరం. అంచనాల వరకు ఎదగని వయస్సు. రమణ జాతకం ప్రకారం మహర్జాతకుడు. కాని ఏదీ చదువు? కనీసం వేదం చదివినా గౌరవం దక్కేది?

1895 – అప్పటికి రమణ వయస్సు పదిహేను. అరుణాచలం నుండి మొదటి పిలుపు చెవిని పడ్డది. అరుణాచలం అంటే తిరువణ్ణామలై లోని పవిత్ర పర్వతం అని తెలియదు. తమ స్వగ్రామం తిరుచ్చుళి నుండి బంధువు ఒకరు మదురై వచ్చాడు.

"ఎక్కడి నుండి వస్తున్నారు?" అని యధాలాపంగా ప్రశ్నించాడు రమణ.

ఆయన 'అరుణాచలం' అని సమాధానం చెప్పాడు.

ఈ భూ ప్రపంచంలో 'అరుణాచలం' అనేది ఒకటి ఉన్నదని ఆనాడే తెలిసింది రమణకు.

"ఏమిటి? అరుణాచలమా? అంటే ఏమిటి?" రమణ ప్రశ్న.

అంతటి అజ్ఞానానికి ఆయన అవాక్కయి "దానిని తిరువణ్ణామలై అంటారులే" అన్నాడు. తన చివరి గమ్యం అదేనని అప్పుడు రమణకేం తెలుసు!

తర్వాత 'పెరియపురాణం'లోని 63 మంది శైవస్వాముల గురించి చదవడం తటస్థించింది.

"ఆ పుస్తకం మా ఇంట్లోనే వుంది. నాకంట పడింది. నాలో చదవాలన్న ఆసక్తి కలిగింది. మొత్తం చదివాను".

అందులోని వన్నీ భక్తుల కథలు. అందరూ వీరభక్తులే.

బంధువు వెళ్లిపోయిన తర్వాత అరుణాచలం గురించి మరచిపోయాడు. కాని లోపల్లోపల అగ్ని పర్వతం రగులుతూనే వుంది.

"అచలం నన్ను ప్రభావితం చేసింది. నన్ను లోబరచుకుంది."

తన చిన్ననాటి అనుభూతిని రమణ మహర్షి ఇలా వర్ణిస్తారు పరవశంగా.

"అద్భుతం! పరమాద్భుతం! అది అచలం ... అది అరుణాచలం. దాని మహత్తు ఎవరికీ అంతు చిక్కదు."

ఆలయానికి ఆశ్రమానికి దూరం ఎంత?

## పరివర్తన

1896 జులై 16. మహర్షి జ్ఞాపకాలు.

"ఏమో! నాకేం తెలియదు. నాకు భగవంతుడి అనుభవం లేదు. 'ఈశ్వరుడు' అనేవాడిని. నాకు తెలిసిన మాట అది ఒక్కటే. కనీసం భగవద్గీత పేరు వినలేదు. ఏ మతగ్రంథాలు చదవలేదు. పెరియపురాణం ఒక్కటి చదివాను. బైబిల్ విన్నాను. క్రీస్తు గీతాలు చదివాను. మా చిన్నాన్న దగ్గర 'స్వామి' వివేకానంద చూచాను, చదవలేదు. నాకు స్వామి వివేకానంద పేరు ఉచ్చరించడం కూడా తెలియదు. వివేకానందను 'వైవేకానంద' అని చదివాను. తత్వశాస్త్రాలు వేదాంతం తెలియదు. భగవంతుడు సర్వశక్తిమంతుడు అని ఒక నమ్మకం".

అప్పటికి రమణ కున్నది భగవంతునిపై విశ్వాసం మాత్రమే. **మనిషికి దివ్యజ్ఞానం కలిగినపుడు, అంటే 'శక్తిపాతం' జరిగినపుడు, ఒక్కసారిగా మార్పువస్తుంది. శరీరం, మనస్సు, ఇంద్రియాలు, వ్యక్తిత్వం అన్నీ దివ్యత్వంతో తమ ఉనికిని కోల్పోతాయి. భగవంతునికి సర్వసమర్పణం అవుతాడు. అణువణువునా దివ్యత్వం భాసిస్తుంది.** తండ్రిగారు చనిపోయినపుడే 'రమణ'కు మరణం అంటే ఏమిటన్న జిజ్ఞాస కలిగింది. శరీరం వేరు, ఆత్మ వేరు అని నిర్ధారణకు వచ్చాడు. తనకు అరుణాచలేశ్వరుడే యోగేశ్వరుడు, ఈశ్వరుడు. ఆ విశ్వాసం వల్లనే రమణ అరుణాచలాన్ని తన గురువుగా చెప్పుకున్నాడు. అరుణాచల గురువే తన ఆత్మజ్ఞానానికి ఆధారం, మార్గదర్శి.

తన 'ఆత్మదర్శనం' అనుభవం గురించి రమణులు స్వయంగా చెప్పిన మాటలు : "మా చిన్నాన్నగారి మేడపైన ఒంటరిగా ఉన్నాను. నా ఆరోగ్యం బాగానే వుంది. ఒక్కసారిగా నన్ను మరణభయం ఆవహించింది. ఏమిటో, చనిపోతున్నాననిపించింది. ఎందుకలా అనిపించిందో ఇప్పుడు చెప్పలేను. భయానికి నిజంగా కారణం లేదు. డాక్టరు దగ్గరకు వెళ్లాలనిపించలేదు. పెద్దవాళ్లకు, స్నేహితులకు చెప్పాలనిపించలేదు. ఆ సమస్య ఏదో నేనే పరిష్కరించుకోవాలి".

"ఆ రోజునే "నేనెవరు?" అన్న తపన నాలో బయలుదేరింది. అలా అనిపించి శ్వాస బిగపట్టాను. లోపల శూన్యంలోకి చొచ్చుకు పోసాగాను. వెల్లకిలా పడుకుని శవంగా ఉండిపోయాను. నా శరీరం నిర్జీవం అయిందనిపించింది. అవును 'నేను చనిపోయాను' అయినా 'నేను' అన్న భావం బ్రతికేవుంది. అప్పుడు నాలో ప్రశ్నించుకున్నాను. 'నేను ఎవరు?' అది ఒక జీవశక్తి. చైతన్యం. అది నాది – నా స్వంతం. ఆ శక్తితోనే ఈ శరీరం బ్రతికి ఉంది, కదులుతోంది. వెంటనే నాకు కలిగిన 'మృత్యుభయం' నన్ను వదిలిపోయింది. చైతన్యం నాలో పెరిగింది. ఆ తర్వాత నన్ను నడిపింది ఆ చైతన్యమే ... 'నేను ఎవరిని?' అన్న జిజ్ఞాస ఆరంభం కాగానే ఒక ఆత్మశక్తి, ఏదో అలాంటిదే నాలో చోటు చేసుకుంది. లేదా నాలోనే పుట్టుకొచ్చిందేమో! అది నన్ను పూర్తిగా కమ్మింది.

"ఆ అనుభవంతో నా వైఖరి మారిపోయింది. అప్పటి వరకు ఏవో ఇష్టాలు, అయిష్టాలు అంటూ ఉండేవి. అన్నీ ఒక్కసారిగా పోయాయి. ఏది పెట్టినా తినసాగాను. అసలు తినడంపైన ధ్యాస పోయింది. ఏ పనులు చెప్పినా చేశాను. పిల్లలు అల్లరి చేసినా కోపం వచ్చేది కాదు. చదువంటే అసలు ఇష్టం పోయింది".

ఏ పని చేస్తున్నా ఒక్కటే భావన ... తనలోని 'నేను' తనని నడిపిస్తున్నదని. ఈ మానసిక పరివర్తన తర్వాత రోజూ మీనాక్షి దేవాలయానికి వెళ్లేవాడు. మీనాక్షి

సుందరేశుల్ని భక్తితో దర్శించేవాడు. శివుడు, నటరాజు, మీనాక్షి విగ్రహాల ముందు గంటల తరబడి నిలబడి చూడసాగాడు.

అజ్ఞానం నశించడమే జ్ఞానవాహిక. అందుకు తనకు అరుణాచలేశ్వరుని అనుగ్రహం పుష్కలంగా లభిస్తోంది. ఆ తర్వాత ఆత్మనిగ్రహం ఏర్పడ్డది. చంచలత్వం లేదు. మరో ఆలోచనకు తావు లేదు. చూడటానికి రమణలో చాలా మార్పు కనిపిస్తోంది. ఆరు వారాల పాటు నిత్యం మీనాక్షి దేవాలయానికి వెళ్లిన రమణుడు అరుణాచలేశ్వరం వచ్చి తనను నివేదించుకున్న తర్వాత ఎప్పుడూ తిరిగి దేవాలయంలో ప్రవేశించలేదు. 1896 సెప్టెంబరు నుండి 1907 నవంబరు వరకు మౌనంగానే ఉన్నాడు. పదకొండు సంవత్సరాల మౌనం. కొన్ని సంవత్సరాలు అసలు దేహ స్పృహ ఉండేదికాదు. ఆ తర్వాత బహిర్ముఖుడైన తర్వాత ముప్పయివేల భక్తుల సందేహాలను నివృత్తి చేశాడు.

ఒక భక్తుడు ప్రశ్నించాడు :

"భగవాన్, మీలో బయటకు చాలా మార్పులు కనిపిస్తున్నాయి?"

"అవును! ఎందుకంటే మీరు ఈ శరీరాన్నే 'నేను'గా భావిస్తున్నారు. నా శరీరమే 'నేను'గా మీరు భ్రమించినంతకాలం నా ఆత్మతత్వాన్ని గ్రహించలేరు. నిజానికి నాలో మార్పు లేదు. అప్పుడు, ఇప్పుడు నేను 'నేనే'. నాలో ఒక సంకల్పం లేదు. వాంఛ లేదు, వాసన లేదు, మార్పు లేదు. మామిడి గుహను చేరేవరకు కళ్లు మూసుకునే ఉన్నాను. తర్వాత కళ్లు తెరిచాను. అయినా నా లోపల పని ఎప్పటిలా సాగుతూనే వుంది. అంతే తేడా."

డి.ఎస్. శర్మ అనే భక్తుడు భగవాన్‌ని ప్రశ్నించాడు.

'తపస్సు, జ్ఞానోదయం, పరమాత్మలో ఐక్యం కావడం అంటారు. ఆ మూడు స్థితులు ఎలా ఏర్పడతాయి?'

భగవాన్ : నేను ఎప్పుడు ఎలాంటి సాధన చేయలేదు. అసలు సాధన అంటే ఏమిటో కూడా నాకు తెలియదు. ఎన్ని రకాల సాధనలున్నాయో నాకు ఎరుక లేదు. నాకు భిన్నమైంది ఏదైనా ఉంటే గదా ఆలోచించాలి. ఒక 'లక్ష్యం' ఏర్పడితే ఆ లక్ష్యసిద్ధి కోసం సాధన చేయాలి. నేను సాధించవలసింది ఏదీ లేదు. అప్పుడు కళ్లు మూసుకుని కూర్చున్నాను. ఇప్పుడు కళ్లు తెరచి కూర్చుంటున్నాను అంతే తేడా. నాకు ఎలాంటి సాధన లేదు. కళ్లు మూసుకుని కూర్చుంటే జనం దానిని 'సమాధి' అనుకుంటారు. మాట్లాడకపోతే 'మౌనం' అంటారు. నిజానికి నేను ఏమీ చేయను. ఏదో పరాశక్తి నన్ను నడిపిస్తుంది, అంతే నాకు తెలిసింది.



# 4. అరుణాచలం పిలిచింది!

**"యదహరేవ విరజే తదహరేవ ప్రవ్రజేత్ ।"**

*"ఇంటిపైన విరక్తి కలిగితే పారిపో! ఇది ఆర్యోక్తి!"*

**ర**మణలో అంతర్మథనం మొదలైంది. వివేకం విడిగి విప్పారింది. ఇంతకాలం అగమ్యంగా ఉన్న తనకు సుదూర తీరాలలో గమ్యం తెలియవచ్చింది. తను నమ్మిన ఆదర్శాలు ఏవీ లేకపోయినా అంతరాత్మ నడిపిస్తుందని, అటుగా నడవడమే మంచిదని నిర్ణయించుకున్నాడు. ఎవరికైనా ఆంతరంగిక పరిణామం కలిగితే పరిణతి అదే ఏర్పడుతుంది. అది బయటకు కనిపించదు. రమణలాంటి వారు అసలు బయటపడరు. ఇంట్లో వారికి, స్నేహితులకు మనసు తెలియనివ్వరు.

తనలో మార్పు చోటు చేసుకున్నతర్వాత ఆరు వారాలకు చదవడం మందగించింది. చిన్నాన్న, అన్నగార్ల సతాయింపు ఎక్కువైంది. ప్రతిదానికి ఏదో వంకన తిట్టడం. 1896 ఆగస్టు 29. స్కూలులో ఇచ్చిన ఇంగ్లీషు గ్రామరు ఇంపోజిషన్ రాస్తూ కూర్చున్నాడు మేడపైన. ముమ్మారు రాయాలి. రెండుసార్లు రాసేసరికి కలం మొరాయించింది. రాయడం నిలిపి ధ్యానంలో పడ్డాడు. లోపల 'తెర' తొలగింది. అన్నగారు అతని వాలకం చూచి "ఏమిటా కునికిపాట్లు" అని అరిచాడు. అది మొదటిసారి కాదు. రోజూ శాపనార్థాలు పెడుతూనే ఉంటాడు. ఈసారి రమణ మనస్సు బాగా గాయమైంది. అరుణాచలం తనను నిద్రలేపి నట్లయింది. ఇక ఇల్లు లాభం లేదు – తిరువణ్ణామలై వెళ్లిపోవాలి.

'స్కూలుకు వెడుతున్నాను. ప్రయివేటు క్లాసుంది' అని అన్నగారికి చెప్పి బయలుదేర బోతుండగా, నాగస్వామి పిలిచి "అయితే వెళ్లు, పెట్టెలో అయిదు రూపాయలు తీసుకుపోయి నా కాలేజీ జీతం కట్టు. కాలేజీ మీ స్కూలుకు దగ్గరేగా" అన్నాడు. హమ్మయ్య! తన ప్రయాణానికి డబ్బు అరుణాచలుడే ఈ రూపంలో పంపాడనిపించింది. క్రిందికి వెళ్లి, గబగబ నాలుగు మెతుకులు తిని అట్లాస్ చూచాడు. అది పాత రైలు టైం టేబుల్. తిరువణ్ణామలైకి దగ్గరి రైల్వేస్టేషన్ 'తిండివనం' అని చూచాడు. 1892లో విల్లుపురం నుండి తిరువణ్ణామలై మీదుగా కాట్పాడి రైలు లైను వేసిన సంగతి తెలియదు. టికెట్‌కు మూడు రూపాయలు సరిపోతాయనుకుని మూడు రూపాయలు తీసుకుని, మిగిలిన రెండు రూపాయలు పెట్టెలో ఉంచి ఒక ఉత్తరం రాసి పెట్టాడు.

"నేను నా తండ్రి ఆజ్ఞ మేరకు అన్వేషిస్తూ బయలుదేరుతున్నాను. ఇది సత్కార్యం. ఎవరూ నా కోసం విచారించవద్దు. నా కోసం వెతకనవసరం లేదు. డబ్బు దండగ ...

నీ కాలేజీ ఫీజు కట్టడం లేదు. రెండు రూపాయలు ఇక్కడే ఉన్నాయి ...

ఇట్లు"

ఉత్తరంలో సంతకం లేదు.

తన అన్వేషణకు తన వ్యక్తిత్వాన్ని వదులుకున్నాడు. ఇకపైన తానొక వ్యక్తి కాదు. తాను వెంకట్రామన్ కాదు. సంతకం చేయకపోవడం కావాలని చేసిన పని. రమణలోని పరిణామానికి ఆ ఉత్తరంలోని పదాలు, అక్షరాలు నిదర్శనాలు. 'అన్వేషణ' అనడంలో రెండు అర్థాలున్నాయి. తిరువణ్ణామలై గురించి విన్నాడు తప్ప అది ఎక్కడున్నదో తెలియదు. వెతుక్కుంటూ పోవాలి, అది అన్వేషణ. రెండు: తండ్రిగారి ఆజ్ఞమేరకు 'తండ్రిని వెతుక్కుంటూ వెళ్లడం'. తండ్రి అంటే ఈశ్వరుడని. ఈశ్వరుని 'జగత్పిత' అంటారు. "జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌః" అన్నాడు మహాకవి కాళిదాసు. ఇది ఆ 'జగత్పిత' ఆహ్వానం.

ఉత్తరం పెట్టెలో ఉంచి, హడావుడిగా స్టేషనుకు నడిచాడు. ట్రెయిన్ 11-45కి. అప్పుడు 12 గంటలైంది. అయినా సందేహం లేకుండా స్టేషన్ చేరాడు. తను ఆలస్యంగా వచ్చినా, రైలు ఆరోజు ఆలస్యంగా వచ్చింది. అది కలిసిరావడం. తిండివనానికి టికెట్ తీసుకోగా మూడణాలు మిగిలాయి. తిరువణ్ణామలైకి టిక్కెట్టు తీసుకుంటే మూడురూపాయలు సరిపోయేవి. తెలియక చేసిన తప్పిదం అది.

రైలు మదురై వదిలి ఒకటి రెండు స్టేషన్లు దాటే సరికి ఒక గడ్డం సాయిబు గారు వచ్చి అడిగాడు "ఏ ఊరు పోవాలి స్వామీ"

రమణ జవాబు "తిరువణ్ణామలై. తిండివనం వరకు టికెట్ తీశా".

'కొత్తవాడివా? నేనూ అక్కడికే. మనం విల్లుపురంలో రైలు మారాలి.'

తిరుకోయిలర్ వరకు వస్తానన్న మౌల్వీసాహెబ్ ఎక్కడ దిగిపోయాడో రమణ గమనించలేదు. విల్లుపురంలో రైలు మారి వేరే రైలు ఎక్కాలి అని మాత్రం గుర్తుంచుకున్నాడు.

సాయంత్రం వరకు ఆత్మలో లీనమై కాలం గడిపాడు. తిరుచిరాపల్లి స్టేషన్ చేరే సరికి ఆకలైంది. రెండు అరటిపళ్లు కొన్నాడు. ఒకటి తినేసరికి ఆకలి తీరింది. మళ్లీ సమాధి. తెల్లవారు ఝామున 3 గం॥లకు రైలు విల్లుపురం చేరింది. రైలు దిగిపోయాడు. అక్కడి నుండి తిరువణ్ణామలై నడిచిపోవాలి. తెల్లవారిన తర్వాత విల్లుపురం వీధులన్నీ తిరిగాడు. తిరువణ్ణామలైకి ఎటుపోవాలో తెలియలేదు మాంబలపట్టు బోర్డు కనిపించింది. అదే మార్గం.

రోడ్లు తిరిగి తిరిగి అలసిపోయాడు. ఆకలి వేస్తోంది. ఒక హోటల్ కనిపించింది. భోజనం పెట్టమని అడిగాడు. "ఇంత పొద్దుటే భోజనం ఏమిటి బాబూ ... మధ్యాహ్నం వరకు ఆగు" అన్నాడు హోటల్ వాడు.

కుర్రవాడు ఎర్రగా, బుర్రగా ఉన్నాడు. అందంగా ఆకర్షణీయంగా ఉన్నాడు. గిరజాల జుట్టు. బుద్ధిమంతుడే. చెవులకు ఎర్రరాళ్ల దుద్దులున్నాయి. కలవారింటి బిడ్డడే.

భోజనం చేశాక, రమణ తనదగ్గరున్న డబ్బులిచ్చాడు. హోటల్ వాడు మంచి మనసుతో ఆ చిల్లర తీసుకోకుండా "వద్దులే స్వామీ నీవే ఉంచుకో" అని పంపాడు.

స్టేషనుకు చేరి మాంబళంపట్టుకు టికెట్ కొన్నాడు. ఉన్న డబ్బుకు అంత వరకే టికెట్టు వచ్చింది. మధ్యాహ్నం 3.00 గంటలకు మాంబళంపట్టు చేరాడు. తన గమ్యం ఇంకా 30 మైళ్ల దూరం. అంతదూరం నడవక తప్పదు. డబ్బు లేదు.

పదిమైళ్లు నడిచి, చీకటి పడే సమయానికి అరియని నల్లార్ దేవాలయం చేరుకున్నాడు. ఎండలో నడిచి బాగా అలసిపోయాడు. దేవాలయం తలుపులు తెరిచే వరకు అక్కడే కూర్చున్నాడు. తలుపులు తెరిచాక లోపలకు వెళ్లి మండపంలో కూర్చున్నాడు. అక్కడ కాస్త వెలుతురుగా వుంది. అంతలో దేవాలయ ప్రాంగణం అంతా మహాకాంతితో నిండినట్లనిపించింది. దేవాలయం నుండి వచ్చిన వెలుగేమో అనుకున్నాడు. కాని కాదు. వెలుగు మాయమైంది. తను ధ్యాన స్థితికి చేరుకున్నాడు. గుళ్లో అర్చన అయింది. వెళ్లి పూజారిని అడిగాడు "తినడానికి ఏమైనా పెట్టండి – చాలా ఆకలిగా వుంది".

"ఇక్కడ ప్రసాదాలు నైవేద్యాలు ఉండవయ్యా. కిలూర్ దేవాలయానికి వెళ్లు అక్కడ ప్రసాదం పెడతారు" అన్నాడు పూజారి.

కాస్త దూరంలో ఉన్న 'కిలూర్' ఆలయానికి చేరుకున్నాడు. అక్కడా విధి ఎదురు తిరిగింది. ప్రసాదం పెట్టడానికి పూజారి ససేమిా ఒప్పుకోలేదు.

రమణ దైన్యం, తీరు తెన్నులు గమనించిన డోలు వాద్యకారుడు గుడిలో తనవంతు ప్రసాదం రమణకు పెట్టించాడు. అది తినాలంటే గొంతు తడారి పోతోంది. మంచినీళ్లు తాగడానికి బావిదగ్గరకు పోతూ కళ్లు తిరిగి పడిపోయాడు. చేతిలోని ప్రసాదం నేల పాలైంది. కళ్లు విప్పే సరికి చుట్టూ జనం. ఎవరో నీళ్లివ్వగా త్రాగి, క్రిందపడ్డ ప్రసాదం ఏరుకుని తిని, నేలపైన పడుకుండిపోయాడు. ఆ రాత్రి ఆ కుర్రవాడి దీన స్థితి చూచి రాళ్లు సైతం కన్నీరు కార్చాయి.

మర్నాడు ఆగస్టు 31. గోకులాష్టమి. రమణ ఒక ఇంటి ముందు ఆగాడు. అది ముత్తుకృష్ణ భాగవతార్‌ది. అన్నం పెట్టించమని అడిగాడు. భాగవతార్ దంపతులు సంతోషించారు. అతిథిగా వచ్చిన కుర్రవాడిని చూచి, చక్కని భోజనం పెట్టారు. తన చెవి కమ్మలు భాగవతార్ వద్ద తాకట్టు పెట్టి నాలుగు రూపాయలు తీసుకున్నాడు. ఆయన ఒక రసీదు ఇచ్చాడు. వీలైనపుడు వచ్చి కమ్మలు విడిపించుకోమని ... బయటకు రాగానే ఆ చీటీ చించి పారేశాడు తనకింక కమ్మలతో పనేమిటి? ప్రయాణంలో తినడానికని, భాగవతార్ భార్య చిరుతిండ్లు మూటకట్టి ఇచ్చింది. తెల్లవారిన తర్వాత రైలు. రాత్రికి స్టేషన్‌లోనే పడుకున్నాడు. విధి ఎటు తీసుకుపోతుందో అంతా ఆ 'తండ్రి' ఇష్టం!





## 5. అదివో ... అరుణాచలం!

**అనన్యాశ్చింతయంతే మాం యేజనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం మహామ్యహం**

[నన్ను ఆశ్రయించిన వారి, నన్ను ఉపాసించిన వారి
యోగక్షేమాలు నేను విచారిస్తాను].

భగవంతుడు భక్తునికిచ్చిన హామీ అది! భగవంతుని పట్ల అంతటి భక్తి ప్రపత్తులుండి, సమర్పణ చేసుకుంటే ఆ భక్తుని భగవంతుడు కరుణిస్తాడు, కనికరిస్తాడు.

1896 సెప్టెంబరు 1 ఉదయం.

రమణ తిరువణ్ణామలై స్టేషన్‌లో రైలు దిగాడు. నేలపైన కాలు మోపగానే తనువెల్ల ఒక్కసారిగా పులకరించింది. శరీరంలో విద్యుత్ ప్రవహించినట్లయింది. చుట్టూ చూచాడు. అది తన కలల లోకం. అది తను కోరుకున్న కైలాసం. అల్లంత దూరంలో అరుణాచలేశ్వరుని దేవాలయ గాలి గోపురాలు దర్శనమిచ్చి, రా, రమ్మని పిలుస్తున్నాయి. తనివి తీరా గోపురాలు తిలకించాడు. ఉదయ సూర్య కాంతిలో మెరుస్తున్నాయి. లోపల ఆత్మ రెపరెపలాడింది. కళ్లు చెమర్చాయి ఆనంద పారవశ్యంతో.

తండ్రి పిలుపు విని తను వచ్చాడు. ఇంక ఈ జన్మలో ఎడబాటు ఉండదు. వడివడిగా నడుస్తూ అరుణాచలేశ్వరుని ఆలయం చేరుకున్నాడు. చిత్రం! అన్ని ద్వారాలు తెరచి ఉన్నాయి. తన రాకకోసం నిరీక్షిస్తున్నాయి. ఎక్కడా ఒక్క మనిషి

జాడలేదు. తనకు ఈశ్వరుడే స్వయంగా స్వాగతం చెబుతున్నట్లు తోచింది. సరాసరి గర్భాలయంలో ప్రవేశించాడు. అరుణాచలేశ్వరుని సన్నిధికి చేరుకున్నాడు. గుండె దడదడలాడుతోంది. హృదయంలో ఉద్వేగం.

"తండ్రీ! నేను వచ్చాను" అని ఏడ్చేశాడు. ఆ క్షణంలోనే గతం పైన తెరపడ్డది. సర్వం మరచిపోయాడు. తనను తానే మరచిపోయి పరవశమైనాడు. ఆత్మ జాగృతమైంది. కొన్ని నిముషాల ఆత్మానందంతో జ్ఞానోదయమైంది.

మహాత్ముల జీవితాలన్నీ అంతే. అందరి జీవితాలు అలా ఒక్క క్షణంలో పరిణామం చెందినవే. **క్షణంలో వ్యక్తిత్వం నశించి, దివ్యత్వం పైకొస్తుంది. ఒక రూపం ద్వారా ఏర్పడిన భక్తి అరూపంలోకి పరిక్రమిస్తుంది. తన చైతన్యమే, తన ఆత్మే తనకు మార్గదర్శి అవుతుంది. ఆత్మే గురువు బాధ్యతలు తీసుకుంటుంది. ఆత్మే సత్యాన్ని గ్రహిస్తుంది.**

రమణ కథ వేరు. ఆయనకు గ్రంథ పరిచయం లేదు. పూర్వజ్ఞానం లేదు. గురువుల శుశ్రూష లేదు. అరుణాచలేశ్వరుడే తన గురువుగా భావించాడు. అంచేత ఆ అరుణాచలేశ్వరుడే తనకు సర్వస్వం. తనను సమర్పించుకున్నాడు. ఇంక తన భవిష్యత్తు? తన మార్గం? తన గమ్యం? సర్వం ఈశ్వరార్పణం.

ఇప్పుడు ఎక్కడికి వెళ్లాలి? ఎవరూ తెలియదు. దేవాలయం నుండి బయటకు రాగానే ఎవరో పంపినట్లు ఒకవ్యక్తి వచ్చి "తల నీలాలు సమర్పిస్తావా బాబూ?" అని అడిగాడు.

"ఊఁ" తల ఊపాడు.

అతను తనను అయంకుళం చెరువు వద్దకు తీసుకువెళ్లాడు. అక్కడ క్షురకులు చాలామంది ఉన్నారు. తన ఆమోదం, ప్రమేయం లేకుండానే ఒకతను తల నున్నగా గొరిగాడు. అందమైన ఉంగరాల జుత్తు ఈశ్వరార్పణం. దాంతో తన అందమంతా 'హుష్‌కాకి' అయింది. గుండు చేయించుకోవడం సన్యాసానికి తొలి 'ఉపాకర్మ'. వెంటనే యజ్ఞోపవీతం విసర్జించాడు. మిగిలిన డబ్బు, తెచ్చుకున్న స్వీట్లు విసిరికొట్టాడు. కిలూర్‌లో భాగవతార్ భార్య ఇచ్చిన చిరుతిండి అది. అదే చివరి రోజు రమణ డబ్బు ముట్టడం. ఆ తర్వాత డబ్బు చేతితో తాకింది లేదు. యజ్ఞోపవీత విసర్జనతో కులాన్ని, డబ్బును త్యజించడంతో వాంఛల్ని, తిండిని వదలడంతో సర్వాన్ని త్యజించాడు.

రమణ కట్టుకున్న ధోవతి చింపి 'కౌపీనం' ధరించి, మిగిలిన బట్టను అక్కడ వదలిపెట్టాడు. ఎంతటి నిస్సంగత్వం! ఎండ, వాన, చలి – ఏవీ గుర్తు

లేవేమో! ఆయన చివరి వరకు కౌపీనాంబరధారిగానే ఉన్న విషయం అందరికీ తెలిసిందే.

సంప్రదాయానుసారం శిరోముండనం తర్వాత తలస్నానం చేయాలి. రమణకు ఆ విషయం తెలియదు. శరీరానికి స్నానంతో ఏం పని? శుచి, శుభ్రం కావాలనుకుంటే గదా స్నానం! ఆయన తిరిగి గుళ్లో ప్రవేశించబోతుండగా, వర్షపుజల్లులు పడి తడిసి పోయాడు. ఆ రాత్రి కుండపోత వర్షం.

రమణ మహర్షి స్వర్ణోత్సవం నాడూ అలాగే కుంభవర్షం కురిసింది. ఆనాడు భగవాన్ 1896 సెప్టెంబరు 1 నాటి వర్షాన్ని గుర్తుకు తెచ్చుకుని అన్నారు: "నేను తిరువణ్ణామలై వచ్చిన నాటి రాత్రి ఇలాగే వర్షం కురిసింది. చాలా ఏండ్లుగా ఇక్కడ వర్షాలు లేవుట. నేను వచ్చిన రోజు రాత్రి వాగులు, వంకలు పొంగి పొర్లేంత వర్షం కురిసింది. నేను మండపంలో తల దాచుకున్నాను. ఆ రోజు ఉదయమే నా బట్టలు విసర్జించాను, స్వయంకృతం. గోచీ తప్ప ఏమీ లేవు నా వద్ద. చలి దుర్భరంగా వుంది. విపరీతంగా ఈదురుగాలులు. మండపం నుండి పరిగెత్తిపోయి ఒక ఇంటి పంచన చేరాను. అర్ధరాత్రి ఇంటి వారు తలుపులు తెరిచి బయటకొచ్చారు. నేను గుళ్లోకి పారిపోయాను. ఇప్పుడు మళ్లీ అంత వర్షం కురిసింది".

జుత్తుకున్న స్వేచ్ఛ మనుషులకేది? కొద్దిరోజుల్లోనే జుత్తు పెరిగింది. జడలు కట్టి, తల బుట్టలా తయారైంది. ఏడాదిన్నర తర్వాత ఎవరో వచ్చి దయతలచి గుండు చేయించారు. అంత తలబరువు ఒక్కసారిగా పోవడంతో అసలు తనకు తలే లేదనిపించింది.

రమణ తను గుడిలోఉన్న రోజుల్లో జరిగిన ఒక సంఘటన ఇలా చెప్పారు. "అప్పటికి నేను దేవాలయం ప్రవేశించి నాలుగు మాసాలైంది. స్నానం లేదు ఆ నాలుగు నెలలు. ఒక భక్తురాలు వచ్చి బలవంతంగా స్నానం చేయించింది. ఆమె పొన్నుస్వామి గారి భార్య. అకస్మాత్తుగా వచ్చి నన్ను బలవంతంగా ఈడ్చి, కూర్చోబెట్టి శీకాయరసం పోసి తలంటి స్నానం చేయించింది. ఆమె అప్పుడప్పుడు దేవాలయానికి వస్తుంది. అలాగే వచ్చిందనుకున్నాను. కానీ ఆమె నా భరతం పట్టడానికే వచ్చిందని నాకేం తెలుసు!"

రమణ గురుమూర్తంలో ఉండే రోజుల్లో 'మీనాక్షి' అనే ఇల్లాలు బలవంతంగా స్నానం చేయించి పుణ్యం మూటకట్టుకుపోయింది. పళనిస్వామి వచ్చి చేరాక నిత్యస్నానం అలవాటైంది.



# 6. తపస్సు

**హృదయ కుహర మధ్యే కేవలం బ్రహ్మమాత్రం**
**హ్యహ మహమితి సాక్షాదాత్మరూపేణ భాతి**
**హృది విశ మనసా స్వం చిన్వతా మజ్జ తావా**
**పవన చలన రోధా దాత్మ నిష్ఠో భవత్వం ॥**

*హృదయం లోపలి గుహలో 'ఆత్మ'గా ప్రకాశిస్తున్న బ్రహ్మమే నేను. ఆత్మలో స్థిరపడడమే ధ్యానం. ఆత్మకోసం అన్వేషించవచ్చు. ఆత్మకై తన లోపల తను లీనం కావచ్చు. ప్రాణక్రియను అదుపు చేసి ఆత్మను జాగృత పరచుకోవచ్చు. లేదా మనస్సును హృదయంతో ఏకం చేయవచ్చు. ఏ ప్రక్రియ వల్లనైనా ధ్యాన గమ్యం సిద్ధిస్తుంది.*

రమణుడు తాను గమ్యస్థానం చేరుకున్నా ననుకున్నాడే కాని, 'గమ్యం' ఇంకా చాలా దూరంగానే వుంది. ఇది నా తండ్రి ఇల్లు అనుకున్నాడు గాని, తనకు ఉండడానికి ఒక 'పంచ' లేదు. తినడానికి తిండి లేదు. కట్ట బట్ట లేదు. ఒక భిక్షువులాగా మారాడు.

తను కాలు మోపిన అరుణాచలేశ్వరాలయం పెద్దది. చాలా విశాలమైంది. ఏ మూల చీకటిలో కూర్చున్నా గడిచిపోతుంది. ఏ చెట్టుచాటున విశ్రమించినా సాగిపోతుంది. అరుణాచలేశ్వరాలయం అత్యద్భుతమైన శిల్పకళారామం. అది కేవలం దేవళం అనిపించదు. ఎత్తయిన ప్రహరీలతో రాజ ప్రాసాదం అనిపిస్తుంది. అవి కోట గోడలకు సరిపోల్చదగ్గవి. అనుక్షణం ఏదో ఒక మూల నుండి గుడి

గంటలు వినిపిస్తుంటాయి. భక్తులు అనవరతం వస్తూ పోతుంటారు. ఏ మూల ఏ మండపంలో చూచినా సాధువులు, సన్యాసులు, బైరాగులు, బిచ్చగాళ్లు కనిపిస్తారు. తేవారం, తిరుప్పుగళ్ విన వస్తుంటాయి. వేద పఠనం జరుగుతుంది. గాలి గోపుర మందిరాలలో, మండపాలలో వేదఘోష వినిపిస్తుంటే అది ఋష్యాశ్రమం కాదు గదా! అనిపిస్తుంది.

వేల సంవత్సరాలుగా ఎందరో రుషులు, తాపసులు ఆ దేవాలయాన్ని దర్శించారు. సాక్షాత్తు దేవతలు, కిన్నెర కింపురుషులు దిగి వచ్చి గిరి ప్రదక్షిణ చేసి ఈశ్వర దర్శనానికి వస్తుంటారని ప్రతీతి. నిజమేనేమో! ఆలయ ప్రాంగణంలో నడుస్తుంటే ఓంకార నాదాలు వినిపిస్తాయి. గాలి కెరటాలలో ప్రణవనాదం వినిపిస్తుంది. ఏనోట విన్నా 'ఓం నమశ్శివాయ' మంత్రోచ్చారణే. అది ధ్యాన గాములకు కైలాస సదృశం. 'ఆత్మ' చోదకులకు హిమాలయం. అది మహిమాలయ పాదపీఠిని అలంకరించిన దేవాలయం. ఆత్మదర్శనాభిలాషులకు అది తపోవనం. బాహ్య ప్రపంచాన్ని విస్మరించి, సన్యసించి తపస్సే జగత్తుగా భావించేవారికి సుక్షేత్రం. జ్ఞానులకు స్వక్షేత్రం. సామాన్య భక్తావళికి పవిత్రక్షేత్రం – అది పావనతీర్థం.

ఇక్కడ దేవాలయం ఒక్కటే వైభవం కాదు. ప్రాంగణంలో తోటలు, ప్రాకారాలు, ఆకాశాన్నంటే గోపురాలు, గోపురాల నీడలు అన్నీ విభవాలే. ప్రాగ్దిశనున్న గాలిగోపురం 216 అడుగులు ఎత్తు. పదమూడు అంతస్థులు. దగ్గరగా చూస్తే శిఖర దర్శనం కాదు. దేవాలయ ప్రాంగణం నిడివి 1480 అడుగులు. వెడల్పు 680 అడుగులు. లోపల చిన్నచిన్న ఆలయాలు, మందిరాలు లెక్కలేనన్ని. లోపల అనేక ఏకాంత ప్రశాంత ప్రదేశాలున్నాయి.

రమణ పరివ్రాజకుడు. సన్యాసి. దాచుకోవలసిన సంపదలు లేవు. వాడుకునే వస్తువులు లేవు – గోచీ తప్ప. పరమశివుని అపరావతారం ఆయనది. ఎక్కడ కూర్చున్నా కాలం గడిచిపోతుంది. పక్షులకు సైతం గూళ్లున్నాయి. రమణుని 'గూడు' ప్రస్తుతానికి గుడి. ఇంటికంటే గుడి పదిలం తనబోటి వారికి. భూమంత అరుగు, ఆకాశమంత ఆచ్ఛాదన – మండపం. వేగాళ్ల మండపాన్ని ఆశ్రయించాడు. ఎక్కడ కూర్చుంటే అక్కడే అచేతనంగా ఉండిపోసాగాడు. అది ధ్యానమా? తపస్సా? తెలియదు. శరీరం తెలియని స్థితి, మనస్సు పనిచేయని స్థితి. ఇంద్రియాలు సెలవు తీసుకున్న స్థితి. అంతా నిశ్శబ్దం. శరీరం వేరై తాను వేరైన స్థితి. ఈ రోజు ఇక్కడ, రేపు మరొకచోట, మరొక రోజు మరెక్కడనో. దేవాలయ ప్రాంగణంలోని అన్ని తావులు తనవే. అలా ఒక సంవత్సరం గడిచింది. గడుస్తోంది.

రమణమహర్షి తపశ్చర్య ఒక్కటే అయినా, స్థూల పరిశీలనలో నాలుగు అంచెలుగా సాగినట్లు అనిపిస్తుంది.

మొదటిది : తొలి అనుభవం తర్వాతి ఆరు వారాలు. అప్పటికింకా విద్యార్థి దశ. కుటుంబ సభ్యులకు తన ఆంతర్యం అంతు చిక్కనీయకుండా, గుంభనగా అంతర్యామిని ఆరాధించిన సమయం అది. కాస్త వ్యవధి చిక్కితే చాలు అంతర్ముఖుడయ్యేవాడు.

రెండవ విభాగం : 1896 సెప్టెంబరు 1న తిరువణ్ణామలై వచ్చిన నాటి నుండి 1907 నవంబరు వరకు పూర్తి మౌనంగా గడిపిన కాలం. అది సుదీర్ఘ తపస్సు. గణపతి మునికి తపస్సుకు అర్థం వివరించడానికై మౌనం వదిలారు.

ఆ తర్వాత మూడవ శ్రేణి : భక్తులు, అభిమానులు కొద్దిమందే అయినా వారి సందేహాలకు సమాధానాలు ఇచ్చేవారు. ఎక్కువ కాలం మౌనంగా, ధ్యానంలో ఉండేవారు.

తర్వాత నాల్గవ శ్రేణి : రమణాశ్రమం ఏర్పడిన తర్వాత, 1940–50 మధ్య కాలం ఆ పది సంవత్సరాల కాలంలో రమణకీర్తి దశ దిశలా వ్యాపించింది. విదేశాల నుండి భక్తులు గుంపులుగా వచ్చిన కాలం అది. ఎవరైనా ఎప్పుడైనా రమణ మహర్షిని దర్శనం చేసుకునే వీలు కలిగింది. వారి సమక్షంలో ధ్యానం చేసుకునే అవకాశం ప్రతిఒక్కరికీ కలిగింది.

పైకి ఎలా కనిపించినా రమణ మహర్షి ఆంతర్యం మారలేదు. అంతర్యామిత్వం మారింది లేదు. ప్రతిక్షణం ఆత్మానుసంధానం జరుగుతూనే ఉంది. 'ఆత్మవిచారణ' సాగుతూనే ఉంది. అది రమణీయతత్వం.

రమణ మహర్షి తపస్సు ప్రారంభమైంది అరుణాచలేశ్వరాలయంలో ముందున్న వేయి స్తంభాల మండపంలో. శరీర స్పృహ లేకుండా నిశ్చలంగా ధ్యానంలో ఉండిపోయేవాడు. అక్కడే నివాసం. తలక్రింద చేయి పెట్టుకొని పడుకునేవాడు. కరతల భోజనం. ఎవరైనా పెడితే చేతిలో పెట్టించుకుని తినడం. రోడ్డు ప్రక్కల విసిరేసిన పాత గుడ్డలు ఏరి తెచ్చుకునేవాడు. రాత్రో పగలో తెలియదు. అంత దీర్ఘ తపస్సు. కొత్తవాడు, మరీ వయసు మీరినవాడు కాదు. దేవాలయంలో అల్లరిపిల్లలు ఆటపట్టించేవారు. రాళ్లు రువ్వేవారు. అంతకు పూర్వమే తిరువణ్ణామలై చేరిన శేషాద్రి స్వామి ఈ బ్రాహ్మణస్వామికి రక్షగా నిలిచాడు.

అక్కడ ధ్యానానికి అంతరాయం ఎక్కువైంది. వేయిస్తంభాల మండపంలో ఒక పాతాళ గుహ ఉంది. అది కటిక చీకటిగా ఉంటుంది. ఎవరూ అందులోకి వెళ్లరు. రమణ మహర్షి ఆ పాతాళ లింగ గుహను ఎన్నిక చేసుకొని అందులో

తపస్సు ప్రారంభించాడు. దాని నిండా చీమల పుట్టలు, దోమల బాధలు. అవి కదలక మెదలక కూర్చున్న మనిషిని తినసాగాయి. రమణుని తొడలు వాచి, పుళ్లయ్యాయి. రక్తం, చీము స్రవించసాగింది. గుహలో చేరినందువల్ల పిల్లల రాళ్ల బాధ తప్పిందిగానీ చీమల, దోమల బాధ అధికమైంది. అది కనిపెట్టి పిల్లలు రాళ్లు రువ్వసాగారు. ఆ సంఘటన గురించి వెంకటాచల మొదలి ఇలా రాశారు.

"ఒకరోజున నేను అటుగా వెళుతున్నాను. పిల్లలు మండపంలోని గుహవేపు రాళ్లు రువ్వడం కనిపించింది. నాకు కోపం వచ్చి బెత్తం తీసుకుని వెంటపడ్డాను. పిల్లలు పారిపోయారు. అంతలో చీకట్లోంచి శేషాద్రి బయటకొచ్చారు. నేను అప్రతిభుడనైనాను. అడిగాను "స్వామీ! వాళ్లు విసిరిన రాళ్లు మీకు తగల లేదు గదా?"

శేషాద్రి : "లేదు గాని లోపల చిన్న స్వామి ఉన్నాడు. వెళ్లి చూడు" అన్నాడు.

గుహవేపు వేలు చూపించి, శేషాద్రి నిష్క్రమించాడు.

లోపలకు వెళ్లాను. చాలాసేపటివరకు ఏమీ కనిపించలేదు. వెలుతురు లోంచి చీకట్లోకి వచ్చానేమో వెంటనే చూపు ఆనలేదు. తర్వాత అక్కడ ఎవరో ఉన్నట్లు అనిపించింది. నాకు భయం వేసింది. గబగబ పక్క తోటలోకి వెళ్లాను. అక్కడొక సాధువు, ఆయన శిష్యులు ఏవో పనులు చేస్తున్నారు. వాళ్లకు సంగతి చెప్పి నా వెంట తీసుకు వచ్చాను. లోపల చిన్న స్వామి కదలక, మెదలక కూర్చుని ఉన్నాడు. మా అడుగుల సవ్వడికి కళ్లు విప్పలేదు. మేం ఆయన్ని మోసుకుని బయటకు తీసుకువచ్చాం. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి గుడి ముందుకు తెచ్చాం. అయినా స్వామికి తెలివి రాలేదు. సమాధిలోనే ఉన్నారు. కాళ్లు, తొడలు పుండ్లు పడ్డాయి. అంత బాధను విస్మరించి ఎట్లా ధ్యానం చేస్తున్నాడాయన ... ఒళ్లు తెలియకుండా, స్పృహ లేకుండా. ఆయన ధ్యానానికి భంగం కలిగించడం మహా పాపమని భయపడి మేము ఇవతలకు వచ్చాం".

బ్రాహ్మణ స్వామిగా రమణ రెండు నెలలు సుబ్రహ్మణ్యాలయంలో ఉన్నాడు. అది నిశ్చల సమాధి. అక్కడ ఉండే మౌని స్వామి అనే బైరాగి రమణను కనిపెట్టి ఉండేవాడు. అమ్మవారి విగ్రహానికి పంచామృతాభిషేకం చేస్తే అది తెచ్చి బ్రాహ్మణ స్వామికి యిచ్చేవాడు. నీరు, పాలు, పసుపు నీళ్లు, పంచదార, అరటిపండు కలిపిన పంచామృతం. పసుపు కలవడంవల్ల కషాయంగా ఉండేది. దేవాలయ పూజారి అది గమనించి ఉమాదేవి విగ్రహానికి ముందుగా పాలాభిషేకం చేసి, ఆ పాలను గిన్నెలో పట్టి మౌని స్వామికి యిచ్చేవాడు. అదే బ్రాహ్మణస్వామికి రెండు నెలలు ఆహారం, ఆధారం. అక్కడ నుండి తన నివాసం తోటలోకి మార్చుకున్నాడు. పది

పన్నెండు అడుగుల ఎత్తున్న చెట్టు క్రింద కూర్చుని ధ్యానం చేసేవాడు. ధ్యానం ముగిసే వేళకు ఎక్కడో ముళ్ల పొదల మధ్యన ఉండేవాడు. స్పృహలేని సమయంలో అలా పాకుతూ, దొర్లుతూ, దేకుతూ వెడుతుండేవాడు."

తర్వాత రమణ వాహన మండపం చేరుకున్నాడు. అక్కడ ఊరేగింపు రథాల మధ్య నిశ్చింతగా ఉండేది. రమణ స్మృతుల్లోంచి : "వాహనాల మధ్య చిన్న సందు ఇరుకు. ఆ లోపలకు వెళ్లి పెద్ద రథం చాటున కూర్చునేవాడిని. రథం క్రింద హాయిగా ఉండేది. బల్లిలాగా పాకుతూపోయేవాడినన్న మాట. ఏదో శక్తి నన్ను అలా నడిపించేది. నేనుగా వెళ్లడం ఎలా సాధ్యం! నాకేమీ తెలియదు. చిత్రం ... ఒక్కరోజున కూడా నేను రథానికి గాని, గోడలకు గాని కొట్టుకోవడం, దెబ్బ తగలడం జరగలేదు."





# 7. గురుమూర్తం

**తి**రువణ్ణామలైలో కార్తీక దీపోత్సవం విశేషంగా జరుగుతుంది. 1890 డిసెంబరులో ఆ ఉత్సవానికి వేలాది భక్తులు హాజరైనారు. అరుణాచలేశ్వరుని సేవించుకున్న భక్త సందోహానికి బ్రాహ్మణ స్వామి రెండవ ఆకర్షణ. స్వామి నిశ్చల సమాధిలో ఉండడం పలువురిని ఆకర్షించింది. అందరికీ వార్త అందింది. ఎవరో మహా పురుషుడు ఎక్కడ నుండి వచ్చాడో ఎవరికి తెలుసు! హిమాలయ పర్వతాల నుండి వచ్చి ఉండవచ్చు. అవతార పురుషుడై ఉండవచ్చు. భక్తులు వచ్చి స్వామిని దర్శించి నమస్కారాలు చేయసాగారు. అలా వచ్చిన భక్త శిఖామణి ఉద్దండి నాయనార్. రమణ స్వామిని చూచిన క్షణంలోనే నాయనార్ మనస్సు పురివిప్పి నాట్యం చేసింది. అబ్బ! ఏమి నిష్ఠ! ఏమి తపస్సు! ఏమి తేజస్సు! చేష్టలుడిగాయి. నోట మాటరాక ఆరాధనతో చూడసాగాడు. రమణుని చూడగానే అతని మనస్సు చల్లబడ్డది. మనశ్శాంతి కలిగింది. దర్శనార్థం వస్తున్న భక్తుల్ని అదుపుచేసే బాధ్యత తీసుకున్నాడు. స్వామికి అంతరాయం కలగకుండా జనాన్ని దూరం నుండే దర్శించుకునే ఏర్పాటు చేశాడు. అందరూ నిశ్శబ్దం పాటించాలి! శబ్దం చేస్తే స్వామి సమాధికి భంగం!

**ఉద్దండి నాయనార్ రమణ స్వామికి తొలిశిష్యుడు.** స్వామి ఎప్పుడూ ఎవరికీ తను గురువునని చెప్పలేదు. ఎవరికీ దీక్ష యివ్వలేదు. ఉపదేశం చేయలేదు. అందరూ స్వచ్ఛంద శిష్యులే. ఫలానా వారి శిష్యులమని చెప్పుకోవడం భక్తులకే గౌరవం! అసలు రమణ మహర్షికే గురువు లేదు. ఆయన ఎవరి వద్ద ఉపదేశం పొందలేదు. ఎవరికీ శిష్యరికం చేయలేదు.

ఇప్పచెట్టు నీడలో రమణ స్వామి ధ్యానం. తొలి సందర్శనంలోనే నాయనార్ తనకు సద్గురువు లభించినట్లు తృప్తి చెందాడు. 'ఈయన నా గురువు' అని తలపోయగానే మనస్సు ప్రశాంతమైంది. ఆలోచనలు, ఆందోళనలు సమసి పోయాయి. అదే గుర్తు ! అదే సద్గురు సందర్శనఫలం ! స్వామి సేవనం మహద్భాగ్యంగా భావించాడు. స్వామికి కావలసినవన్నీ సమకూర్చసాగాడు.

ఉద్దండి నాయనార్ తిరువణ్ణామలై పక్కన ఉన్న తిరువని గ్రామవాసి. మొరటువాడు. శరీర దారుఢ్యం ఎక్కువ. రెండెడ్ల బండికట్టి సరుకులు రవాణా చేస్తుంటాడు. మంచివాడు. తమిళంలో వేదాంత గ్రంథాలు చాలా చదివినవాడు. ఆధ్యాత్మిక తపన గలవాడు. యోగ వాశిష్టం, కైవల్య నవనీతం వంటి పెద్ద తాత్విక గ్రంథాలు అధ్యయనం చేశాడు. నాయనార్ రమణ ప్రక్కన ఉండడంవల్ల అల్లరిపిల్లల గోల తగ్గింది. ఆయన పనిబడి బయటకు వెళ్లినప్పుడు అల్లరిపిల్లలు రెచ్చిపోతుండేవారు. వచ్చి అల్లరిచేసి ధ్యానభంగం కలిగిస్తుండేవారు. ఒకసారి రమణస్వామి ధ్యానంలో ఉండగా ఒక కుర్రవాడు వెనకగా వచ్చి మీద మూత్ర విసర్జన చేసి పారిపోయాడు. తర్వాత విషయం గ్రహించి మౌనం వహించాడు.

తనను నమ్ముకున్న వారికి భగవంతుడు ఏదో రూపంలో సహాయం చేస్తాడు. 'దైవం మానుష రూపేణ' అన్నారు. రమణకు దైవ సహాయం అన్నామలై తంబిరన్ రూపంలో అందింది. రమణ స్వామిని చూడగానే తంబిరన్ మనస్సు ఉద్విగ్నమైంది. తంబిరన్ గురుమూర్తంలో తన గురువు సమాధి వద్ద ఉంటాడు. తిరువణ్ణామలైకి దగ్గరలోనే గురుమూర్తం. ఆయన నాయనార్‌తో సంప్రదించి స్వామి ధ్యానానికి గురుమూర్తం అనుకూలంగా ఉంటుందని నిర్ణయించారు. వారి సలహా రమణ స్వామికి నచ్చింది. లేవబోయి పడిపోయిన స్వామిని వారిద్దరు గురుమూర్తానికి చేర్చారు. 1897 ఫిబ్రవరిలో రమణుడు గురుమూర్తం ప్రవేశించాడు.

తంబిరన్ మంచి గాయకుడు. నగర సంకీర్తనం చేసేవాడు. తమిళంలో అప్పర్, సుందరమూర్తి, సంబందర్ రాసిన పాటల్ని పాడుతూ నగర సంకీర్తన చేస్తాడు. సంచారంలో లభించిన దానిని పేదలకు పంచుతాడు. శైవ సంప్ర దాయంలో దానిని అధీన గురు సేవ అంటారు. తిరువణ్ణామలైకి తూర్పున గురుమూర్తం ఉంది.

గురుమూర్తంలో తన ధ్యానం గురించి రమణ మహర్షి ఇలా అనేవారు :

"గురుమూర్తంలో ఎవరు వచ్చేది, పోయేది నాకు తెలియదు. ఏదో ధ్యానంలో ఉండేవాడిని. స్నానం లేదు. పళ్లు తోముకోవాలని లేదు. నిత్యకృత్యాల అవసరం లేదు. మొహం పీక్కుపోయింది. జుత్తు జడలు కట్టింది. గోళ్లు పెరిగాయి. ఎవరైనా

ఏదైనా ఆహారం యిస్తామంటే చేయిచాచేవాడిని. తిని చేతుల్ని తలకు రుద్దుకునే వాడిని. లేచివెళ్లి నీళ్లు తాగడం లేదు. వెంటనే కళ్లు మూతలు పడేవి. చాలా సంవత్సరాలు అదే నా పరిస్థితి. తపఃస్థితి. ఆకు భోజనం ఉండేది కాదు. కర భోజనమే.

గురుమూర్తంలో ఉండగా, చాలామంది నా కోసం వస్తుండేవారు. నా గురించి చాలా ప్రచారం జరిగింది. వచ్చేవారు ఏదో తెచ్చి తినమనేవారు. వాళ్లు వీళ్లు తెచ్చినవి కాస్త కాస్త ఒక పళ్లెంలో వేసి కలిపి తినేవాడిని. అది నా రాత్రి భోజనం. రుచి పచి తెలిసేది కాదు. అప్పుడే అజీర్ణ వ్యాధి పట్టుకుంది. మూత్ర విసర్జనలోనూ బాధ. లేస్తే పడిపోయేవాడిని. పళని స్వామి సాయం చేసేవాడు.

స్నానం చేయకపోవడంవల్ల శరీరం కంపుకొడుతుండేది. వాసనకు చీమలు ఒంటినిండా పాకేవి. ఎన్ని చీమలు కుట్టినా సమాధి చెడేది కాదు. భక్తులు ఒక చెక్కబల్ల తెచ్చి పెట్టారు. దాని మీద కూర్చున్నా వీపు గోడకు ఆనడం వల్ల చీమలు వీపు మీదికి పాకి పీకేవి.”

స్వామి చాలా వృద్ధుడని, తపశ్శక్తి వల్ల అలా యువకుడుగా కనిపిస్తాడని ప్రచారం జరిగింది. ఆయన ఏ వరాలైనా ఇవ్వగల సమర్ధుడని చెప్పుకోసాగారు. కష్టాల్లో, బాధల్లో ఉన్నవారు, పిల్లలు కలగాలనుకునేవారు, రకరకాల వారు వచ్చి, స్వామి ముంగల సాగిలపడి నివేదించుకోసాగారు. భక్తుల అతిభక్తి మితిమీరి స్వామి ధ్యానానికి అంతరాయం కలిగింది. తన తపస్సేమో తానేమో! ఈ భక్తులు తన ధ్యానం ఏవీ పట్టించుకోలేదు.

తంబిరన్ స్వామిభక్తి ముదురు పాకాన పడ్డది. స్వామికి అభిషేకం చేయాలని అన్ని ఏర్పాట్లు చేసుకువచ్చాడు ఒకసారి. అది గ్రహించిన రమణస్వామి ఒక బొగ్గు ముక్క తీసుకుని గోడమీద రాశాడు : “ఈ శరీరానికి తిండి చాలు”. స్వామి మనస్సు గ్రహించిన తంబిరన్ అభిషేక కార్యక్రమం విరమించుకున్నాడు. దానివల్ల ఒక మేలు జరిగింది. స్వామి స్వచ్ఛమైన తమిళం రాయడంవల్ల ఆయన చదువుకున్న వాడని, తమిళ ప్రాంతీయుడని తెలిసిపోయింది. అంతవరకు నోరు విప్పని స్వామి ‘చేయి’ కదిపాడు.

అప్పట్లో రమణస్వామి అభిమానుల్లో వెంకట్రామ అయ్యర్ ఒకరు. ఆయన తిరువణ్ణామలై తాలూకా ఆఫీసులో ఎకౌంటెంట్. ప్రభుత్వోద్యోగి. రమణ చదువుకున్న వాడని తెలియగానే ఆయన ఊరు, పేరు తెలుసుకోవాలని ఉబలాటపడ్డాడు. అందుకు రోజూ గురుమూర్తం వచ్చి అడగసాగాడు. చివరికి

ఆమరణ దీక్షకు సిద్ధమైనాడు. అప్పుడు రమణ మనసు మెత్తపడ్డది. తనను తెలియపరచడం అవసరం అనిపించిందేమో! "వెంకట్రామన్ – తిరుచ్చుళి" అని గోడపైన రాశాడు. అసలు తిరుచ్చుళి అనే ఊరు ఉందని అయ్యర్‌కి తెలియదు. రమణ పెరియ పురాణం పుస్తకం తీసి "సుందరమూర్తి" కథ చూపించాడు. ఆ ఊళ్ళో భూమినాథాలయం ఒకటి ఉందని అయ్యర్ గ్రహించాడు. అదే రమణ రహస్యాన్ని బట్టబయలు చేసింది.


పళని స్వామి

గురుమూర్తం చేరిన కొద్ది రోజుల్లో పళనిస్వామి వచ్చి తోడు నిలిచాడు. రమణస్వామిని కన్నతల్లిలా చూచుకునేవాడు. 17 సంవత్సరాల పాటు, అంటే రమణుడు గురుమూర్తం వదలి స్కందాశ్రమం 1917లో చేరే వరకు, పళని స్వామి రమణునికి నీడలా ఉన్నాడు. రమణకు శరీరస్పృహ ఉండేది కాదు. రమణ భోజనం బాధ్యత పళనిదే.

పళని స్వామి కేరళీయుడు. తిరువణ్ణామలైలో గణేశుని ఆలయంలో ధ్యానం చేసుకుంటుండేవాడు. శ్రీనివాస్ అయ్యర్ అతనిని గమనించి "ఈ రాతి విగ్రహానికి పూజలు చేస్తే ఏం వొరుగుతుంది? గురుమూర్తంలో ఉన్న నిజ స్వామిని సేవించు. ఆయన ధ్రువుడంత గొప్పవాడు. ఆయన సేవ చేస్తే మోక్షం లభిస్తుంది." అని సలహా ఇచ్చాడు.

చాలా మందికి పళనిస్వామి రమణ ఔన్నత్యం గురించి చెప్పాడు. మొదటి దర్శనంలోనే పళని 'ఈయన నా గురువు' అనే నిర్ణయానికి రాగలిగాడు. తన ఆరాధ్య దైవం గణేశుడే తనకు రమణస్వామి దర్శన భాగ్యం కలిగించాడని పళని ప్రగాఢ విశ్వాసం.

పళని స్వామి మళయాల గ్రంథాలు చదివి వినిపిస్తుండేవాడు. పళని బయటకు పోతూ స్వామిని లోపలపెట్టి తాళం వేసేవాడు ఎవరూ రాకుండా. కొన్నాళ్లు ప్రక్కనే ఉన్న తోటలో ఒక గుడిసెలో ఉన్నారు. ఆరు మాసాలు అలా సాగింది. రమణ ఏ పుస్తకం చేతికి తీసుకున్నా పది నిమిషాలలో చదివేవారు. అలా రమణ అనేక సంస్కృత, తెలుగు, తమిళ, మళయాల గ్రంథాలు చదివాడు. తర్వాత ఆ చదువువల్ల అన్ని ప్రాంతాల భక్తులతో వారి వారి భాషలోనే మాట్లాడడం వీలైంది.



# 8. అరుణగిరినాథ ఆలయం

సన్యాసి అయినా రమణుడు వీధులు తిరిగి బిచ్చమెత్తిన సందర్భాలు తక్కువ. కడుపు నింపుకోవాలన్న ఆలోచన ఆయనకుండేది కాదు. అసలు ఆకలి తెలిసేది కాదు. గురుమూర్తం చేరేముందు ఒకసారి, గురుమూర్తం వదలిన తర్వాత ఒకసారి భిక్షాటన చేశారు. అంతే. మొదటిసారి ఒక పూజారి ఇంటి ముందు నిలబడ్డాడు. ఎట్లా అర్థించాలో తెలియదు. అలవాటు లేని 'కళ' భిక్షాటన. ఒక్కొక్క ఇంటిలో కాస్త గంజి పోసేవారు. ఉప్పు లేకుండానే తాగేవాడు. అక్కడే చేతితో తీసుకొని జుర్రుకుని, చేతులు తలకు పులుముకొని వెళ్లిపోయేవాడు.

రెండవసారి భిక్షాటన చేసింది 1898లో గురుమూర్తం వదలిన తర్వాత. అప్పుడు అరుణగిరినాథ ఆలయంలో ఉండేవాడు. అప్పుడు భిక్షకు వెళ్లింది కృష్ణ అయ్యర్ అనే ఆయన ఇంటికి. ఆయన పేకాటలో లీనమైఉన్న సమయంలో రమణ చప్పట్లు చరిచారు. ఆయన లేచి అన్నం కూరలు కలిపి ముద్దచేసి చేతిలో ఉంచాడు. రమణ వద్ద భిక్షకు పాత్ర ఉండేది కాదు. రమణ భిక్ష రాత్రివేళ. రెండు మూడు ఇళ్లలో రెండు మూడు ముద్దలు లభిస్తే చాలు తిరిగి వచ్చేవాడు. గురుమూర్తంలో ఉండే రోజుల్లోనే అందరికీ తెలుసు ... రాత్రి ఆవేళకు రమణస్వామి వస్తాడని ఎదురు చూస్తుండేవారు. పరమభక్తుల ఆకలి తీర్చడం కూడా పుణ్యకార్యమే! దానికి ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి. ఒక్కొక్కరోజు ఒక్కో వీధికి వెళుతుండేవాడు. దేవాలయం ముందున్న ఇళ్ల వారందరూ రమణస్వామికి 'మధూకరం' యిచ్చి పుణ్యం కట్టుకున్నవారే.

ఇళ్లకు వెళ్లి భోజనం చేసిన సందర్భాలు రెండే రెండు. ఒకటి టి.పి. రామచంద్ర అయ్యర్ తాతగారిల్లు. 1896లో అరుణాచలేశ్వర ఆలయంలో ఉండే రోజులు. పెద్దాయన రోజూ వచ్చి రమణ సన్నిధిలో కూర్చునేవాడు. మౌనం గదా! సంభాషణ ఉండేది కాదు. ఒకరోజు మధ్యాహ్నం ఏం జరిగిందంటే. "పెద్దాయన మధ్యాహ్నం భోజనానికి ముందు మరొకర్ని తీసుకొని నా వద్దకు వచ్చాడు. నాకు ఇరువైపుల వారు నిలబడి "స్వామీ రండి పోదాం" అన్నారు.

"ఎక్కడికి? ఎందుకు?" అని సౌంజ్ఞ చేశాను.

వారు విషయం చెప్పారు. నేను రానన్నాను. అంతే. వాళ్లు వెళ్లారా? ఉహు! నన్ను బలవంతంగా మోసుకుపోడానికి సిద్ధపడ్డారు. పాపం! వాళ్లు భక్తితో పిలుస్తున్నారని నాకు తెలుసు. వారితో ఏం వాదించను. వారి వెంట నడిచి వెళ్లాను".

మరొకసారి ఈశాన్య మఠంలో జరిగింది. అది విరూపాక్ష గుహ నివాసం రోజులు. అదీ సరదాగా జరిగింది. ఎలాగంటే –

"ఒకరోజు పళని స్వామి, నేను గిరి ప్రదక్షిణ చేసి రాత్రి ఎనిమిది గంటలకు దేవాలయానికి చేరుకున్నాం. ఇద్దరం బాగా అలసిపోయాం. సుబ్రహ్మణ్య ఆలయంలో నేను పడుకుండిపోయాను నీరసం వచ్చి. పళని సత్రానికి వెళ్లాడు... ఏమైనా తినడానికి దొరుకుతుందేమోనని. మఠం పెద్ద గుడికి పోతున్నాడు. ఆయన వెంట శిష్య పరివారం ఉంది. అందులో ఒకరు నన్ను చూచారు. మఠాధిపతికి చెప్పాడు. తిరిగిపోతూ నా వద్దకు పదిమంది శిష్యులతో వచ్చారు.

"రండి స్వామీ! పోదాం" అన్నాడు.

నేను 'మౌనం' కదా! విననట్లు ఊరుకున్నాను. 'రానని' సౌంజ్ఞ చేశాను. ఆయనగారు నా మాట వింటేనా!

"స్వామిని ఎత్తుకు రండిరా" అన్నాడు శిష్యులతో.

ఇంకేం చేయను? వారి వెంట బయల్దేరాను. బయటకు వచ్చేసరికి ఒక బండి సిద్ధంగా ఉంది. ఎక్కమన్నారు. నేను ఉహూఁ అన్నాను. నడవడం నా కిష్టం.

ఆయన నా అభిప్రాయం లక్ష్యపెట్టలేదు. శిష్యులున్న గురువు కదా!

"ఏమిటిరా చూస్తున్నారు! స్వామిని లేపి బండెక్కించండి అన్నాడు. "వాళ్లు పది మంది నేను ఒక్కడిని. అందరు కలిసి 'నన్ను' బండిలో వేశారు. కిమ్మనకుండా

మఠానికి చేరాను. నా కోసం పెద్ద విస్తరి వేయించారు. రక రకాల పదార్థాలు వడ్డించారు. వాళ్ల భక్తి వాళ్ళది!

"ఇక్కడే ఉండిపోండి స్వామీ" బ్రతిమలాడారు.

ఈలోగా పళనిస్వామి దేవాలయానికి వెళ్లి జరిగింది తెలుసుకుని పరుగున వచ్చాడు మఠానికి. తను వచ్చాక నేను తప్పించుకోగలిగాను.

1899లో విరూపాక్ష గుహకు చేరిన తర్వాత ఆరు నెలలపాటు పచ్చయమ్మన్ కోవెలలో ఉండవలసి వచ్చింది. తిరువణ్ణామలైలో అప్పుడు 'ప్లేగు' సోకింది. "పచ్చయమ్మన్ కోవెలలో ఉన్నప్పుడు ఒక చిన్న టవల్ ఉండేది, అదీ చిరిగిందే. గొడ్లు కాసే కుర్రాడు ఒకడు నా మీద జోక్ చేసేవాడు.

'స్వామీ! గవర్నర్ గారికి మీ టవల్ కావాలట ఇవ్వండి' అని.

"చెప్పు. నేను ఇవ్వనన్నానని".

ఆ టవల్ ఎవరికీ కనపడనిచ్చేవాడిని కాదు. మడిచిపెట్టి ఒళ్ళు తుడుచుకునేవాడిని. మళ్లా మడతపెట్టి దాచేవాడిని. ఒక రహస్య ప్రదేశంలో దానిని ఉతికి ఎండ బెట్టేవాడిని. నా గోచీ కూడ చిరిగిపోయింది. దానిని రెండవ వైపు త్రిప్పి ఉపయోగించేవాడిని."

ప్లేగు ప్రబలిన రోజుల్లో ప్లేగు నివారణ ఉద్యోగులు ఒక భజన కార్యక్రమం పెట్టారు. రమణను పిలిచారు ఒకసారి. వెళ్లక తప్పింది కాదు. వాళ్లు రమణను పూలమాలలతో సత్కరించారు. శ్రీరమణ తిరువణ్ణామలైలో ఉన్న 54 సంవత్సరాల కాలంలో ఒక ఫంక్షనుకు వెళ్లడం అది ఒక్కసారే.





# 9. శేషాద్రి స్వామి

**ర**మణ మహర్షి తపో జీవితానికి ప్రధాన సూత్రధారి శేషాద్రి స్వామి. శేషాద్రి స్వామి జననం 1870 జనవరి 22. తల్లిదండ్రులు మరకతం, వరదరాజు. తిరువణ్ణామలైకి సమీప గ్రామం వళ్లూరు. చిన్నతనం అందరి పిల్లలవలె సాగింది. అయితే తను విలక్షణ ప్రతిభావంతు డనిపించుకునేవాడు. పదేళ్ల వయసులో తల్లిదండ్రుల్ని పోగొట్టుకోవడంతో అతని జీవితం మలుపు తిరిగింది. కామాక్షి విగ్రహం ముందు కూర్చుని ముఖ పంచశతి అనేకమార్లు పఠించాడు. నారాయణో పనిషత్తు నుండి కామోకరిషిద్ మంత్రాన్ని తీసుకొని జపించసాగాడు. భక్తిసాగరంలో మునిగి తేలేవాడు. కామాక్షి అమ్మవారు ప్రత్యక్షం కావాలి, తన కర్మబంధాలు నశింపు చేయాలన్నదే ఆయన ధ్యేయం. అతని ధోరణి చిన్నాన్నకు, పిన్నికి నచ్చేది కాదు. ఒంటరిగా శ్మశానానికి వెళ్లి కూర్చునేవాడు. ఇంట్లో పెద్ద వారంటే లక్ష్యం ఉండేది కాదు. అంచేత గదిలో పెట్టి తాళం వేసేవారు. అయినా తప్పించుకు పారిపోయేవాడు. స్వేచ్ఛను బంధించడం ఎవరితరం!

అరుణాచలం ఆయన్ని ఆకర్షించింది. రెండు సంవత్సరాల క్రితం స్వయంగా అరుణాచలం బొమ్మగీసి పూజగదిలో పెట్టుకున్నాడు. అప్పుడప్పుడు 'అరుణాచల, సోనాద్రినాథా' అని పిలుస్తుండేవాడు. 1890లో తిరువణ్ణామలై చేరుకున్నాడు. అప్పటి నుండి నలభై సంవత్సరాలు, ఇల్లు వదలివచ్చిన శేషాద్రికి, అదే ఆశ్రయ మిచ్చింది. ఆ విషయంలో రమణకు శేషాద్రికి దగ్గరి పోలికలున్నట్లే. రమణ మహర్షి 54 సంవత్సరాలు అక్కడే ఉన్నారు. రమణ మహర్షివలె శేషాద్రి స్వామికి 'డబ్బు' అవసరం లేదు. అన్నీ భగవంతుడే చూచుకుంటాడని విశ్వాసం. ప్రాపంచిక

సుఖాలు వదలినవారికి ధనంతో ఏం పని? ఒకసారి కోర్టు వ్యవహారంలో న్యాయవాది రమణను ప్రశ్నించాడు "మీరు డబ్బును వద్దంటారట. మరి పండ్లు, ఆహార పదార్థాలు వద్దనరు గదా?"

"డబ్బు తినం కదా" అని రమణ సమాధానం.

శేషాద్రి స్వామిది చిన్న పిల్లవాడి మనస్తత్వం. తిరువణ్ణామలైలో ఉన్న 40 ఏళ్లలో వేలాది మంది ఆయన శక్తుల్ని, మహత్తుల్ని చవిచూచారు. ఆయన ఆధ్యాత్మిక వర్చస్సు, ప్రతిభ అపూర్వం. ఆయన బాహ్య ప్రవర్తన మాత్రం దుర్భరం. పగలంతా ఎక్కడెక్కడో తిరిగేవాడు. రాత్రికి ఏ ఇంటి పంచలోనో, గుడిలోనే పడుకునేవాడు. గొప్పవాళ్లు, ధనికులు మంచి భోజనం పెట్టినా తినేవాడు కాదు. పేదవారి గుడిసెల్లో గంజి పోయించుకుని, బిచ్చగాళ్ల సత్రంలో వాళ్లతో కలిసి తిని, నిద్రపోయేవాడు. పైసా యిచ్చినా ముట్టుకునేవాడు కాదు. ఎవరైనా మంచి బట్టలు యిస్తే పేదలకు పంచేవాడు లేదా చించి పారేసేవాడు లేదా వీధిలో కనిపించిన గేదెల మీద కప్పి ఆనందించేవాడు. ఎప్పుడైనా తల స్నానం చేయాలనిపిస్తే ఒంటినిండా నూనె పూసుకొని, స్నానం చేయడం మరచి అట్లాగే ఊళ్లో తిరిగేవాడు. తన చుట్టూ చేరే వారిలో చెడ్డవారిని ఇట్టే కనిపెట్టేవాడు. పేరుపేరున పిలిచి, లోగడ చేసిన పనులు ఏకరువు పెట్టేవాడు. ఎన్నడూ చూడని కొత్తవారి బతుకులు బయట పెట్టేవాడు. రోజుల తరబడి ఏమీ తినేవాడు కాదు. తింటే పది రోజుల తిండి ఒక్కసారే తినేవాడు. భోజనం చేస్తూ అటు ఇటు విసిరి వేసేవాడు. అవి తన చుట్టూ ఉన్న దేవతల కోసం అని నవ్వేవాడు. పూర్తిగా నిద్రపోయేవాడు కాదు. అర్ధరాత్రి దాటేవరకు ధ్యానం చేసేవాడు.

మనిషి అలవాట్లు అట్లా వున్నా, అందరి దృష్టిలో ఆయన మహాత్ముడు. గొప్ప ఆధ్యాత్మికవేత్త, యోగి. బాగా చదువుకున్నవారు సైతం శేషాద్రి స్వామి సలహాలు తీసుకునే వారు. నటనానందకు ఆత్మబోధ చేశాడు "ఇది కాదు, ఇది కాదు అంటూ పోతే చివరికి మిగిలేది ఆత్మ".

ఒకసారి ఓ బంధువు శేషాద్రిని అడిగాడు "ఎందుకా పరధ్యానం?" అని.

"అవును నాకు ఇహ జ్ఞానం తక్కువ. పరధ్యానం ఎక్కువ. ప్రపంచం గుర్తుండదు, బ్రహ్మాన్ని మరచిపోను" అన్నాడు.

మరొకసారి ఒక భక్తునికి సలహా చెప్పాడు. **"ఆత్మ కొండ గుహలలోనూ, నదీ తీరాలలోనూ ఉండదయ్యా, అది నీలోనే ఉంటుంది. అది నీలోని చైతన్యమే".**

రమణ మహర్షికి శేషాద్రి స్వామి అన్నలాంటివాడు. రమణ మహర్షి కంటే ఆరు సంవత్సరాలు ముందుగా శేషాద్రి స్వామి తిరువణ్ణామలై చేరుకున్నాడు.

అయినా రమణుని ఆత్మశక్తిని, తపస్సును వెంటనే గుర్తించినవాడు శేషాద్రిస్వామి. వేయి స్తంభాల మండపం వద్ద అల్లరి మూకలను తరిమికొట్టింది శేషాద్రిస్వామియే. తర్వాత రమణుడు పవళ కున్రులో ఉండగా చూడడానికి వచ్చాడు. విరూపాక్ష గుహకు మారిన తర్వాత శేషాద్రి స్వామి రమణుని కలిసేవాడు. రమణ సమక్షంలో నెమ్మదిగా సహజంగా ఉండేవాడు. తనకు రమణుని పైన ఉన్న అభిప్రాయాల్ని, అభిమానాల్ని సుబ్రమణ్య మొదలియార్ అనే భక్తునితో అన్నాడు "చూడు.. తమ్ముడు పదివేలు సంపాదిస్తున్నాడు, నేనేమో ఒక వేయి సంపాదిస్తున్నాను. నీవు ఒక వందరూపాయలైనా సంపాదించవద్దా?" ఎంత సున్నితంగా నర్మగర్భంగా చెప్పాడు. పాపం, మొదలియార్ తన సంపాదన అంతా సాధు సన్యాసుల కోసమే ఖర్చు పెట్టేవాడు. శేషాద్రి మాటల్లోని భావం ఆధ్యాత్మిక సంపాదన.

శేషాద్రి స్వామి ఎవరూ తనను కలవడానికి అంగీకరించేవాడు కాదు. కాని వచ్చినవారు రమణస్వామి భక్తులని తెలిస్తే మాత్రం వారికి సాయపడుతుండే వాడు. ఆయన ఎవరికీ సలహాలు ఇవ్వడు. ఒక్క ఎచ్చమ్మాళ్ మినహా... ఆమె రోజూ రమణకు భోజనం తెచ్చి పెట్టేది. ఒకసారి శేషాద్రి స్వామి నేరుగా ఎచ్చమ్మాళ్ ఇంటికి దారితీశాడు. ఆమె వద్ద ఒక పండితుడున్నాడు. ఆ పండితుని ధోరణి స్వామికి నచ్చలేదు. శేషాద్రి స్వామి ఎచ్చమ్మాళ్‌తో అన్నాడు "ఇలాంటి దద్దమ్మలు వేయి జన్మలెత్తినా మోక్షం పొందలేరు". ఎచ్చమ్మాళ్ భయపడ్డది. స్వామి ఏదో మహత్తు చూపిస్తాడనుకుంది. శేషాద్రి స్వామి మహా వాక్యాలపై సుదీర్ఘ వ్యాఖ్యానం చేశారు. పండితులవారి తల తిరిగింది. స్వామి తాత్వికతకు ఆశ్చర్యపోయాడు.


ఎచ్చమ్మాళ్

మరొకసారి శేషాద్రి స్వామి ఎచ్చమ్మాళ్ ఇంటికి వెళ్లేసరికి ఆమె తన ఫోటో రమణ స్వామి ఫోటో ఎదురుగా ఉంచుకుని పూజ చేస్తోంది.

"ఎచ్చమ్మా ... ధ్యానం చేయడం మానావా?" అని అడిగాడు.

ఆమె లోగడ ఒక గురువు వద్ద మంత్ర దీక్ష తీసుకుంది. రెండు రోజులపాటు ఏకదీక్షగా ధ్యాన సమాధిలో గడపగల సాధన వుంది.

రమణ అలా చేయవద్దని సలహా చెప్పాడు. కాని ఆమె మానుకోలేదు. ఆమె శేషాద్రి స్వామిని అడిగింది 'ధ్యానం ఎలా చేయాలి?' అని. ఆయన సమాధానం చెప్పలేదు. నేల మీద కూర్చుని, పద్మాసనం వేశాడు. వెంటనే

సమాధిలోకి వెళ్లిపోయాడు. తర్వాత ధ్యానం నుండి లేచి "అదీ, ఎచ్చమ్మాళ్, ధ్యానం" అన్నాడు.

ఒక్కొక్కసారి శేషాద్రి స్వామి చాలా చాదస్తంగా సలహాలిస్తాడు. ఎవరైనా ఆధ్యాత్మికాభివృద్ధిని గురించి ప్రశ్నిస్తే "ఏదో ఒక పద్ధతి పాటించవయ్యా" అనేవాడు. ఆయన మంత్రశాస్త్ర నిష్ణాతుడు. కామాక్షి అమ్మవారి దర్శనం చేసుకున్నాడు. ఇంకా చాలా మంత్రాలు వచ్చు. వచ్చిన వారు ఏ మంత్రానికి అర్హులో గమనించి చెప్పేవాడు. అయితే 'రమణస్వామి'పై విశ్వాసం ఉన్న వారికి, రమణ భక్తులకు మాత్రం ఎలాంటి ఉపదేశం చేసేవారు కాదు. రమణను అనుసరించమనేవారు.

1908లో మామిడి గుహలో ఉన్నప్పుడు ఒక సంఘటన జరిగింది. శేషాద్రి స్వామి రమణ మహర్షి మనసులోని ఆలోచనలు తెలుసుకోవాలని యత్నించాడు. శేషాద్రికి అది అలవాటు. రమణ విషయంలో ఏమీ తెలియలేదు. రమణ వైపు చూచి అన్నాడు, "ఈ మనిషి మనసులో ఏముందో తెలియదు".

మహర్షి మాట్లాడలేదు. మౌనం వహించాడు.

శేషాద్రి అన్నాడు "అరుణాచలేశ్వరుని ఆరాధిస్తే, మోక్షం అయినా యిస్తాడు". అప్పుడు రమణ నిశ్శబ్దాన్ని చీల్చి అన్నాడు "ఎవరు ఆరాధించేది? ఎవరిని ఆరాధించాలి?"

శేషాద్రి ఆ మాటలకు ఫక్కుమని నవ్వి "అదే సరిగా తెలియడం లేదు" అన్నాడు.

అప్పుడు మహర్షి అద్వైతం మీద ఒక లెక్చరు యిచ్చాడు. శేషాద్రి స్వామి అంతా సావధానంగా విని లేచిపోతూ అన్నాడు "నేనేం చెప్పను? అంతా అంధకారంగా ఉంది నాకు. అయినా ధ్యానం కొనసాగిస్తాను."

అంటూ అరుణాచల శిఖరంవైపు తిరిగి పది పదిహేను నిమిషాలు సాష్టాంగ నమస్కారం చేశాడు.

స్వామి, రమణ ఇద్దరూ నవ్వుకున్నారు. వారి మైత్రి అలాంటిది. రెండు ఆత్మల కలయిక. రెండు హృదయాల మైత్రీ బంధం వారిది.

శేషాద్రి స్వామి 1929 జనవరి 4న మహా సమాధి చెందారు. ఆ రోజు తిరువణ్ణామలై జనమంతా దుఃఖించారు. అంత్యక్రియలు జరిగినపుడు శేషాద్రి భౌతికాన్ని సమాధి చేసే వరకు రమణ మహర్షి అక్కడే ఉన్నారు. రమణాశ్రమానికి దగ్గరలోనే శేషాద్రి స్వామి సమాధి, ఆశ్రమం ఉన్నాయి. శేషాద్రిస్వామి రమణ మహర్షి స్నేహాన్ని ఇప్పటికీ భక్తులు వేనోళ్ల ప్రశంసిస్తారు.



# 10. కలలు పండిన కోన ...

శ్రీరమణులు గురుమూర్తం వదలి విరూపాక్ష గుహకు చేరే నాటికి వారి వయస్సు ఇరవై సంవత్సరాలు. 1899 నుండి 1916 వరకు **విరూపాక్ష గుహ**లో ఉన్నారు. వారి 'కలలు పండిన కోన' అది. ఆ పదిహేడు సంవత్సరాలు రమణుల జీవితంలో సువర్ణాధ్యాయం. ఒక యువ సన్యాసి మహర్షిగా పరిణామం చెందిన కాలం. విరూపాక్ష గుహ అంటే త్రినేత్రుని హృదయ కుహరం. అది అరుణాచల హృదయ మధ్యస్థలి.

విరూపాక్ష గుహ అరుణగిరి తూర్పు వాలులో ఉంది. దాని ఆకారమే 'ఓం'. 13వ శతాబ్దంలో విరూపాక్ష దేవ అనే యోగి అక్కడ నివసించేవాడు. అక్కడే ఆయన సమాధి అయినారు. ఆయన పేరున అది విరూపాక్ష గుహగా ప్రసిద్ధమైంది. శ్రీరమణుల జీవితంలో ముఖ్య ఘట్టాలు, సంఘటనలు అక్కడ ఉండగానే జరిగాయి. శ్రీరమణుల తల్లి అలగమ్మాళ్ వచ్చి స్థిరపడ్డది ఆ కాలంలోనే. ఆమెకు మోక్ష ప్రాప్తి కలిగిందీ అక్కడే. 1907లో మొదటిసారిగా మౌనం వీడి, నోరు విప్పి గణపతి మునికి 'ఉపదేశం' యిచ్చింది అక్కడే. గంభీరం శేషయ్యకు, శివ ప్రకాశం పిళ్లేకు తన జ్ఞానానుభవాలు వివరించింది అక్కడే.

తొలినాళ్లలో శ్రీరమణుని కోసం వచ్చే భక్తులపై విరూపాక్ష మఠం ట్రస్టీలు పన్ను వేసేవారు. తనను చూడవచ్చిన వారిని అలా శిక్షించడం రమణులు సహించ లేకపోయారు. అందుచేత గుహ వదలి, దూరంగా ఒక చెట్టు నీడన కూర్చునేవారు. మఠాధికారి అక్కడా భక్తుల నుండి పన్ను వసూలు చేయసాగాడు. శ్రీరమణ

అక్కడ నుండి సద్గురుస్వామి గుహకు చేరుకున్నారు. ట్రస్టీలు పన్నులు విరమించి రమణకు స్వాగతం చెప్పారు.

ఆనాటి ఒక సంఘటన రమణ మహర్షి ఇలా చెప్పేవారు –

"ఆ రోజుల్లో నేను ఒంటరిగానే తిరిగేవాడిని. కాలకృత్యాలకు నీళ్లు తీసుకు పోయే వాడిని కాదు. ఒక నీటి కుంట లేదా చెలమ కనిపించేవరకు వెళ్లేవాడిని. అలా వెళ్లినప్పుడు ఒకసారి ఒక మర్రిచెట్టు కనిపించింది. కొండవాగు వెంట నడుస్తున్నాను. పెద్ద పెద్ద ఆకులున్న మర్రి చెట్టు అది. వాగు దాటడానికి ఒక పొద దగ్గరగా వెళ్లాను. మండ్రగబ్బలు మోకాలి వరకూ పాకి, పీకసాగాయి. అదీ ఎడమకాలికి. అవి నా కుడికాలి జోలికి రాలేదు. కొంతసేపు ఎడమకాలు వాటికి వదిలేశాను. నిజమే. ఆ కాలితోనే నేను పుట్ట తొక్కాను. అది వాటి స్వంతం గదా! కొంతసేపటికి నిష్క్రమించాయి. నేనూ వెళ్లిపోయాను. నడవలేక నడవలేక నడుస్తూ తెల్లవారుజామున రెండుగంటలకు "ఏళుసునై" (ఏడు పాతాళ గంగలు) చేరాను. అప్పుడు జడస్వామి అక్కడ ఉండేవాడు. బెల్లం కలిపి మజ్జిగ యిచ్చాడు. ఆ చెట్టుకు ఏవో మహత్తులున్నాయంటారు. నేను దాని సంగతే మరచిపోయాను".

ఒకనాటి ఉదయం విరూపాక్ష గుహ వరండాలో కూర్చుని ఉండగా "కరుణయ్యా ఎన్నై" అనే మాటలు మనసులోకి వచ్చాయి. కానీ పట్టించుకోలేదు. మర్నాడు మరొక గీతం, ఆ మర్నాడు మరొక గీతం. అలా రోజూ ఒకటి చొప్పున చివరి రోజున రెండు గీతాలు రాశారు. అవే శ్రీ రమణుని "అష్టపదులు". చివరి రెండు గీతాలు రాసిన తర్వాత గిరి ప్రదక్షిణకు బయలు దేరారు. అయ్యాస్వామి అనే శిష్యుడు తెల్ల కాగితాలూ, పెన్సిల్ తీసుకుని రమణ వెంట నడిచాడు. రోజూ ఒక గీతం రాస్తున్నారు కదా... గిరి ప్రదక్షిణలోనూ ఏమైనా రాస్తారేమోనని ఆశ పడ్డాడు. ఆ గిరి ప్రదక్షిణలోనే అరుణాచల అష్టకంలోని మొదటి ఆరుగీతాలు రాశారు. నారాయణరెడ్డి అనే భక్తుడు వాటిని అచ్చు వేయించాలని పూనుకున్నాడు. మిగిలిన రెండు పూర్తిచేసి 'అష్టకం' అన్నారు. 'అష్టోత్తర శతనామావళి' అలా గిరి ప్రదక్షిణలో చెప్పిందే.

రమణ శిష్యులు తిరువణ్ణామలై వీధుల్లో భిక్షకు వెళ్లేవారు. వారు పాడుకోడానికి ఏదైనా ఒక భక్తి పాట రాసి పెట్టమని పళని స్వామి రమణను అర్థించాడు. నలుగురు శిష్యులు ఆ పాట పాడుకుంటూ బయలు దేరేవారు. గుహ వదలి బయలుదేరగానే ఒకసారి శంకులు పూరించేవారు. కొండ దిగువకు రాగానే మరొక సారి శంకులు పూరించేవారు. భిక్షకు వెళ్లే వీధి మొగదల మూడవ సారి పూరించేవారు. నాదం వినగానే ఆ వీధి ఇళ్లలోని వారు స్వామి బృందం వస్తోందని బయటకు వచ్చి భిక్ష వేయడానికి సిద్ధంగా ఉండేవారు. అలా చాలా

ఆహారం దొరికేది. గుహలో ఉన్న యావన్మందికీ సరిపోగా మిగిలింది కోతులకు పెట్టేవారు.

★ ★ ★

**పిల్లలతో సహవాసం**

శ్రీరమణకు మౌనిగా ఉండడం ఎంత ఇష్టమో సరదాగా జనంతో ఉండడమూ అంతే ఇష్టం. విరూపాక్ష గుహలో ఉండేకాలంలో ఊళ్లో పిల్లలు కొందరు కొండపైకి వచ్చేవారు. రమణ ధ్యానంలో ఉంటే ఎదురుగా కూర్చునేవారు. 1907 తర్వాత రమణ పిల్లలతో సావాసం చేయసాగారు. వాళ్లతో కలిసి గోలీలాట లాడేవారు. తర్వాత రమణ అనేవారు.

“గోలీల ఆట కోసం తీసిన గుంటలు ఇంకా అక్కడ ఉండే వుంటాయి. పిల్లలు రకరకాల స్వీట్లు తెచ్చేవారు. అందరం కలిసి సరదాగా తినేవాళ్లం. దీపావళికి టపాకాయలు నా కోసం తెచ్చేవారు. అందరం కలిసి టపాసులు కాల్చేవాళ్లం”.

22 సంవత్సరాల కుర్రాడు, అట్లా విరూపాక్ష గుహలో ఆలనా, పాలనా లేకుండా ఘోర తపస్సు చేస్తూ ఒంటరిగా ఉండడం చూచిన ఇద్దరు కుర్రవాళ్లు చలించి పోయారు. రమణ గుహ బయట ఒక బండరాయిపైన కూర్చుని ఉండగా పది సంవత్సరాల వయసు కుర్రవాడు వచ్చి వెక్కి వెక్కి ఏడవసాగాడు.

రమణ అంటారు “ఆ పిల్లవాడి ఏడుపుకు కారణం ఏమిటి? నన్ను చూడగానే అతని కళ్లు ఎందుకు వర్షించాయి?”

మరొక రోజున, మరొక కుర్రవాడు అదే వయసువాడు గుహకు వచ్చాడు. రమణ ఎప్పటిలా బయట బండమీద కూర్చుని ఉన్నాడు. ఆ పిల్లవాడు అడిగాడు:

“ఇలా ఒంటరిగా, ఇక్కడ ఉండడం ఎందుకు స్వామి?”

భగవాన్ : ఇంట్లో కాస్త గొడవలు, అందుకే ఇల్లు వదలి వచ్చేశాను.

కుర్రాడు : మీ భోజనం ఎట్లా?

భగవాన్ : ఎవరైనా నీలాంటి వాళ్లు తెచ్చి పెడితే తింటాను.

కుర్రాడు : నా యజమాని మంచివాడు. కొన్ని రోజులు జీతం లేకుండా పని చేయాలి. నీ పని నచ్చితే రోజుకు మూడు పైసలు జీతమిస్తాడు. తర్వాత ఆరు పైసలు. అలా అలా జీతం పెంచుతాడు. వస్తావా?

పాపం ! ఆ పిల్లవాడికి నేనంటే అంత ఇష్టం. నేను కష్టపడడం చూచి సహించ లేకపోయాడు.

★ ★ ★

ఒక రోజున కొందరు భక్తులు స్వామి దర్శనానికి కొండపైకి వచ్చారు. వారు వచ్చే వేళకు స్వామి ఏదో తాపీ పని చేస్తున్నారు. వాళ్లు అడిగారు.

"స్వామి దర్శనానికి వచ్చాం. ఏడీ స్వామి"

"స్వామి బయటకు వెళ్లాడు" రమణ స్వామి సమాధానం.

వాళ్లు తిరిగి వెళ్లారు. కొండ దిగువకు వచ్చేసరికి ఎచ్చమ్మాళ్ ఎదురు పడ్డది.

'స్వామి గుహలో లేరు' అన్నారు వారు. వారు చెప్పిన వర్ణన ప్రకారం ఆమె గ్రహించింది "అయ్యా, మీకు ఆ మాట చెప్పింది స్వామియే".

ఆమె గుహ వద్దకు వచ్చి రమణను అడిగింది "ఎందుకు పాపం, వాళ్లకలా అబద్ధం చెప్పారు?"

"కాకపోతే మెడకు గంట తగిలించుకుని వాయించమంటావా? నేనే స్వామినని చాటించుకోవాలా? లేక, నుదుట లేబుల్ అంటించుకోనా?"

★ ★ ★

1912లో కొందరు భక్తులు రమణ జన్మ దినోత్సవం జరపాలనుకున్నారు. వారికి వాసుదేవ శాస్త్రి నాయకత్వం వహించాడు. వాళ్లు వచ్చి అడిగారు.

రమణ సమాధానం **"నిజమైన పుట్టినరోజు ఆత్మదర్శనం అయినరోజు"**.

వాసుదేవశాస్త్రి మొండిగా వాదించాడు "ఏదో మా తృప్తి కోసం భగవాన్ కాదన కూడదు".

అదే మొదటిసారి రమణ జన్మదిన వేడుక. తర్వాత భక్తులు దానిని రమణ జయంతిగా జరపడం ఆనవాయితీ అయింది.

★ ★ ★

ఒకసారి రమణ అమ్మమ్మ చూడడానికి వచ్చింది. ఆమె రమణను చూచింది "ఈ పూట నేను వంట చేస్తాను. నువ్వు ఆ తిండి తినకు" అన్నది.

"అయితే నీ వంటా, వార్పు వేరే గుహలో చేసుకో"

"ఆమె వెళ్లగానే, భక్తులతో కలిసి తినేశాను. ఆమె వంట పూర్తి చేసి భోజనానికి రమ్మంది. వెళ్లి ఆమె పెట్టిందీ తినేశాను."

ఒకసారి రమణ స్వామి బంధువు ఒకాయన వచ్చాడు. పెద్దవాడు. అతని మాట కటువు. మంచివాడే పాపం! వచ్చి రమణను చూచి ఎగతాళిగా అన్నాడు: "ఏం వెంకట్రామన్. నీవు పెద్ద స్వామివి అయినావటగా. ఏదీ తలపైన కొమ్ములింకా మొలవలేదే?"

గురుమూర్తంలో ఉండే రోజుల్లోనే పళని స్వామి లైబ్రరీ నుండి పుస్తకాలు తెస్తే రమణ చదివేవారు. అలా చదవడంవల్ల రమణకు వేదాంత పరిజ్ఞానం ఏర్పడ్డది. విరూపాక్ష గుహకు చేరిన తర్వాత అప్పుడప్పుడు జటస్వామిని కలుస్తుండే వారు. స్వామి వద్ద చాలా సంస్కృత గ్రంథాలున్నాయి. వాటిని రమణ అలా తిరగేస్తుండేవారు. ఒకప్పుడు ఒక పండితుడు గుహకు వచ్చి శంకరాచార్యుల వివేక చూడామణి అక్కడ వదిలిపెట్టి వెళ్లాడు. దానిని తమిళ వచనంలోకి రమణ అనువదించాడు – ఎప్పటికైనా పనికొస్తుందని.

మొదట్లో రమణునికి పరిచయం అయిన ఉద్దండి నాయనార్ తన మఠానికి వెళ్లిపోయి ఏడు సంవత్సరాల తర్వాత తిరిగి వచ్చాడు. గురుదక్షిణగా నూరు రూపాయలు రమణకు సమర్పించుకున్నాడు. రమణ డబ్బు నిరాకరించడం వల్ల మరో భక్తుడి చేతిలో పెట్టి 'ఏదైనా మంచి పనికి పనికొస్తుంది, ఉంచండి' అని వెళ్లిపోయాడు. ఆ డబ్బుతో "వివేకచూడామణి" అచ్చు వేయించారు.

★ ★ ★

అప్పట్లో అరుణాచలంపైన పులులు, చిరుతలు సంచరిస్తుండేవి. స్వామికి భయం లేదు. **జ్ఞానికి కోరికలు, భయాలు ఉండవు.** వారిని పులులు ఏం చేస్తాయి! ఒక సంఘటన వాసుదేవశాస్త్రి ఇలా నమోదు చేసుకున్నాడు : "ఒక రోజున పట్టపగలు స్వామిగారు, నేనూ గుహ వెలుపల రాయిపైన కూర్చుని ఉన్నాం. క్రింద లోయలో ఒక పులి, చిరుత కనిపించాయి. వాటి ఆట చూచి స్వామి వినోదిస్తున్నారు. నాకు కంగారు పుట్టి స్వామిని గుహ లోపలకు రమ్మని పిలిచాను. అక్కడే కూర్చున్నారు మొండిగా. నేను గుహ లోపలకు వెళ్లి దాక్కున్నాను. ఆ జంతువులు కాసేపు ఆడాయి. భగవాన్ వాటిని పిల్లికూనల్లా చూచారు. ఒకటి కొండపైకి, రెండవది క్రిందికి వెళ్లిపోయాయి. నేను బయటకొచ్చి అడిగాను."

"స్వామీ అవి మీ దగ్గరగా వచ్చినప్పుడు మీకు భయం కలగలేదా?"

"వాటికి అపకారం తలపెడితే భయపడతాయి. మనకు అపకారం చేయాలన్న ఆలోచన రాకుంటే భయముండదు. అవీ భయపడవు". భగవాన్ ఎంత చెప్పినా నాకు చిరుతలన్నా, పులులన్నా భయం పోలేదు. సత్యమంగళం వెంకటరామ అయ్యర్ విరూపాక్ష గుహకు వచ్చి వారం రోజులున్నాడు. ఆయన రమణ దర్శనానికి రావడం అదే మొదటిసారి, చివరిసారి. ఆ వారంలో రమణ మహర్షి పైన "స్తుతిపంచకం" అని అయిదు శ్లోకాలు రాశాడు. అవి నాటికి నేటికి ఆణిముత్యాలు. రమణ భక్తులకు నిత్య స్తోత్ర రత్నాలు.

బి.వి. నరసింహస్వామి, వెంకటరామ అయ్యర్‌ను కలుసుకోవాలని సత్య మంగళం వెళ్లాడు. ఆ ఊళ్లో ఆ పేరుగల వ్యక్తి అసలు ఎవరూ లేరని తెలిసింది. రమణ స్వామి 'సత్యమంగళం' అంటే సాక్షాత్తు ఈశ్వరుడని, ఆ వచ్చినవాడు ఈశ్వర ప్రతినిధి అని వివరించారు.

రమణ మహర్షి భక్తులతో కలిసి గిరిప్రదక్షిణ చేసేవారు. ప్రదక్షిణలో భక్తులు "రమణ సద్గురు ..... రమణ సద్గురు" అని స్తుతించడం, జపించడం అలవాటు. మహర్షి వారితో కలిసి తానూ "రమణ సద్గురు - రమణ సద్గురు" అని జపించేవారు.

ఒక శిష్యుడు ఉత్సుకత అణచుకోలేక "అదేమి స్వామీ... మీ పేరు మీరే జపిస్తున్నారని" ప్రశ్నించాడు.

రమణ నవ్వుతూ "తప్పేమిటి?" ఉన్న సద్గురు రమణు డొక్కడే గదా! మీకొక రమణుడు. నాకు వేరొక రమణుడు ఉంటాడా?.... 'రమణ' అంటే ఈ అయిదారు అడుగుల శరీరం కాదు కదా! ..." అన్నారు.

అవును రమణ మహర్షికి బంగారు పట్టుపుట్టాలు కప్పి, ఎంతగా అలంకరించినా లోపల మిగిలేది శరీరంలేని 'ఆత్మ' మాత్రమే కదా! అదే రమణ తత్వం.





# 11. మరొక మరణానుభవం

**ఒ**క మరణమో, ఒక శవ దర్శనమో, మరణానుభవమో జ్ఞాన మార్గంలో ప్రవేశింప చేస్తుందనడానికి అనేక మంది మహర్షుల, మహాయోగుల జీవిత చరిత్రలలో కనిపించే మరణానుభవాలే నిదర్శనం. రమణ మహర్షికి తన తండ్రిగారి మరణం "మరణం అంటే ఏమిటి?" అనే ప్రశ్న కలిగించింది.

1912లో విరూపాక్ష గుహలో ఉన్న రోజుల్లో ఒకసారి రమణ మహర్షి, పళని స్వామి, వాసుదేవశాస్త్రి, మరికొందరు కలిసి పచ్చియమ్మన్ కోవెలకు స్నానానికి బయలు దేరారు. అక్కడ నీరు పుష్కలంగా ఉంటుంది. స్నానం ముగించి తిరిగి కొండకు బయలు దేరారు. మామూలు బాటలో కాక వేరే దగ్గిర బాటన నడుస్తున్నారు. ఉదయం పదిగంటల వేళ, ఎండ తీవ్రంగా ఉంది. తాబేలు కొండ సమీపిస్తుండగా రమణ మహర్షికి కళ్లు తిరిగినట్లయింది. వారి మాటల్లోనే జరిగిన విశేషం –

"నా కళ్ల ముందరి దృశ్యం ఒక్కసారిగా అదృశ్యమైంది. అంతే నా ఆంతర్యానికి, బాహ్య ప్రపంచానికి మధ్య ఒక తెర వేసినట్లయింది. ఆ తర్వాత జరిగింది క్రమంగా తెలిసింది. ముందు ప్రకృతిపైన తెరపడి, ఒక కొంత మేర మాత్రమే నాకు కనిపించింది. నడవలేకపోయాను. పడిపోతానేమో అనిపించింది. కొంచెం సేపటికి లేచి నడిచాను. కొంచెం సేపటికి మళ్లీ అలాగే కళ్లు తిరిగాయి. ఒక కొండ రాయికి ఆనుకుని నిలబడ్డాను. మూడవసారి అలాగే జరిగింది. ఇక లాభం లేదని కూర్చుండి పోయాను. అప్పుడు తెల్లమబ్బు విడిపోయింది. తల

గిరగిర తిరగసాగింది. నా రక్తం గడ్డ కట్టింది. శ్వాస నిలిచిపోయింది. చర్మం నీలంగా మారింది. అది మృత్యువే. నల్లగా ముందుకు వచ్చి నన్ను కమ్మేసింది.

వాసుదేవ శాస్త్రి నేను చనిపోయాననే అనుకున్నాడు. నన్ను కౌగలించుకొని ఏడవసాగాడు. అతని శరీరం వజవజ వణకసాగింది. అప్పుడు అతను నన్ను గట్టిగా కౌగలించుకొని, ఏడుస్తున్నట్లు తెలిసింది. నా శరీరం రంగు మారడం, శ్వాస ఆగడం తెలిసింది. శరీరం చల్లబడ్డది. అయినా నాలో చైతన్య ప్రవాహం ఆగలేదు. నాకు భయం కలగలేదు. నా శరీరస్థితికి దిగులు కలగలేదు. ఒక కొండరాయి ప్రక్కన కూర్చుని, కళ్లు మూసుకున్నాను. ధ్యాన ముద్ర పట్టాను. నాలో రక్తప్రసరణ లేకపోయినా, శ్వాస లేకపోయినా, బండకు ఆనుకోకుండా, నిటారుగా కూర్చోగలిగాను. పది, పదిహేను నిమిషాలు అలా ఉన్నాను. అప్పుడు ఒక్కసారిగా నా శరీరం షాక్ తిన్నది. రక్త ప్రసరణ మొదలైంది. శ్వాసించ గలిగాను. ఒళ్లంతా చెమటపట్టింది. శరీరం రంగు మామూలు స్థితికి వచ్చింది. కళ్లు తెరిచి 'వెళదాం నడవండి' అన్నాను. విరూపాక్ష గుహకు చేరుకున్నాం".

1896 నాటి అనుభవం వేరు. అది మరణ భయం. అప్పుడు చనిపోతున్నానన్న భావన భయంగా మారింది. వెంటనే అది ఏమిటో అనుభవిద్దామన్న ఉత్కంఠతో వెల్లకిలా పడుకుని మరణిస్తున్న భావన చేయడం జరిగింది. శవంలాగా పడుకొని, పెదాలు బిగబట్టి, శ్వాసను బంధించాడు. అది భౌతికంగా మరణం కాదు. భావ మరణం. ఇప్పటిది భావాతీత మరణానుభవం. లోపల 'జీవచలనం' యదావిధిగా వుంది. అప్పటి అనుభవం, అనుభూతి తర్వాత నన్ను వెన్నాడుతూనే వుంది.

ఇప్పటి రెండవ అనుభవం నిజమైన, అసలు సిసలైన మరణానుభవం. పదిహేను నిమిషాలపాటు శరీరం మరణించింది.

ఇలాంటి అనుభవాలు సామాన్యులకు కలిగితే చచ్చి ఊరుకుంటారు భయంతో. **మరణ భయంలేని జ్ఞానులు మాత్రమే మరణంపై శోధన చేస్తారు. అంతశ్శోధన చేస్తారు. మరణాన్ని విశ్లేషిస్తారు. మరణాన్ని దాటిపోగలుగుతారు.**



# 12. అరుణాచల చరిత్ర

**"నేను కైలాసంలో ఎప్పుడోగాని కనిపించను. మేరుపర్వతం పైన, ఇతర కులపర్వతాల పైన అప్పుడప్పుడు ఉంటాను. ఎల్లప్పుడూ నా నివాసం అరుణాచలం. నేనే అరుణాచలాన్ని. శిఖర దర్శనంతో ప్రజల పాపాలు నశిస్తాయి. ఆత్మజ్ఞానం కలుగుతుంది".**

అరుణాచల మాహాత్మ్యం స్కందపురాణంలో ఉంది. అందులోనూ మూడు రకాల కథలున్నాయి. సూతముని, గౌతమమహర్షి, నందికేశ్వరుడు వేరు వేరుగా కథలు చెప్పారు.

**మొదటి కథ :** సృష్టి తొలినాళ్లలో సృష్టికర్త బ్రహ్మకు, సృష్టి వ్యవహర్త విష్ణుమూర్తి గారికి నేను గొప్ప, నేను గొప్ప అని తగవు వచ్చింది. అహంకారం! ఎవరికి వారే లోకాన్ని ఉద్ధరిస్తున్నామనుకున్నారు. అహంకారంతో స్వస్వభావం విస్మరించారు. వారిద్దరి అహం అణచడానికి పరమయోగి అయిన శివుడు, వారి ముందు జ్యోతిగా ప్రత్యక్షమై అటు ఆకాశంలోకి, ఇటు భూమిలోకి విస్తరింపజేసి "ఎందుకు మీ రిద్దరూ కలహించుకుంటారు. ఈ జ్యోతికి ఆద్యంతాలు తెలుసుకున్నవారు గొప్పవారు" అన్నాడు.

విష్ణువు వరాహరూపం ధరించి నేలలోకి మార్గం చేసుకుంటూ వెళ్లాడు. ఎంతదూరం వెళ్లినా ఆ జ్యోతికి మొదలు తెలియక, సిగ్గుపడి, అలసిపోయి, అవమానంతో తలదించి శివుని క్షమించమని అర్థించాడు. బ్రహ్మగారు హంసరూప మెత్తి ఆకాశయానం చేసి జ్యోతి శిఖరం కానక, ఓటమి నంగీకరించాడు. బ్రహ్మ

విష్ణు లిరువురు తమ ఔన్నత్యం తమది కాదని, అది మహాయోగి అయిన శివునిదని గ్రహించారు. వారు శివుని ప్రార్థించారు ... అరుణాచల రూపంలో లింగాకారంలో భూమిపైన వెలిసి ఉండమని. శివుడు అరుణాచల రూపం ధరించాడు.

**రెండవ కథ :** అరుణాచలేశ్వరుని అర్థ నారీశ్వర తత్వానికి సంబంధించింది. ఒకసారి కైలాసంలో పార్వతీదేవి శివునితో సరససల్లాపాలు ఆడుతూ శివుని కళ్లు తన చేతులతో మూసింది ... దాగుడుమూత లాటలో వలె. శివుని కళ్లు మూతపడగానే లోకం చీకటై పోయింది. అది కొన్ని క్షణాలే అయినా లోకాలు గగ్గోలు పడ్డాయి. శివుడు పార్వతిపై ఆగ్రహించి వెళ్లి భూలోకంలో తపస్సు చేయమని శపించాడు. ఆమె తొలుత కాశీలో, తర్వాత కంచిలో తపస్సు చేసింది. ఆ తర్వాత శివుడు అరుణాచలంలో తపస్సు చేయమని కోరాడు. తపస్సు ప్రారంభించే ముందు అరుణాచల మాహాత్మ్యం గురించి గౌతమ మహర్షిని అడిగి తెలుసుకోమన్నాడు. పరమశివుడే అరుణాచలంగా మారిన ఉదంతం గౌతముడు వివరించాడు –

“అరుణాచల మహత్తును కోటి గొంతులతో వర్ణించడం సాధ్యం కాదు. అరుణగిరి ప్రదక్షిణ వల్ల కోరిన కోరికలు సిద్ధిస్తాయి. జిజ్ఞాస కలవారికి జ్ఞానం ప్రాప్తిస్తుంది.”

**మూడవ కథ :** అరుణాచలం పైన గౌరీదేవి తపస్సు ప్రారంభించింది. ఆమె తపస్సును మహిషాసురుడు భగ్నం చేయడానికి శతవిధాల ప్రయత్నించాడు. అతని ఎత్తులు పారలేదు. ఆమె తపశ్శక్తి ముందు, అరుణాచల శక్తి ముందు మహిసాసురుని శక్తులు నిర్వీర్యమైనాయి. అప్పుడు శివుడు ఆమె తపస్సుకు ముగ్ధుడై ప్రత్యక్షమైనాడు. అదే కార్తీకమాసం కృత్తికా నక్షత్రం రోజు. గౌరీదేవి శివుని అర్థించింది ... ఇకపైన తనను వేరు చేయవద్దని, ఇద్దరూ ఎల్లప్పుడూ కలిసి ఉండేటట్లు వరం ప్రసాదించమని అర్థించింది. పైగా మరో రెండు వరాలు కోరింది. అరుణాచలంలో శివుడు ప్రసన్న వదనంతో దర్శనమిస్తూ కోరిన వారికి కొంగు బంగారంగా నిలవాలని; ఒకసారి దర్శించినా భక్తులను పాప విముక్తుల్ని చేసి, మోక్షం కలిగించాలని. శివుడు గౌరీదేవికి ఆ రెండు వరాలు అనుగ్రహించి ఆమెకు తనలో సగభాగం దత్తం చేశాడు. అది అర్థనారీశ్వర గాథ.

## అచల గురువు

అరుణాచలాన్ని ఆత్మ గురువుగా, అచల గురువుగా భావించడం అనాదిగా వస్తున్నది. **ప్రతి యోగి, ప్రతి ధ్యాని హృదయంలో వెలిగే జ్యోతి, తేజస్సు అచలమే.** అయితే అరుణగిరిని గురువుగా భావించి ధ్యానించిన వారు బహు తక్కువ మంది.

భౌతికగురువు పైన కుదిరే నమ్మకం ఆత్మగురువు పైన నిలబడదు. అది రమణ మహర్షి వంటి వారికి మాత్రమే సాధ్యం. గురు – శిష్య సంబంధానికి కొత్త అర్థం యిస్తుంది అరుణాచలం. అరుణగిరి ప్రదక్షిణ చేసిన వారికి భౌతిక గురువు అవసరం ఉండదు. యోగులకే యోగగురువైన ఈశ్వరుడే అందరి హృదయాలలో ఆత్మ గురువుగా భాసిస్తాడు. అచలాన్ని పర్వతంగా భావించే వారి మాట ఏమో గాని అరుణాచలాన్ని ఈశ్వర చైతన్యంగా భావించే వారికి అది అచల గురువు. నిశ్చల సమాధికి ప్రతీక అరుణాచలం. తపస్సుకు తావలం అరుణగిరి. మహా యోగులకు మహర్షులకు నెలవు తిరువణ్ణామలై.

అరుణగిరిపై గురుభావన నిలిపి, "గురువు"గా భావించిన మహాయోగి 16వ శతాబ్దానికి చెందిన 'గుహై నమశ్శివాయ.' కొండపైన ఒక గుహ ఉంది. ఆయన ఆ గుహలో ఉంటూ తపస్సు చేసుకునేవారు. అందువల్ల ఆయనకు ఆ పేరు స్థిరపడ్డది. గిరినే గురువుగా భావించిన తొలి మహర్షి ఆయన. రమణ మహర్షి కూడా మొదటి నుండి అరుణాచలాన్నే గురువుగా భావిస్తూ వచ్చారు. చాలా మంది అభిప్రాయం ధ్యానానికి గురువు అవసరమని. ఆ భావనతో రమణ మహర్షికి గురువు లేదని కొందరు వాదిస్తారు. అరుణాచలమే తన ఆత్మగురువని రమణ మహర్షి అనేక సందర్భాలలో వ్యక్తీకరించారు.

ఒకసారి శ్రీ అరవింద యోగి శిష్యుడు దిలీప్‌కుమార్ రాయ్ పుదుచ్చేరి నుండి రమణాశ్రమానికి వచ్చాడు. ఆయనకు రమణ మహర్షికి మధ్య జరిగిన సంభాషణ రమణ హృదయాన్ని స్పష్టంగా ఆవిష్కరిస్తుంది.

దిలీప్‌కుమార్ రాయ్ : భగవాన్! గురువు అవసరం లేదని మీరు అంటున్నట్లు ప్రచారం జరిగింది. కొందరు తద్విరుద్ధంగా చెబుతారు... మీ అభిప్రాయం?

భగవాన్ : నేను ఎప్పుడూ ఎవరికీ చెప్పలేదు గురువు అవసరం లేదని.

దిలీప్ : మీకు గురువు లేదని శ్రీ అరవిందులు చెబుతుంటారు.

భగవాన్ : మీరు 'గురువు' పదాన్ని ఏ అర్థంలో వాడుతున్నారు? గురువు మానవ రూపంలోనే ఉండనవసరం లేదు. దత్తాత్రేయునికి ఇరవై నలుగురు గురువులున్నారు. ఆయన అన్ని గుణాలను గురువులుగా భావించాడు. ప్రపంచంలోని ప్రతిరూపం ఆయనకు గురువే. గురువు తప్పకుండా కావాలని ఉపనిషత్తులు స్పష్టంగా చెప్పాయి. **మనిషిని మనస్సనే కీకారణ్యం నుండి బయటకు తీసుకు రాగలిగింది గురువే. కనుక గురువు అవసరం ఉంది.**

దిలీప్ : నా ఉద్దేశం భౌతిక రూపంలో గురువని. మహర్షికి అలాంటి గురువు లేదని.

భగవాన్ : ఎప్పుడో నాకూ ఉండే ఉంటారు. నేను అరుణాచలాన్ని స్తుతించాను. గురువంటే ఏమిటి? గురువంటే భగవంతుడు. గురువంటే ఆత్మ. మొదట మనిషి దేవుని అర్థిస్తాడు తన అవసరాలు తీర్చమని. తర్వాత అవసరాలుండవు. తన కోసం భగవంతుని ప్రార్థిస్తాడు. అప్పుడు భగవంతుడు ఏదో ఒక రూపంలో – మానవ రూపం కావచ్చు, మరొక రూపం కావచ్చు– కనిపించి 'గురువు'గా మార్గదర్శకుడవుతాడు. అదీ, ప్రార్థన ఫలితమే.

కొందరి విశ్వాసం అరుణాచలమే రమణుని రూపం ధరించిందని. ఎందుకు? అరుణాచల హృదయాన్ని, తత్వాన్ని, పరమార్థాన్ని అర్థం చేసుకోలేని వారి కోసం రమణగా మానవరూపం ధరించవలసి వచ్చింది. రమణులే ఒక గీతంలో చెప్పుకున్నారు –

"భూమినాథుని పవిత్రక్షేత్రమైన తిరుచ్చుళిలో నేను జన్మించాను. నా తండ్రి సుందరం – తల్లి సుందరి. నన్ను ప్రాపంచిక బంధాల నుండి ఉద్ధరించింది అరుణాచల శివుడు".

గురువు ఏం చేస్తాడు? శిష్యునిపై తన అనుగ్రహం ప్రసరింప చేస్తాడు. శిష్యుడు 'ఆత్మజ్ఞానం' పొందినప్పుడు గురువు ఆనందిస్తాడు. శిష్యుడు తనంతటి జ్ఞాని కావాలని ప్రతి గురువు ఆశిస్తాడు.

ఆ ప్రమాణంలో ఎందరినో ఉద్ధరించిన రమణ ... సద్గురువు ... జగద్గురువు.

## గిరిప్రదక్షిణ – గురుప్రదక్షిణ

రమణ మహర్షి తపశ్చర్యలో గిరి ప్రదక్షిణ అంతర్భాగం. గిరి ప్రదక్షిణ చేయడం అంటే పరమ శివుని చుట్టూ ప్రదక్షిణ చేయడమే. నేరుగా శివాలయానికి వెళ్లి శివలింగాన్ని దర్శించనవసరం లేదు. శివుడే 'గిరి' రూపంలో వెలిశాడు. అరుణగిరి మొత్తం లింగాకృతిలో ఉంటుంది. కొండ చుట్టుకొలత ఎనిమిది మైళ్ళు. ప్రదక్షిణ చేసేవారు తమకు కుడివైపు కొండ ఉండేట్లు నడవాలి. దారిలో అనేక స్నాన ఘట్టాలు, సత్రాలు, దేవాలయాలు ఉన్నాయి. నెమ్మదిగా ప్రదక్షిణ చేయాలి తప్ప ఉరుకులతో పరుగులతో కాదు. రోడ్డుకు ఎడమవైపు నడవాలంటారు రమణమహర్షి. కుడివైపున సిద్ధులు, మహర్షులు సూక్ష్మశరీరులుగా ప్రదక్షిణ చేస్తుంటారుట.

1900 నుండి 1926 వరకు మహర్షి తన శిష్యులతో ప్రదక్షిణ చేస్తుండేవారు. "ఎప్పుడూ ప్రదక్షిణ ఉద్వేగంగా సాగేది. ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు బయలుదేరే వాళ్ళు. పండుగ దినాలలో, ఉత్సవ సమయాలలో సరేసరి. జనం గుంపులుగా ఉండేవారు. ఎక్కడ అలసిపోతే అక్కడ ఆగిపోవడం, వండుకు తినడం. మళ్లీ

నడక. తొందరలేని నడకన్నమాట. గమ్మత్తేమిటంటే కూర్చుంటే ధ్యానం అనిపించదు. ప్రదక్షిణ ప్రారంభించి నడిస్తే అంతా ధ్యానమే. ఆ ప్రదేశం అంత పవిత్రం. ఎంత ఓపిక లేని వాళ్లయినా ఒకసారి గిరి ప్రదక్షిణ చేస్తే మళ్లీ మళ్లీ చేయాలనిపిస్తుంది. ఏదో ఆకర్షణ లాగుతుంది. ఎన్నిసార్లు ప్రదక్షిణ చేసినా తమి తీరదు".

మహర్షి ప్రదక్షిణకు బయలుదేరుతున్నారని తెలియగానే ఆశ్రమం మొత్తం కదిలేది. మహర్షి తోడుగా ప్రదక్షిణ చేయడం విశేషం. ఒక్కొక్కసారి రాత్రి భోజనం అయిన తర్వాత బయలుదేరి తెల్లవారే సరికి ప్రదక్షిణ పూర్తి చేసేవారు. ఒక్కొక్కసారి ఉదయమే బయలుదేరినా తిరిగి రావడానికి రెండు మూడు రోజులు పట్టేది. ఎనిమిదిమైళ్లు చుట్టిరావడానికి అంత సమయం ఎందుకు? అనుకుంటారు. మూడు గంటలు చాలు. దానివల్ల ఇతరులకు మేలు కలగాలి. మహర్షి ఒక విధమైన సమాధిలో నడిచేవారు. ఎంత నెమ్మది నడకో! అడుగులో అడుగు వేస్తూ మధ్య మధ్య ఆగుతూ పోతారు. గంటకు ఒక మైలు సాగడం కష్టం. మైలుకు, అరమైలుకు ఏ చెట్టు క్రిందనో పావుగంట విశ్రాంతి. ఆయనకు ఎంత ఆత్మానందమో! **ప్రదక్షిణలో ఏ శబ్దాలు వినపడవు. అరుణగిరి అంటే విశ్వకేంద్రం!**

ప్రక్కన నడిచే భక్తులు రమణను శివునిగా భావించేవారు. వారంతా ప్రమద గణాలు. వారూ అంతటి తన్మయం చెందుతుండేవారు. ఒక చిత్రమైన సంఘటన జరిగింది ఒకసారి.

అవి స్కందాశ్రమంలో ఉండేరోజులు. భగవాన్ కడుపు సరిగా లేదన్నారు. "లంఖణం పరమౌషధం" ఒకరోజు తినడం మానివేస్తే సర్దుకుంటుంది. ప్రదక్షిణ చేస్తే బావుంటుంది. కడుపు చక్కబడుతుంది. ఆశ్రమం నుండి ఒకటి రెండు ఫర్లాంగులు నడిచే సరికి అయిదారుగురు యువతులు కనిపించారు. అందరూ పల్లెపడతులే. కర్రలు, పుల్లలు ఏరుకునేవారిలా ఉన్నారు. ఆకులు కోసి విస్తళ్లు కుడతారు. వాళ్ళ బుట్టలు ఖాళీగా ఉన్నాయి. వారు భగవాన్‌ని చూచి "స్వామీ దగ్గరలో మంచినీళ్లు ఎక్కడ దొరుకుతాయి" అని అడిగారు. ఆ దగ్గరలో నీళ్ల చెరువు ఉంది. భగవాన్ ప్రదక్షిణకు బయలుదేరుతుండగా వాళ్లలో ఒకామె అన్నది: "స్వామీ  కాస్త ఎంగిలి పడండి. నావద్ద తెచ్చుకున్న భోజనం వుంది". వద్దనడం ఏం భావ్యం? ఏదో ఆడకూతురు, భక్తిగా ప్రసాదం పెడతానంది. సరే నన్నాడు. ఆమె మూటవిప్పి కాస్త అన్నం పెట్టింది. వెంటనే మరొకరు, మరొకరు అందరూ అన్నం మూటలు విప్పి స్వామికి భక్తితో సమర్పించారు. భోజనం వద్దనుకుని ప్రదక్షిణకు వస్తే ఈ ప్రసాదాల ఫలహారం ఏమిటి? మామూలుగా తినేదానికంటే ఆరుగురు అతివల ప్రసాదం ఎక్కువే తిన్నారు.

వాళ్లను వదలి ముందుకుసాగిపోయాడు. కొన్ని మైళ్లు నడిచారు. మధ్యాహ్నం వేళకు వాళ్లు మళ్లీ తారసపడ్డారు. వాళ్ల చేతుల్లోని బుట్టలు ఖాళీగా ఉన్నాయి. ఆకులు, పుల్లలు ఏవీ ఏరినట్లు లేదు. భగవాన్ దగ్గరకు వచ్చి, "స్వామీ భోజనం చేసే వేళైంది. మాతోపాటు మీరు భోజనం చేస్తే మాకు సంతోషం"– అన్నారు.

అని ప్రతి స్త్రీ, తన మూటలోంచి భగవాన్‌కు పెట్టారు. అందరు పెట్టింది తృప్తిగా తిన్నాడు భగవాన్. అంతటితో కథ అయిపోలేదు. కొంతదూరం వెళ్లే సరికి ఎదురుగా మనవాసి రామస్వామి అయ్యర్ వస్తూ కనిపించాడు. ఆయన రమణ ప్రియశిష్యులలో ఒకరు. భగవాన్ ఏమీ తినకుండా ఒంటరిగా వెళ్లారని విని మిరియాల రసం తయారుచేసి, భోజనం తీసుకుని ఆ ప్రదక్షిణలో ఎదురువచ్చాడు. ఎదురుగా వెళితే స్వామిని తేలికగా పట్టుకోవచ్చు. మధ్యాహ్నం రెండు గంటలకు భగవాన్ దొరికారు, పాపం అంత కష్టపడి వచ్చిన వాని మనస్సు నొప్పించలేక శుభ్రంగా భోంచేశారు భగవాన్. ఇద్దరూ కలిసి సాయంత్రానికి ఆశ్రమం చేరారు.

ఉపవాసం చేయాలని నిర్ణయించిన దాని ఫలితం అది.

మహర్షి గిరి ప్రదక్షిణ చేసేటప్పుడు ఎవరో దివ్య శరీరులు నేలకు అయిదారు అడుగుల ఎత్తున మహర్షితో కలిసి ప్రదక్షిణ చేసేవారని ముదలియార్ అనే భక్తుడు అంటాడు.

"ఒకసారి భగవాన్ గిరి ప్రదక్షిణ చేస్తూ ఆదిఅన్నామలై దేవాలయాన్ని దర్శించారు. అక్కడ సామవేద పఠనం జరుగుతున్నది. మనుషులు ఎవరూ లేరు".

1926 తర్వాత భగవాన్ గిరి ప్రదక్షిణలు విరమించుకున్నారు. కారణం ఆయనతో భక్తులు గుంపులు గుంపులుగా బయలుదేరేవారు. మధ్యలో ఉన్న ఇళ్లవాళ్లకు అంతమందికి భోజనాలు పెట్టడం కష్టమయ్యేది.

గిరి ప్రదక్షిణలో భగవాన్‌కు ఒక రైతుతో స్నేహం ఏర్పడ్డది. అతను ఆది అన్నామలై దేవళం వద్ద భగవాన్ కోసం ఎదురుచూచేవాడు. ఏదైనా స్వామికి ప్రసాదం పెట్టేవాడు. ఒకసారి అతను చెట్టుకింద దిగులుగా కూర్చున్నాడు స్వామి వచ్చేవేళకు. స్వామికి పెట్టడానికి కొంచెం అన్నమే మిగిలిందట.

భగవాన్ ఆ కాస్త అన్నం తీసుకుని గిన్నెలో నీళ్లు కలిపి, నిమ్మరసం, అల్లం కలిపి తాను ఒక గ్లాసు రసం తాగి 'అద్భుతంగా ఉంది స్వామీ' అని అభినందించారు. అదే భక్తులందరికీ తలా ఒక గ్లాసు ఇచ్చారు. మిగిలింది ఆ ముసలి తాతకిచ్చాడు "ఇంటికి తీసుకుపో" అని.

అదే భగవాన్ చివరి గిరి ప్రదక్షిణ.



# 13. చీకటిలో చిరుదివ్వెలు

**అహ మేకో నమే కశ్చిత్ నాహ మన్యస్య కస్యచిత్**
**నతం పశ్యామి యస్యాహం తం న పశ్యామి యో మమ!**

*నేను ఏకాకిని. నాకెవరూ లేరు, ఏదీ నాది కాదు. నేను ఎవరి వాడను కాను. ఎవరికి నేను ఏమీ కాను. నావారు అనుకునే వారు నాకెవరూ లేరు.*

## ఫ్లాష్ బ్యాక్

1896 ఆగస్టు 29న వెంకట్రామన్ ఇల్లు విడిచి బయలుదేరాడు. ఆ విషయం ఇంట్లో వారికి తెలియడానికి ఆట్టే కాలం పట్టలేదు. అన్నగారి పుస్తకాల పెట్టెలో వెంకట్రామన్ రాసిపెట్టిన ఉత్తరం కనిపించింది. రహస్యం బట్టబయలైంది. బాంబు పేలింది. కుటుంబం అల్లకల్లోలమైంది. అతను ఇల్లు వదలి పోతాడని ఎవరూ ఊహించలేదు. రవ్వంత అనుమానం కలిగినా తగిన బందోబస్తు చేసి ఉండేవారు. కలలో సైతం జరగకూడని సంఘటన వాస్తవంలో జరిగింది. ఉత్తరంలో ఎవరిపైన నింద లేదు. ఒక్క కటువు మాట లేదు. స్థిరచిత్తంతో రాసినట్లే వుంది. ఆత్మనిగ్రహం కనిపించింది. ఎవరో తిట్టినందుకు అది ప్రతిక్రియ కాదు. ఆత్మగత వైరాగ్యం. ఎవరికీ వెడుతున్నట్లు సూచనగా నైనా చెప్పలేదు. మరీ ఆశ్చర్యం! ఎక్కడకు వెళ్లినట్లు? తెలిసిన వాళ్లందరినీ విచారించారు. మనమదురైలో ఉన్న తల్లికి కబురు చేశారు. ఆమె గుండె పగిలేటట్లు ఏడవడం తప్ప చేయగలిగింది లేదు. కన్నపేగు కదా! స్కూలులో విచారించారు. అతను వెళ్లే తావులు వెతికి చూచారు. నిరాశే మిగిలింది.

చేతిలో మూడు రూపాయలున్నాయి కనుక వెంటనే డబ్బుకు ఇబ్బంది ఉండదు. మూడు రూపాయలంటే మాటలా, నెల రోజులకు సరిపోతుంది. ఆ డబ్బు ఖర్చవగానే తిరిగి వస్తాడన్న చిరు ఆశ. రోజులు గడిచాయి. నెలల్లోకి కాలం సాగుతోంది. వెంకట్రామన్ తిరిగి వచ్చే జాడ కనిపించలేదు. ఆ ఆశ కూడా సన్నగిల్లింది. దేశాంతరం వెళ్లాడా! సన్యాసుల్లో కలిసిపోయాడా! కన్నతల్లి బాధ ఎక్కువైంది. మరుదులు సుబ్బయ్యర్, నెల్లియప్పన్‌లను ప్రాధేయపడ్డది బిడ్డను ఎక్కడైనా వెతికించమని.

తెలిసిన వారొకరు చెప్పారు ... వెంకట్రామన్ ఏదో నాటకాల కంపెనీలో చేరాడని, త్రివేంద్రంలో తాను చూచానని. త్రివేంద్రం అంటే భూతల స్వర్గం. పాలు తేనెలు పుష్కలంగా లభించే దేశం. అక్కడ కరువు కాటకా లుండవట. ఎవరికీ భోజనానికి ఇబ్బంది ఉండదు. కన్నతల్లికి అది కాస్తంత ఊరట. నెల్లియప్పన్ త్రివేంద్రం వెళ్లి నాటక కంపెనీలన్నీ తిరిగి చూచాడు. వెంకట్రామన్ కనిపించలేదు. రెండవసారి అలగమ్మాళ్ తనూ బయలుదేరింది. వెంకట్రామన్ వయసువాడు, ఆ పోలికలున్నవాడు ఒకడున్నాడు ఒక నాటకం కంపెనీలో. అతను వెంకట్రామన్ ఎలా అవుతాడు? అతడు వీరిని చూచి మోహం తిప్పుకుని వెళ్లిపోయాడు. మదురై తిరిగి వచ్చారు. ఆశ సన్నగిల్లింది.

1898 మే 1న మదురైలో సుబ్బయ్యర్ కాలం చేశాడు. నెల్లియప్పన్ కుటుంబ సభ్యులు అంత్యక్రియలకు మదురై వెళ్లారు. అక్కడకు తిరుచ్చుళి నుండి వచ్చిన బంధువు ఒకాయన వెంకట్రామన్ సమాచారం కాస్త అందించాడు ... తిరువణ్ణామలైలో ఓ యువకుడు సన్యసించాడని, అతను వెంకట్రామన్ అయివుండవచ్చునని. బ్రాహ్మణ స్వామిగా జనం పిలుస్తున్నారు. అయితే మాటా పలుకూ లేదు. ఎవరితో మాట్లాడడు. కళ్లు విప్పడు. ఎప్పుడూ సమాధిలో ఉంటాడు!

ఇంకా వివరాలు అడగ్గా తాను మఠం పనిమీద తిరువణ్ణామలై వెళ్లానని; "అక్కడ తంబిరన్ అని మా మఠం వాడొకడున్నాడు. అతనే ఈ వివరాలు చెప్పాడు. ఆ స్వామి ఊరు తిరుచ్చుళి అనగానే నాకు మన వాడేనేమోనని అనుమానం వచ్చింది". అతను ఖచ్చితంగా వెంకట్రామన్ అయివుంటాడన్న నిర్ధారణకు వచ్చారు.

నెల్లియప్పన్ వెంకట్రామన్‌కు స్వయాన చిన్నాన్న. మనమదురైలో వకీలు. ఒక స్నేహితుని వెంటతీసుకుని తిరువణ్ణామలై బయలుదేరాడు. ఆ స్వామి కొండపైన మామిడి గుహలో ఉన్నాడని తెలిసింది. అయితే అక్కడ తోటమాలి ఒకడున్నాడు.

వాడు ఎవరిని తోటలోకి అనుమతించడని చెప్పారు. పైగా ఆ సన్యాసి మౌనంగా ఉంటాడు. ఎవరితో మాట్లాడడని ఖచ్చితంగా చెప్పారు.

అయినా ప్రాణం ఊరుకోక కొండపైకి వెళ్లారు. తాము స్వామికి అయిన వాళ్లమని బ్రతిమలాడారు. "ఆయన్ని పలకరించం. దూరంగా ఉండి చూచి పోతాం." అలా చూచినా తను వెంకట్రామన్ అవునో, కాదో తెలిసిపోతుంది కదా. తోటమాలి అంగీకరించాడు. నెల్లియప్పన్ ఒక కాగితంపైన తన పేరు, ఊరు రాసి యిచ్చాడు. "మానా మదురై వకీలు నెల్లియప్పన్ దర్శనం కోసం వచ్చి ఉన్నాడు".

వెంకట్రామన్ ఆ కాగితం చూడగానే అది రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటు వారి కాగితం అని గుర్తించాడు. దాని మీద తన అన్న నాగస్వామి దస్తూరీ వుంది. అంటే అన్న రిజిస్ట్రేషన్ శాఖలో ఉద్యోగం చేస్తున్నాడన్నమాట. కాగితం రెండవ వైపున చిన్నాన్న రాత వుంది. వారిని లోపలకు పంపమని చెప్పాడు.

నెల్లియప్పన్, ఆయన మిత్రుడు వచ్చారు. వెంకట్రామన్‌ని చూడగానే కన్నీళ్లు తిరిగాయి. అతని అవతారం చూచి ఖిన్నుడైనాడు. దిక్కూ మొక్కూలేని వాడిలా ఆ గోచీ ఏమిటి? మట్టికొట్టుకున్న శరీరం, జడలు కట్టిన జుట్టు, చిక్కిపోయిన శరీరం. స్వామి మౌనం పాటిస్తాడని చెప్పారు కనుక మాట్లాడించలేదు. పళని స్వామి విషయం గ్రహించి ఓదార్చాడు. తమ కుటుంబంలో ఒకరు సన్యాసి కావడం 'శాపం' అని చెప్పారు. అది శాపం కాదు 'వరం' అన్నాడు పళనిస్వామి ఆనందంగా.

"అయినా అంత వైరాగ్యం ఏమిటి? బట్టలు కట్టుకుని కాస్త శుభ్రంగా ఉండవచ్చుగా! సన్యాసం స్వీకరించిన వారంతా ఇలాగే ఉన్నారా? మౌనస్వామిగా, సన్యాసిగానే ఉండమనండి. కాస్త కన్నవారి పైన, అయినవారి పైన కనికరం చూపిస్తే ఏం పోతుంది? మా మనమదురైలో ఒక సమాధి మందిరం వుంది. అక్కడ ఇంతకంటే ప్రశాంతంగా ఉంటుంది. అక్కడకు వచ్చి ఉండమనండి. మాకళ్ల ముందు కనిపిస్తే అదే పదివేలు, మమ్మల్ని ఉద్ధరించనవసరం లేదు. తన అవసరాలు మేం చూస్తాం. ఏ ఇబ్బంది లేకుండా జాగ్రత్త తీసుకుంటాం. మీరైనా నచ్చ చెప్పండి బాబూ" అని అర్థించాడు.

వకీలు కదా! కాస్త మెలికపెట్టాడు. కోర్టులో ఆయన వాదన చెల్లుతుంది. కాని స్వామి ముందు చెవిటి వాని చెవిలో శంఖం ఊదినట్లే. స్వామి విగ్రహంలా కూర్చుండిపోయాడు. ఆయన నిగ్రహం ఆయనది. ఎవరూ దానిని కదిలించ లేరు. ఆయన ముఖ కవళికల్లో మార్పు రాలేదు. స్వామి ఆత్మ నిగ్రహం

అసాధారణం. సంయమనం సాటిలేనిది. నెల్లియప్పన్ మనసులో అనుకున్నాడు. 'వీడిగుండె బండబారింది. బంధుప్రీతి లేదు. ఎవరినీ దగ్గరకు రానిచ్చేటట్లు లేదు.' అయిదురోజులు తిరువణ్ణామలైలో ఉండి ప్రయత్నించాడు. వారికీ వీరికీ చెప్పుకున్నాడు సాయం చేయమని. భగవంతుడు సైతం అతని మొర ఆలకించే స్థితిలో లేడు. నిరాశ చెందినా లోలోపల సంతోషించాడు తమ వాడొకడు పూజనీయుడైనందుకు. ఇంటికి వెళ్లి అళగమ్మాళ్‌కు ఈ శుభవార్త అందించాడు. ఏదో సామెత చెప్పినట్లు 'శుభం పలకరా మంకెన్నా' అన్నట్లుంది నెల్గియప్పన్ నిర్వాకం. చూచి రమ్మంటే మరికొంత ఆజ్యం పోసి మంట ఎగతోశాడు! ప్రబుద్ధుడు: వకీలట వక్ర కీలుడు!

★ ★ ★

మామిడి తోటలో తపస్సు సాగడం లేదు. నెల్లియప్పన్ వచ్చి వెళ్లాక నిగ్రహం పలచబడ్డది. అక్కడి నుండి అరుణగిరి నాథర్ ఆలయానికి మారాలనుకున్నాడు. అది చాలా చిన్న దేవాలయం. అక్కడ ఎవరూ తనని గుర్తించే అవకాశం ఉండదు. అజ్ఞాతంగా తపస్సు సాగించ వీలుంది. చివరకు తనకు నీడలా ఉన్న పళని స్వామికి దూరంగా ఉండాలనుకుని పళనితో చెప్పాడు :

"పళనీ! నీదోవ నీవు చూచుకో. భిక్ష చేసుకుంటూ జీవించు పో ..." నా త్రోవన నన్ను పోనివ్వు. నా భిక్ష నేనే చేసుకుంటాను. ఇకపైన మనం కలిసి ఉండవద్దు".

పళని గుండె పగిలినంత పనైంది. చేతికందిన స్వర్గం చేజారిపోతుందా! ఊరిలో భిక్ష ముగించి అరుణగిరినాథ ఆలయానికి చేరి "స్వామీ మన్నించండి. నేను మిమ్మల్ని విడిచి ఉండలేను. చావో, బ్రతుకో మీతోనే. ఈ జన్మకు మీరే నా సర్వస్వం. నన్ను మన్నించి అనుగ్రహించండి. పొమ్మనకండి" అని ఏడ్చాడు.

రమణ ఆ దేవాలయంలో ఒక నెలరోజు లున్నాడు. ఒక వారం గాలి గోపురం లోను, ఒక వారం తోటలోను గడిపాడు. అక్కడ దేవాలయానికి వచ్చేవారి తాకిడి ఎక్కువైంది. ప్రశాంతత తగ్గింది. అక్కడి నుండి పవలకున్రు చేరుకున్నాడు. అది అరుణగిరి చాలులో ఉంది. అక్కడొక శివాలయం ఉంది. ప్రక్కన జలపాతం ఉంది. ఒక చక్కని గుహ, మఠం ఉన్నాయి. పళని లేనపుడు, అంటే ఊళ్ళోకి భిక్షకు వెళ్లినపుడు నిశ్చలంగా ధ్యానం చేసుకునేవాడు. గుడి పూజారి స్వామి గుడిలో ఉన్నదీ, లేనిదీ గమనించకుండా పని కాగానే గుడి తాళాలు వేసుకుని వెళ్లిపోయేవాడు. చాలామంది సాధు సన్యాసులు, బైరాగులు రమణస్వామి బయట కొస్తారని ఎదురు చూస్తూ కూర్చునేవారు. అయిదారు నెలలు రమణస్వామి

పవళకున్రులోనే ఉన్నాడు. అక్కడ నుండి తావు మార్చేలోగా ఆయన వైరాగ్యానికి మరొక పరీక్ష ఎదురైంది.

★ ★ ★

తన కొడుకుని తీసుకురానందుకు అళగమ్మాళ్ నెల్లియప్పన్‌పై విసుక్కుంది. తానే స్వయంగా తిరువణ్ణామలై వెళ్లి కొడుకుని కలిసి బ్రతిమిలాడి తీసుకొస్తానన్నది. అమ్మ హడావుడి చేసినంత మాత్రాన నాగస్వామికి సెలవు దొరుకుతుందా? క్రిస్మస్ సెలవులు యిచ్చే వరకు ప్రయాణం వాయిదా పడ్డది. అమ్మగారు, అన్నగారు వెళ్లే సరికి వెంకట్రామన్ మకాం పవళకున్రుకు మారింది. వీరు వెళ్లే సరికి స్వామి ఒక పెద్ద రాతి బండ మీద కూర్చుని చిదానందం అనుభవిస్తున్నారు. ఆ స్థితిలో కొడుకును చూచి గుండెలవిసేలా ఏడ్చింది కన్నతల్లి. ఇంటికి వెళదాం రమ్మని ప్రాధేయపడ్డది. ఆమె ఎవరో తనకు తెలియనట్లు రమణ ప్రవర్తించాడు. ఏమీ స్పందన లేదు, చలనం లేదు. అన్నను గుర్తించలేదు. గుర్తించినా బంధుత్వం జ్ఞాపకం రాలేదు.

సన్యాసి ఎన్ని బంధాలు వదలుకున్నా తల్లి అనుబంధాన్ని మరచిపోలేడు. అంచేత ఎవరైనా సన్యసించే ముందు తల్లి అనుమతి తీసుకోవాలంటారు. గృహస్థులైతే భార్య అంగీకారం లేకుండా సన్యసించ వీలుండదు. ఏ తల్లి తన బిడ్డడు సన్యసించడానికి అంగీకరిస్తుంది! తమని పట్టించుకోకపోవడం ఆమెకు మరింత బాధ కలిగించింది. ఆమె వెళ్లి  శిష్యుల వద్ద తనగోడు వెళ్లబోసుకుంది.

"మీ స్వామి నా కన్నకొడుకు బాబూ, దయచేసి మీరైనా వాడికి నచ్చ చెప్పండి".

పళనియప్ప వెళ్లి స్వామికి విన్నవించాడు తల్లిగోడు.

"స్వామీ! అమ్మగారు చాలా దిగులు పడుతున్నారు. ఆమెకు కనీసం జవాబైనా చెప్పకూడదా! కాస్త పలకరించండి స్వామీ, ఆమెకు ఓదార్పుగా ఉంటుంది. స్వామీ మీ వ్రత భంగం చేసుకోమని అనడం లేదు. ఈ కాగితంపైన రాయండి".

స్వామి ఇలా రాశారు :

***"ఎవరైనా ప్రారబ్ధకర్మ అనుభవించక తప్పదు. జరిగేది జరగక పోదు. జరగనిది ఎంత ప్రయత్నించినా జరగదు. జరిగేదాన్ని ఆపలేరు. జరిగే దానిని అలా జరగనివ్వకుండా నిరోధించడానికి యత్నించకండి".***

అది చదివి తనకు అంతే ప్రాప్తం అనుకున్నది అళగమ్మాళ్. బరువు గుండెతో తిరిగి మనమదురై వెళ్లిపోయింది పెద్దకొడుకుతో కలిసి.

అమ్మగారు అన్నగారు వచ్చివెళ్లిన తర్వాత పవలకున్రు నివాసం అంత శ్రేయస్కరం కాదనుకున్నాడు. ఇలాగే ఎవరో ఒకరు బంధువులు వస్తుంటారు. కొండ పైకి వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. అక్కడ చిన్నవి, పెద్దవి చాలా గుహలున్నాయి. పరిస్థితుల్ని బట్టి గుహలు మారుతూవచ్చాడు. ఈ గుహలు పరమేశ్వర మందిరాలు. ఏ గుహలోకి వెళ్లినా తపస్సు బాగానే ఉంటుంది. కొండపైకి వెతుక్కుంటూ వచ్చే భక్తుల వల్ల ఏకాంతం భంగపడుతోంది. ఒకస్వామి లభిస్తే భక్తులు వదిలిపెడతారా! చిన్నచిన్న గుళ్లను, విగ్రహాలనే వదలరు. మహత్తులున్న మహాత్ముల్ని వదిలే ప్రసక్తే లేదు. రెండు మైళ్లు కఠిన శిలలు దాటి, భక్తులు వస్తూనే ఉన్నారు. స్వామి వారి ఆకర్షణా, వారి భక్తా, ఏది గొప్పది?





# 14. విరూపాక్ష గుహ నివాసం

**వి**రూపాక్ష గుహ వేసవిలో చల్లగానూ, చలికాలంలో వెచ్చగానూ ఉంటుంది. వేసవికాలంలో ప్రక్కనున్న చెలమ ఎండిపోతుంది. గుహలోకి గాలి రాదు. నీటి ఎద్దడి కాస్త ఎక్కువ. ఆ సమీపంలో మామిడి చెట్టు ఒకటి ఉంది. దాని క్రింద 'ములైపాల్' తీర్థం ఒకటి ఉంది. గలీజుగా ఉంటుంది. మొదట స్వామి అక్కడే ఉండేవారు. తర్వాత ఇద్దరు సోదరులు కొండరాళ్లు పగుల కొట్టించి ఒక గోడ కట్టించారు. ఆ గోడలో ఒక గుమ్మం ఏర్పాటు చేశారు. ఇప్పుడది నివాస యోగ్యంగా ఉంది. ఆ సోదరులిద్దరూ స్వామిని అక్కడ ఉండమని అర్థించారు. వేసవి కాలంలో అక్కడ ఉండడానికి స్వామి అంగీకరించారు. ములైపాల్ తీర్థంలో మంచినీరు పుష్కలంగా లభిస్తుంది.

స్వామి ఎక్కడకు వెళ్లినా పళని స్వామి వదలడు. వద్దన్నా వెంటపడే స్వభావం అతనిది. అతనికి స్వామియే సర్వస్వం. భక్తుల రాకపోకలు తప్పడం లేదు. పాలు, పళ్లు, ఆహార పదార్థాలు తెచ్చి సమర్పించడం ఎక్కువైంది. పళనిస్వామి కాక మరికొందరు భక్తులు తయారైనారు. వారంతా స్వామికి శిష్యులైనారు. స్వామితో కలిసి జీవించడం మహద్భాగ్యం!

**"అందరూ కలిసి తినడం – కలిసి జీవించడం – కలిసి జ్ఞానం పొందడం" రమణ సిద్ధాంతం.** ఎక్కువ తక్కువలు లేవు. అందరూ సమానంగా పంచుకు తినాలి. ఆహార పదార్థాలు సరిపడ రానిపక్షంలో పళనిస్వామి, ఇతర శిష్యులు ఊళ్ళోకి వెళ్లి భిక్ష తెచ్చేవారు.

స్వామి ఆ గుహల్లో ఎలా ఉండగలుగుతున్నారు? ఏమిటి వ్యాపకం? గురుమూర్తంలో, మామిడి గుహలో, పవలకున్రులో ఎట్లా గడిచిందో, ఇక్కడా అలాగే గడుస్తోంది. జీవన విధానంలో మార్పులేదు. ఎప్పుడు ధ్యానమే ...

***యస్త్వాత్మ రతిరేవ స్యాత్ ఆత్మ తృప్తశ్చ మానవః***
***ఆత్మన్యేవచ సంతుష్టః తస్యకార్యం న విద్యతే ।***

*[ఆత్మను అనుభవిస్తూ ఆనందించేవానికి అదే బ్రహ్మానందస్థితి.*
*అంతకు మించి ఆశించదగింది ఏముంటుంది].*

స్వామికి ఒక కొత్త వ్యాపకం ఏర్పడ్డది. దర్శనార్థం వచ్చేవారు ఏవో ప్రశ్నలు అడగడం, తాను సమాధానాలు చెప్పడం. లైబ్రరీ నుండి పళని పుస్తకాలు తెస్తాడు. ఆ చదివిన వాటిని నిగ్గుతేల్చి తన అనుభవ జ్ఞానంతో సరిచూచి, తూచి స్వామి జవాబులు చెబుతుంటారు. అలా కొత్త, కొత్త సత్యాలు ఆవిష్కరించ సాగారు.

విరూపాక్ష గుహలో నెలవైయున్న రమణుని దర్శించేవారి సంఖ్య నానాటికి పెరుగుతోంది. అన్ని కాలాలలో, అన్ని వేళల్లో భక్తులు రాసాగారు. చిన్నాచితక బైరాగులు కడుపు నింపుకోడానికి వచ్చేవారు. అనుగ్రహం కోసం వచ్చేవారు కొందరు, కేవలం స్వామి దర్శనం కోసం వచ్చే జిజ్ఞాసాపరులు కొందరు, విషయ వివరణకు వచ్చేవారు మరికొందరు. అందరినీ తృప్తి పరచడం స్వామి కార్యం. స్వామి విజ్ఞతను, జ్ఞానాన్ని పరీక్షకుపెట్టే పండితులు సైతం రాసాగారు. వేదాంతులు, దాంతులు, స్వాంతులు స్వల్ప సంఖ్యలో వచ్చేవారు. 'ఆత్మవిచారణ' మిషతో వచ్చే వారి సంఖ్య క్రమంగా పెరిగింది. అంకిత భావంతో, సంపూర్ణ సమర్పణా భావంతో శరణాగతులైన వారికి ఎప్పుడూ రమణాశ్రయం లభిస్తుంది. రమణునిప్రేమ లభిస్తుంది. అలాగ వచ్చి చేరిన వారిలో ఉద్దండి నాయనార్, అన్నామలై తంబిరన్ ప్రథములు.

విరూపాక్ష గుహ సమీపంలోని మరొక గుహలో జటాస్వామి ఉంటారు. ఆయన జుత్తు జడలు కట్టి ఉంటుంది. కనుక అందరూ జటాస్వామి అంటారు. ఆయన అసలు పేరు పద్మనాభస్వామి. ఆయన వద్ద చాలా సంస్కృత గ్రంథాలున్నాయి. మంత్రశాస్త్ర, ఆయుర్వేద గ్రంథాలు ఉన్నాయి. బృహత్స్తోత్ర రత్నాకరం ఉండేది. బ్రాహ్మణ స్వామి ఆయన వద్దకు వెళ్లి ఆయా గ్రంథాలు చదివేవారు. చాలా వేగంగా చదివేవారు. పద్మనాభస్వామికి అనుమానం – ఈయన అట్లా తిప్పుతున్నాడా! చదువుతున్నాడా? అని. ఒక విషయం పైన వివరణ కోరాడు ఒకసారి. వెంటనే స్వామి బృహస్తోత్ర రత్నాకరం తీసి అందులో ఒక పేజీ చూపి చదవమన్నాడు. స్వామి ప్రతిభకు జటాస్వామి నిరుత్తరుడైనాడు. తర్వాత అనేక సందర్భాలలో పద్మనాభస్వామి బ్రాహ్మణస్వామి సహాయం తీసుకునేవాడు.

జి. శేషయ్యర్ అనే ఆయన తిరువణ్ణామలై మునిసిపల్ ఆఫీసులో ఓవర్సీరు. 1900 నుండి ఆయన స్వామి దర్శనానికి విడవకుండా వస్తుండేవాడు. ఆయన గొప్ప రామ భక్తుడు. ఆయన అనుక్షణం రామనామ జపం చేస్తుంటాడు. యోగం పైన చాలా పుస్తకాలు చదివాడు. ఇంగ్లీషులో రామగీత చదివాడు. ఎన్ని పుస్తకాలు చదివినా వాటి సారం ఆయన బుర్రకు పట్టేది కాదు. వాటిని తీసుకుపోయి రమణకు చూపించేవాడు. రమణులు ఆ పుస్తకాలు చదివి వాటి సారాంశం చిన్న కాగితాలపైన రాసి చూపిస్తుండేవారు. కొన్ని ఇతర ప్రశ్నలకు జవాబులు రాసి ఇచ్చేవారు. మూడు సంవత్సరాలలో స్వామి రాసి ఇచ్చిన చిట్టీలను భద్రపరచి, బైండు పుస్తకాలలోకి ఎక్కించి 'విచార సంగ్రహం' తయారు చేశాడు. అవి రమణ మహర్షి తొలి ప్రవచనాలు.

అలా వచ్చే జిజ్ఞాసుల్ని రమణులు నిశితంగా గమనించేవారు. ముందుగా వారు చెప్పే విషయాలు పూర్తిగా చెప్పనిచ్చేవారు. తను పెదవి విప్పేవారు కారు. తర్వాత తన విచారణ మార్గంలోకి వారిని ముక్కుపట్టి లాగేవారు.

***యస్య యస్య హి యో భావస్తేన తేన సమాచరేత్***
***అనుప్రవిష్య మేధావీ క్షిప్రమాత్మవశం న యేత్ ॥***

*[ముందుగా అవతలి వ్యక్తికి అవకాశం ఇవ్వాలి. తర్వాత ఒడ్డుకు చేర్చాలి].*

శేషయ్యర్ విషయంలో ఈ సూత్రం బాగా వర్తిస్తుంది. శేషయ్యర్‌కు అష్టాంగ యోగమంటే పిచ్చివ్యామోహం. ప్రాణాయామమంటే పడిచస్తాడు. రమణులు అనేక మార్లు చెప్పారు తనకు ప్రాణాయామం నచ్చదని, అనవసరమని గట్టిగా చెప్పాడు. **"ప్రాణాయామం వల్ల వొరిగేదేమీలేదు. కాస్త మనో నిగ్రహం కలుగుతుంది అంతే. మరికాస్త ఏకాగ్రత ఏర్పడుతుంది. చివరికి ఎప్పుడోగాని ఆత్మస్పర్శ కలగదు".**

రమణ మహర్షికి ఎలాంటి ఆధారాలు అవసరం లేకుండానే ధ్యానం, సమాధి ఏర్పడతాయి. ఆ విషయం అందరికీ తెలుసు. శేషయ్యర్‌కు ప్రాణాయామం ఇష్టం. స్వామి వివేకానంద ప్రసంగాలు తెచ్చి అండర్‌లైన్ చేసి చూపించేవాడు. ప్రక్కన నోట్సు రాసి పెట్టుకునేవాడు. స్వామి ఎవరిని, ఏ పద్ధతిని విమర్శించరు. శిష్యులు తెచ్చే పుస్తకాలు చదువుతారు "అది వారి పద్ధతి ... వారిష్టం వారిది" అనేవారు. ఎలాంటి చర్చలకు, వాదాలకు అవకాశం ఇచ్చేవారు కాదు. "చర్చ మేధావుల జన్మహక్కు" అనేవారు పైగా.

***"వివేకం వదలి విజ్ఞతను ఆశ్రయిస్తే ధ్యానం కుదురుతుంది, లక్ష్యం సిద్ధిస్తుంది, ఆత్మజ్ఞానం కలుగుతుంది. అది ఒక్కటే మార్గం".***

మహర్షి బోధనలు, సాధనలు, రచనలు అన్నీ అద్వైతానికి దారి తీస్తాయి.



# 15. ఆత్మ విచారణ

**కోహం కథమిదం చేతి సంసార మలమాతతం**
**ప్రవిచార్యం ప్రయత్నేన ప్రాజ్ఞేన సహసాధునా ।**

**– మహోపనిషత్**

*["నేనెవరు? ఈ విశాలవిశ్వం ఎట్లా ఏర్పడ్డది? జనన మరణాలు ఏమిటి? విజ్ఞులు, జ్ఞానులు వీటి గురించి విచారణ జరపాలి]*

**కోహం, కథమిదం కిం వా కథ మరణ జన్మనీ**
**విచార యాంతరే వేత్థం మహత్తత్ఫల మేష్యసి ।**

**– అన్నపూర్ణోపనిషత్**

*[నేను ఎవరు? ఈ ప్రపంచం ఏమిటి? అది ఎలా ఏర్పడుతోంది? జనన రహస్యం ఏది? నీలోపల అన్వేషించి తెలుసుకోవాలి. ఆ విచారణ వల్లనే సత్యం అవగతమవుతుంది]*

**రామస్వాత్మ విచారోయం కోహం స్యా మితి రూపకః**
**చిత్త దుర్ద్రుమ బీజస్య దహవే దహన స్మృతః**

*[రామా! నేనెవరు అన్న విచారణే ఆత్మ విచారణ! అదే అంతర్జ్యోతి]*

**– యోగవాశిష్టం**

## శివప్రకాశం పిళ్లై



రమణునికి సన్నిహితులైన వారిలో శివప్రకాశం పిళ్లై ఒకరు. ఈయన ఫిలాసఫీ పట్టభద్రుడు. దక్షిణ ఆర్కాట్ జిల్లా కలెక్టరు కార్యాలయంలో ఉద్యోగి. కాలేజీ తత్వశాస్త్ర విద్యార్థిగా ఉన్నప్పుడు "నేనెవరు?" అన్న ప్రశ్న తటస్థించింది. అప్పట్లో దాని గురించి ఆలోచించ లేదు. పాఠ్యాంశం కదా! 1902లో ఆఫీసుపని మీద తిరువణ్ణామలై వెళ్లడం జరిగింది. అప్పుడే రమణ గురించి విన్నాడు. ఆయన స్వార్థం లేనివాడని, సంపూర్ణజ్ఞాని అని అనిపించింది. స్వామి దర్శనానికి వెళ్లాడు. చూచాడు. కళ్లు విప్పేవరకు రమణుని ఎదురుగా కూర్చుని గమనించాడు. తర్వాత తనకు జ్ఞానమార్గం చూపించమని, జ్ఞానబోధ చేయమని ప్రార్థించాడు.

నేనెవరు? అనే ఒక్క అంశంపైన స్వామిని రకరకాల ప్రశ్నించాడు. అది రమణునికి ఇష్టమైన అంశమే అయినా మౌనం వీడలేదు. ప్రసన్నంగా ఆయన వేపు చూచారు. అదే అనుగ్రహ ప్రాప్తి. ఏవో సంజ్ఞలతో ప్రకటించాడు. శివ ప్రకాశానికి అర్థం కాలేదు. తాత్విక విషయాలు మామూలుగా చెబితేనే అర్థం చేసుకోవడం కష్టం. హావభావాలు గ్రహించడం మరీ కష్టం. కాగితంపైన రాస్తే కొంత అర్థం చేసుకోవచ్చు. ఆయన అడిగిన ప్రశ్నలలో 14వ ప్రశ్నకు స్వామి పలకపైన సమాధానం రాసి చూపారు. అది మాత్రం శివప్రకాశం కాగితం మీద రాసుకుని భద్రపరచుకున్నాడు. మిగిలిన జవాబులు జ్ఞాపకం ఉన్నంత వరకు తన భాషాశైలిలో రాసుకున్నాడు.

స్వామి దర్శనాలు మొదట అంతగా ఉద్యోగానికి ఆటంకం అనిపించలేదు. తర్వాత ఆయనలో వైరాగ్యభావన పెరిగింది. 1910 నాటికి ఉద్యోగానికి రాజీనామా చేసే స్థితికి వచ్చాడు. అప్పుడప్పుడు వచ్చి స్వామిని దర్శించేవాడు. జీవితం మామూలుగా సాగుతోంది కాని చెప్పుకోదగిన ఆధ్యాత్మిక అనుభవాలు కలగడంలేదు. 1913లో భార్యా వియోగం కలిగింది. తిరిగి పెళ్లి చేసుకోవడమా, వానప్రస్థ జీవితం గడపడమా అన్న ప్రశ్న తలెత్తింది. ఆ వయసులో పెళ్లి చేసుకోదలిస్తే ఎలాంటి పిల్ల దొరుకుతుంది? వయసు తేడా? పెళ్లంటే కష్టాల కొలిమి. మరల మామూలు జీవితం! సంసార తాపత్రయం, పిల్లలు, ఉద్యోగం, సంపాదన ... ఉద్యోగం లేదు. కొత్త పెళ్లాన్ని పోషించడం ఒక సమస్య. ఆ సమస్యకు ఒక పరిష్కారం అన్వేషించాడు.

శివ ప్రకాశానికి విఘ్నేశ్వర భక్తి ఎక్కువ. ఆ రాత్రి వినాయక ఆలయానికి వెళ్లి ప్రార్థించాడు. ఏడ్చాడు. కాగితంపైన తన సమస్యలు రాసి వాటికి సమాధానాలు కావాలని పట్టుబట్టాడు. ఏదైనా సరైన సమాధానం గణపతి ఇస్తే అలా నడుచుకోవాలని. లేదంటే కొండమీదకు వెళ్లి బ్రాహ్మణస్వామికి అంకితం కావాలని మనో నిర్ణయం. ఆ స్వామి చెప్పినట్లు నడుచుకుంటాను.

ఆయన రాసిన ప్రశ్నలు :

1. ప్రపంచంలో బాధల నుండి విముక్తికి ఏది మార్గం?
2. నేను ఆశించిన అమ్మాయిని పెళ్లి చేసుకోగలనా?
3. కాకపోతే, ఎందువలన?
4. పెళ్ళి చేసుకుంటే సంసార పోషణ ఎలా సాధ్యం? డబ్బు ఎలా వస్తుంది?

శ్రద్ధగా ఆ ప్రశ్నాపత్రం వినాయకుని పాదాల చెంత, మూషిక వాహనం దగ్గర ఉంచాడు. తెల్లవార్లు గుడిలోనే నిరీక్షిస్తూ గడిపాడు. రాత్రి గడిచింది. తెల్లవారింది. నిద్రలో ఒక్క కలా రాలేదు. వినాయకుడు కలలోనైనా ప్రత్యక్షం కాలేదు. నిరాశ చెందాడు. వినాయకుని మీద తెగకోపం వచ్చింది. తన ప్రశ్నలలో ఒక్క దానికీ వినాయకస్వామి సమాధానం రాయలేదు. అక్కడ నుండి దిగులుగా, గుండె బరువుతో గురు సన్నిధికి బయలుదేరాడు. మొర ఆలకించని వినాయకుని కంటే మౌనంగా ఉన్న మౌనస్వామి మేలుగదా! శివ ప్రకాశం చాలా సేపు విరూపాక్ష గుహ బయట నిరీక్షించవలసి వచ్చింది. మనసులోని బాధలు చెప్పుకోలేదు. పెళ్లిని గురించి ఓ బ్రహ్మచారిని, అందునా సన్యాసిని ప్రశ్నించడం ఏం సబబు? ఎవరెవరో వస్తున్నారు, స్వామి దర్శనం చేసుకుని వెళ్లిపోతున్నారు.

ప్రతిరోజు శివప్రకాశం పిళ్లై విరూపాక్ష గుహకు వస్తాడు. రమణస్వామి సమక్షంలో కూర్చుంటాడు. స్వామి ఇతర భక్తులకు చెప్పింది వింటాడు, లేచిపోతాడు. ఏనాడు తన సమస్యల మూట విప్పడు. తన మనసులోని ఆలోచనలు బయట పెట్టడు. స్వామి జీవనవిధానమే అందరి సమస్యలకు సమాధానం అనిపిస్తుంది. అదే బాధితులకు ఆదర్శం, ఉపశమనం. స్వామి అస్ఖలిత బ్రహ్మచారి, బొత్తిగా స్త్రీ వాంఛ లేనివాడు. స్త్రీ సుఖం ఎరగని వాడు. జీవితంలో కనీసావసరాలు లేనివాడు, కోరికలు లేనివాడు. ఏమీ ఆశించనివాడు, ఆశలు లేనివాడు. ఎంతటి నిస్సంగత్వం! డబ్బు అవసరంలేని ఏకైక జీవి. అయినా ఏ విచారాలూ, బాధలూ లేవు. సుఖంగా, ఆనందంగా జీవిస్తాడు. తనకు పెళ్లి ఆలోచన కలిగినందుకు శివప్రకాశం సిగ్గుపడ్డాడు. అడగకుండానే, తన ప్రశ్నలకు సమాధానం దొరికింది.

1913 మే 4న స్వగ్రామం వెళ్లడానికి నిశ్చయించుకుని రమణస్వామితో

చెప్పి పోదామని వచ్చాడు. స్వామి సమక్షంలో చాలామంది భక్తులున్నారు. తను వెళ్లి ఒక ప్రక్కన కూర్చున్నాడు. స్వామి వైపు కళ్లార్పకుండా చూడసాగాడు. ఆయనకు స్వామిలో ఒక విచిత్ర దృశ్యం కనిపించింది. స్వామి ముఖం మామూలుగా లేదు. ఆయన తలచుట్టూ ఏదో దివ్యతేజస్సు వలయం చుట్టింది. ఆయన తలలో ఒక స్వర్ణశిశువు రూపుదిద్దుకుని క్షణంసేపు కనిపించి అంతలో లోపలకు వెళ్లిపోయింది. అదే దృశ్యం పిళ్లైకు మూడుసార్లు కనిపించింది. ఆ తర్వాత స్వామి దివ్యత్వంపైన పూర్తి విశ్వాసం ఏర్పడ్డది. హృదయం ఉప్పెన తగ్గిన సముద్ర గర్భంలా మారింది. కళ్లు అప్రయత్నంగా వర్షించసాగాయి. వెక్కివెక్కి ఏడ్చాడు. నోట మాటలేదు. అతనికి ఏం జరిగిందో ఎవరికీ అర్థంకాక కంగారుపడ్డారు. తర్వాత తాను చూచిన దృశ్యం గురించి చెప్పగా అంతా నవ్వుకున్నారు! తను జోక్ చేస్తున్నానని అనుకున్నారు. తను జోక్ చేసే స్థితిలోనా ఉన్నాడు!

మరునాడు ఎప్పటిలా వచ్చి స్వామి ఎదురుగా కూర్చున్నాడు. మళ్లీ నిన్నటి మాదిరి దృశ్యమే కనిపించింది. స్వామి తల చుట్టూ అనేక చంద్రబింబాలు వలయంగా తిరగసాగాయి. స్వామి దేహం ఉదయ సూర్యబింబంలా ప్రకాశిస్తోంది. శరీరం అంతా విభూతి అలముకున్నట్లుంది. నిజానికి రమణులు అలా ఒంటినిండా ఎప్పుడూ విభూతి పట్టించరు. స్వామి కళ్లలో కరుణ జాలువారుతోంది. తనతో గుహలో చాలా మంది ఉన్నారు. ఎవరికీ చెప్పలేదు. చెబితే నిన్నలా ఆటపట్టిస్తారు. రెండు రోజుల తర్వాత పిళ్లై స్వామి దర్శనానికి వెళ్లాడు. స్వామి ఘనీభవించిన ప్రేమస్వరూపంగా, కరుణామూర్తిగా కనిపించారు. అతని మనసు పరమానంద భరితమైంది. ఆ ఆనందం వదులుకో బుద్ధి కాలేదు. పిళ్లై తనకు స్వామి అనుగ్రహం పూర్తిగా లభించిందనుకున్నాడు. ఇక తను తపస్సుకు అంకితం కావాలని నిర్ణయించుకున్నాడు. పెళ్లి పెటాకులు వద్దు. బ్రహ్మచర్యమే ముద్దు.

**శివప్రకాశం పిళ్లై ఈ విషయాలు “అనుగ్రహ అవహళ్”లో ఉటంకించాడు. స్వామి సన్నిధిలో కొన్ని రోజులు గడిపితే చాలు ఎంతటి రాతి మనసులైనా మెత్తబడి కరిగిపోతాయి. స్వామి ఆకర్షణ, అనురాగం, కరుణ అలాంటివి. మనిషి ఆలోచన, జీవన విధానం, ప్రవర్తనల్లో మార్పువచ్చి తీరుతుంది. ఒక సద్గ్రంథం చదివినంత తృప్తి కలుగుతుంది. అద్భుతమైన ఆనందం మిగులుతుంది.**

1902లో శివప్రకాశం పిళ్లై అడిగిన 14 ప్రశ్నలు : రమణుని జవాబులు–

శివప్రకాశం :స్వామి! నేను అంటే ఏమిటి? ఎవరు? మోక్షం సాధించడం ఎలా?

రమణ : నీ ‘లోపలి’కి పోతూ అన్వేషించు! ‘నేనెవరు?’ అన్నది ప్రశ్న కాదు

విచారణ. అన్వేషణలో నీ 'ఆత్మ'దర్శన మవుతుంది. అదే మోక్షం.

శివప్రకాశం : నేనెవరు?

రమణులు : 'నేను' అంటే ఆత్మ. 'నా ఆత్మ' అంటే శరీరం కాదు. అయిదు ఇంద్రియాలలో 'ఆత్మ' ఉండదు. ఆత్మ వేరు. ఇంద్రియాలకు అతీతమైనది ఆత్మ. ఇంద్రియ క్రియలేవీ ఆత్మసంబంధం కాదు. ప్రాణమూ ఆత్మ కాదు, మనసూ ఆత్మ కాదు. గాఢనిద్ర, తన్మయత్వం, అసలేమీ తెలియని స్థితి, వేటినీ గుర్తించని స్థితి. ఏవీ ఆత్మ కావు.

శివప్రకాశం : వీటిలో ఏదీ నేను కానప్పుడు, నేనెవరు?

రమణులు : **ఇది నేను కాదు, ఇది నేను కాదు అనుకుంటూ, కానివాటన్నింటిని ప్రక్కలకు త్రోసివేస్తూ లోపలకు పోతూవుంటే చివరికి మిగిలేది నేను. అది చైతన్యంగా అనుభూతికి తెలుస్తుంది.**

శివప్రకాశం : అయితే చైతన్యం యొక్క స్వభావం ఏది? దానిని గుర్తించడం ఎలా?

రమణులు : గమనించడంలోనే గుర్తింపు రహస్యం వుంటుంది? గమనిక ఒక్కటే మార్గం. దాని ఉపాయనాలు సత్, చిత్, ఆనందాలు. **నా అనే భావన లేశ మాత్రం మిగలని స్థితి సచ్చిదానంద స్థితి. ఆ స్థితినే మౌనం అనవచ్చు. అది ఆత్మ స్థితి.** తత్ యొక్క చివరి పరిణామం అది. తత్ సత్. ప్రపంచం, అహంకారం, ఈశ్వరుడు – వేరు వేరు భ్రమలు. ముత్యం ఎండలో మెరుస్తుంది, వెండి భ్రమ కలిగిస్తుంది. కాని ముత్యంలో వెండి ఉండదు. కనుక భగవంతుడు, జీవుడు, సృష్టి – మూడింటినీ శివ స్వరూపంగా భావించాలి. ఆత్మ స్వభావాలుగా అంగీకరించాలి. ఆత్మ స్వరూపమే 'సత్యం'.

శివప్రకాశం : శివస్వరూపమైన సత్యాన్ని తెలుసుకోవడం ఎలా?

రమణులు : బాహ్య ప్రపంచం, అంటే దృశ్యప్రపంచం కంటికి గోచరం కాకుండా అదృశ్యమైనప్పుడు అది అగోచరం. చూడబడే దాని సత్యస్వరూపం తెలుస్తుంది. అదే సత్య స్ఫూర్తి.

శివ ప్రకాశం : వస్తు ప్రపంచాన్ని దర్శిస్తూ అందులోనే శివ స్వరూపాన్ని సంభావించ లేమా?

రమణులు : వీల్లేదు. చూచేవాడు, చూడబడేది ఎలాంటివంటే తాడు పాము లాంటివి. సర్పం అన్న భ్రాంతి పోతేతప్ప తాడును తాడుగా గుర్తించవు.

వాస్తవంగా ఉన్నది తాడు. సర్పం అన్నది భ్రమ. అదే రజ్జు సర్ప భ్రాంతి.

శివప్రకాశం : బాహ్య జగత్తు ఎప్పుడు అంతరిస్తుంది?

రమణులు : ఆలోచనలకు మూలమైంది మనస్సు. పనులన్నీ ఆలోచనల ప్రోద్బలంతో చేసేవే. ఆలోచనలు నశిస్తే బాహ్యస్పృహ నశిస్తుంది.

శివప్రకాశం : మనస్సు యొక్క స్వభావం ఎటువంటిది?

రమణులు : **మనస్సు అంటే ఆలోచనల సమూహం. మనస్సు ఒక విధమైన శక్తి. ఆ శక్తి లోకాన్ని సృష్టిస్తుంది. మనస్సు ఆత్మలో లయించాలి.** అట్లా లయించడమే శివస్వరూపం. అప్పుడు ఆత్మ బయటకొస్తుంది. మనఃక్రియవల్ల లోకం ఏర్పడుతుంది. ప్రపంచం గురించిన స్పృహ మనస్సుకు కలుగుతుంది. ఆ స్పృహ నీకు ఉన్నంతకాలం 'ఆత్మ' తెలియదు.

శివప్రకాశం : మనస్సు ఎప్పుడు అంతరిస్తుంది?

రమణులు : నేనెవరు అన్న విచారణ పూర్తయినపుడు. అది మానసిక చర్య. అయినా దానివల్లనే మనో నిగ్రహం, మనో నిశ్చలత్వం ఏర్పడుతుంది. దాని వల్లనే మనఃక్రియలు ఉపశమిస్తాయి. కాలుతున్న ఒక కర్రతో మొత్తం కాష్టాన్ని తగలబెట్టవచ్చు. కాష్టం మొత్తం కాలి బూడిద అవుతుంది. వాటితో పాటు ఆ కర్ర కాలి బూడిద అవుతుంది. శవం పూర్తిగా కాలిన తర్వాత కాష్టం చల్లారుతుంది. అదే విధంగా ఆత్మ జ్ఞానం సంపాదించాలి. అప్పుడు నేను అనే వ్యక్తిగత స్వభావం లేకుండాపోతుంది. శ్వాస తగ్గిపోతుంది. మిగిలిన ప్రాణక్రియలు చల్లబడతాయి. **నీవు ఏది చేసినా అహంకారం లేకుండా చేయాలి. 'నేను చేస్తున్నాను' అనే భావం అసలు ఉండకూడదు.** ఆ స్థితికి నీవు చేరినప్పుడు నీ భార్య సైతం నీకంటికి జగన్మాతలా కనిపిస్తుంది. నిజమైన భక్తి అంటే అది. అహంకారాన్ని ఆత్మార్పణ చేయడమే భక్తి.

శివప్రకాశం : మనస్సును జయించగల ఉపాయాలు వేరే ఏవీ ఉండవా స్వామీ?

రమణులు : ఆత్మ విచారణ ఒక్కటే మార్గం. ఇతర ఉపాయాల వల్ల కొద్దిసేపు మనస్సు నిశ్చలం కావచ్చు. తిరిగి మనస్సు పై కొస్తుంది.

శివప్రకాశం : ఈ వాసనలు ఎప్పటికి నశిస్తాయంటారు?

రమణులు : అది నీలో ఆత్మ ప్రవేశాన్ని బట్టి ఉంటుంది. అవి నశిస్తూ ఆత్మను, నిన్ను మరింత పైకి లేపుతుంటాయి.

శివప్రకాశం : అనేక జన్మలుగా పేరుకుపోయిన సంస్కారాన్ని పూర్తిగా రద్దుపరచడం సాధ్యమంటారా?

రమణులు : అనుమానించకపోతే సాధ్యమే. స్థిర సంకల్పం ఉంటే ఏదీ అసాధ్యం కాదు, అసంభవం కాబోదు. ఆత్మ లోపలికి చొచ్చుకుపోవడం ముఖ్యం. **విచారణ వల్ల మనసు బలహీనపడుతుంది. అదే ఆత్మగా పరిణమిస్తుంది.** ఎప్పుడైనా అనుమానం కలిగితే అనుమాన నివృత్తికి ప్రయత్నించవద్దు. ఆ సంశయానికి కారణం ఏమిటని చూడు. ఎవరు అనుమానిస్తున్నదీ గమనించు.

శివప్రకాశం : అలా ఎంతకాలం ఆత్మ విచారణ సాగించాలి?

రమణులు : మనస్సు మొత్తం ఆలోచనారహితం అయ్యేవరకు. శత్రుశేషం ఉండకూడదు. ఒక్కొక్క శత్రువును చంపుతూ పోతే, చివరకు కోట నీ వశమవుతుంది. ఆలోచన కలిగిన ప్రతిసారి విచారణలో దానిని తుదముట్టించు. **ఆలోచనల మూలాన్ని వెదికి పట్టుకోవడమే వైరాగ్యసూత్రం. అదే ఆత్మదర్శనం.** అంతవరకు విచారణ సాగించ వలసిందే.

శివప్రకాశం : స్వామీ! అసలు ఈ జగత్తే ఈశ్వర సంకల్పం గదా! దానిని కాదనడం ఎలా ఈశ్వరీయత అవుతుంది?

రమణులు : భగవంతుడు ఏ ప్రయోజనం కోసం జగత్తును కల్పించాడో నీకు తెలుసునా? నీ చర్యలు భగవంతుని అంటవు. రోజూ సూర్యుడు ఉదయిస్తాడు. అందులో సూర్యునికి స్వార్థం ఉందా? సంకల్పం ఉందా? సూర్య కిరణాలు 'భూతద్దం' మీద పడితే అగ్ని రగులుతుంది. వేడికి నీరు ఆవిరి అవుతుంది. మొగ్గలు వికసించి పూలవుతాయి. ఈ పనులన్నీ సూర్యుడు సంకల్పించినట్లా? అన్నీ జరిగిపోతుంటాయి. ఆయన సాక్షీమాత్రుడు. కర్మసాక్షి. చూస్తుంటాడు గమనిస్తుంటాడు. జోక్యం కలిగించుకోడు. అలాగే ఆకాశం, గగనం, భూమి, నీరు, అగ్ని – అన్నీ శూన్యంలోనివే. వాటి పనులు అవి చేస్తుంటాయి. పనులు జరిగి పోతుంటాయి. వాటి క్రియవల్ల ఆకాశానికి, గగనానికి, నీటికి, అగ్నికి కలిగే నష్టం లేదు. ఒనగూడే ప్రయోజనం ఉండదు. సంబంధమూ ఉండదు. అవి ఎన్నటికీ కలుషితం కావు. తరిగిపోవు. అలాగే మనం చేసే పనులు భగవంతుని కదిలించవు. వీటిని ఆయన తానుగా కల్పించడం లేదు. సృష్టి, స్థితి, లయల పట్ల భగవంతునికి ఆసక్తి లేదు. వాటికి బాధ్యులు జీవులు. ఎవరు చేసిన కర్మలు వారు అనుభవిస్తుంటారు. ఎవరి బాధ్యతా భగవంతుడు తీసుకోడు. మనవల్ల, మన పనులవల్ల భగవత్కార్యం చెడదు.



# 16. మహర్షికి ఆప్తుడు గణపతిముని

**ర**మణ మహర్షికి అత్యంత ఆప్తుడు గణపతిముని. చిన్నతనంలో వెంకట్రామన్‌గా తిరువణ్ణామలై వచ్చి, మొదట బ్రాహ్మణ స్వామిగా, అరుణగిరి నివాస కాలంలో మౌనిగా ప్రసిద్ధి చెందిన వ్యక్తిని మహామనీషిగా, తపోనిధిగా, కారణజన్ముడుగా గుర్తించి భగవాన్ శ్రీ రమణ మహర్షిగా నామకరణం చేసి, లోకానికి ఎరుకపరచిన మరో మహాతపస్వి గణపతిముని. రమణుని శిష్య వర్గంలో వరిష్టుడు, వశిష్టుడు గణపతిముని. అసమాన ప్రతిభావంతుడు. మంత్రశాస్త్ర నిష్ణాతుడు.

శ్రీ గణపతిశాస్త్రి జననం నవంబరు 17 – 1878 కలువరాయిలో. ఆయన జననమే ఒక విచిత్రం. వరప్రసాది అనడానికి అదొక నిదర్శనం. గణపతిశాస్త్రి గారి తండ్రి నరసింహశాస్త్రిగారు కాశీలో ఒక గణపతి ఆలయంలో ధ్యానం చేస్తుండగా ఒక దృశ్యం కనిపించింది. గణేశుని విగ్రహం నుండి దివ్య తేజస్సు వెలువడి ఆయన వైపుగా వచ్చింది. అది శుభ సంకేతంగా, పిల్లవానికి గణపతిశాస్త్రి అని నామకరణం చేశాడు. తల్లిదండ్రులకు ముగ్గురు సంతానం. గణపతి రెండవ సంతానం. కౌండిన్య గోత్రం. తర్వాత తన పేరును వశిష్ట గణపతిమునిగా మార్చుకున్నాడు.

గణపతిశాస్త్రి చిన్నప్పుడు మహా అర్భకుడు. తిండి తినేవాడు కాదు. మాటలు రావు. ఎప్పుడు ఏదో ఒక అనారోగ్యం. లివర్ ఎన్‌లార్జ్‌మెంట్, ప్లీహం, మూర్ఛలు. ఆరవ సంవత్సరంలో అలా మూర్ఛవచ్చినపుడు ఇనుపకడ్డీ కాల్చి వాతపెట్టారు. అప్పుడు మాటలు వచ్చాయి. ఆయన రోగాలన్నీ తగ్గిపోయాయి. మహామేధావి

అయినాడు. ఆ వయసులోనే కవిత్వం చెప్పేవాడు. అష్టావధానాలు చేసేవాడు. పది సంవత్సరాల వయస్సులో సంస్కృతంలో శ్లోకాలు రాయసాగాడు. మంత్ర రహస్యాలు, జ్యోతిషం, ఆయుర్వేదం ఆయన అభిమాన విషయాలు. ఆయనను ఎవరిదో మహర్షి ఆత్మ ఆవహించిందని చెప్పుకునేవారు.

12వ ఏట గణపతిశాస్త్రి వివాహం అయింది. భార్య విశాలాక్షికి ఎనిమిదేళ్ల వయసు. అప్పుడే 'భృంగసందేశం' అనే కావ్యం మందాక్రాంత ఛందస్సులో రచించాడు. ఆ కావ్యం ఆయనను కాళిదాస మహాకవి సరసన నిలిపింది. 14ఏళ్ల వయసులో పంచకావ్యాలు, ఛందస్సు, వ్యాకరణాలు, భారత రామాయణాలు, పురాణాలు అధ్యయనం చేశాడు. ఆయనకు తపస్సు చేయాలన్న కోరిక. ఇద్దరు స్నేహితులతో రాజమండ్రి సమీపాన గల కౌశికి నదీతీరంలో 45 రోజులు కఠోర తపస్సు చేశాడు. 20వ జన్మదినోత్సవం నాడు తండ్రిగారి అనుమతితో కాశీకి బయలుదేరాడు అక్కడ తపస్సు కొనసాగించాలని. ఆయన జీవిత ధ్యేయం తపస్సు. రమణుని శిష్యుడు అయిన తర్వాత కూడా అనేక తావులకు వెళ్లి తపస్సు సాగించేవాడు.

కాశీలో ఉండగా, ఆయన ఆశుకవితా ప్రతిభ పండితుల్ని ఆకర్షించింది. బెంగాల్‌లో జరిగే పండిత పరిషత్తుకు గణపతిని ఎన్నిక చేశారు. నవద్వీపంలో ఆయన ప్రతిభకు పట్టం కట్టి 'కావ్యకంఠ' బిరుదు ప్రదానం చేసి సత్కరించారు. ఆయనకు బిరుదుల కన్న, కీర్తి కన్న తపస్సు ముఖ్యం. గోదావరి, గంగ, యమునా నదుల వద్ద తపస్సు సాగించాడు. ఆయనకు శివ పంచాక్షరీ మంత్రం ఇష్టం. అయినా అనేక మంత్రాలు ఉపదేశం పొంది, సాధన చేసి, సిద్ధి పొందాడు. మొత్తం 12 క్షేత్రాలలో జపయజ్ఞం చేశాడు. తన తపస్సుకు మెచ్చి మహాదేవుడు ప్రత్యక్షమై వరాలిస్తాడని ఆశించాడు. ఆ పని జరగలేదు. నిరాశ చెందాడు. తన తపస్సులో ఏదో లోపం వుందని అనుమానం. ఆత్మ దర్శనానికి అది మార్గం కాదేమో అని అనుమానం.

గణపతిశాస్త్రి దృష్టి దక్షిణదేశం వైపు తిరిగింది. 1903లో ప్రసిద్ధ శివక్షేత్రమైన తిరువణ్ణామలై చేరుకున్నాడు. అక్కడ 'హరసహస్రశ్లోకావళి' రాశాడు. అప్పుడే అరుణగిరిపై ఉన్న బ్రాహ్మణస్వామిని గురించి వినడం, వెళ్లి రెండుమూడు సార్లు దర్శించడం జరిగింది. అప్పటికి అంతకు మించి విశేషం లేదు.

రమణుని శిష్యులలో గణపతిముని, మురుగనార్ అతి ముఖ్యులు. గణపతి మునిని చూస్తే ప్రాచీన మహర్షుల కోవలోని వాడనిపిస్తుంది. తపస్సుతో పండిపోయినవాడు. ఓం "నమశ్శివాయ" పంచాక్షరిని 'అజపం' గా చేసుకున్నవాడు.


మురుగనార్

గణపతిమునిలో ఒక విలక్షణమైన ఆకర్షణ వుంది. ఆయన గాంభీర్యం, స్ఫురద్రూపం ఇట్టే ఎవరినైన వశపరచుకుంటాయి. ఆయన మాట్లాడుతుంటే, ఆ మాధుర్యానికి దేవతలు సైతం దిగి వస్తారనిపిస్తుంది. ఎవరికైనా ఆయన మంత్రోపదేశం చేస్తే, ఆ వ్యక్తి ఆ తర్వాత మంత్రజపం చేయవలసిన పని ఉండదు. మునిగారి శబ్దం అతని హృదయంలో జీవితాంతం ప్రతిధ్వనిస్తుంది. గణపతి ముని స్వయంగా హంప్రీస్ అనే విదేశీ భక్తుని రమణ మహర్షికి పరిచయం చేశాడు. అది ఇలా జరిగింది : హంప్రీస్ వెల్లూరు స్టేషన్ వెయిటింగ్ రూంలో ఉండగా మునిని చూచాడు మొదటిసారి.

"రైలు రాగానే నేను మునిని గుర్తించాను. అయిదడుగుల పది అంగుళాల ఎత్తు ... గంభీర విగ్రహం, విశాల ఫాలభాగం, కోటేరు వంటి ముక్కు, మళ్లీ మళ్లీ చూడాలనిపించే ఆకారం. ఆయన రైలు దిగి వచ్చారు. వెయిటింగ్ రూంలో కలిశాం. ఆయన ఒక్కమాట మాట్లాడలేదు. ఆయనకు ఇంగ్లీషు రాదు. కాని ఆయన సమక్షంలో కూర్చోవడం, ఒకరినొకరు చూడడం గొప్ప అనుభూతి. ఎన్నో విషయాలు చర్చించుకున్నట్లనిపించింది. అది చిత్రమైన అనుభవం. ఆయన ముఖంలో ఆనందం, వెలుగు. ఆయన నవ్వారు "నేను, 'నేను' కాదు. ఇవన్నీ మహర్షి ప్రతిభా విశేషాలు" అన్నట్లు. తాను మహర్షి చేతి పరికరం అన్నంత సాదాతనం ఆయనలో."

రమణమహర్షి భక్తులు, అభిమానులు, మొత్తం 'రమణ కుటుంబం' గణపతికి ఋణపడిపోయింది. పదకొండు సంవత్సరాల రమణ మౌనదీక్షను విరమింప చేయగలిగింది గణపతిశాస్త్రి. ఆ రోజు 18 నవంబరు 1907. ఆనాడే రమణుని తొలి ఉపదేశవాణి వినిపించింది. మహర్షి ఆయనను 'నాయన' అని సంబోధిస్తారు. అంతటి వాత్సల్యం, అనురాగం, ప్రేమ. 'నాయన' అనడంలో పితృస్థానం ఇచ్చినట్లు, తాను పుత్రప్రేమను అందించినట్లు.

1907లో వెల్లూరులో చేస్తున్న ఉద్యోగం వదలి గణపతిముని తిరువణ్ణామలైకి చేరారు. మంత్రజపాన్ని మించిన తపస్సు ఉండదని ఆయన నిశ్చితాభిప్రాయం. పురాణాలు, ఇతిహాసాలు, ఉపనిషత్తులు, వేదాలు, మంత్రశాస్త్రం ఎంత చదివినా తపస్సుకు అర్థం తెలియలేదు. కార్తీక ఉత్సవాలలో తొమ్మిదవనాడు మధ్యాహ్నం ఒకటిన్నరకు ఆయనకు బ్రాహ్మణస్వామి జ్ఞప్తికి వచ్చాడు. ఆయనకు తపస్సంటే ఏమిటో తెలిసి ఉంటుందని ఒక ఆశ కలిగింది. ఎర్రటి ఎండలో కొండపైకి బయలుదేరాడు. 1903లో వచ్చినపుడే బ్రాహ్మణస్వామి తనను ఒక పండితునిగా గుర్తించాడు. ఆనాడు తను వినాయక స్తుతిని స్వామి పరంగా అన్వయించి చెప్పాడు :

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే ।

శుక్లాంబరధరం : తెల్లని వస్త్ర పీలికను ధరించినవాడా!; విష్ణుం : సర్వవ్యాపకమైన దివ్యత్వం కలిగిన స్వామీ; శశివర్ణం : చంద్రునివలె తెల్లని శరీరచ్ఛాయగలవాడా; చతుర్భుజం : మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం అనే నాలుగు గుణాలను అంతఃకరణలో లయింపచేసుకున్నవాడా; ప్రసన్నవదనం : సదా అనుగ్రహ దృష్టిని ప్రసరించేవాడా; ధ్యాయేత్ : ధ్యానించేవారికి ఎదురయ్యే అన్ని అవరోధాలను తొలగించగల శక్తి గలవాడా, నమస్కారం!

గణపతిశాస్త్రి స్వామి తనను అనుగ్రహిస్తాడని ఆశించాడు. 1904లో కార్తికోత్సవ సమయంలో శివునిపై తాను వేయి శ్లోకాలు చెప్పిన విషయం స్వామికి జ్ఞాపకం ఉండే ఉంటుంది. అయినా కొండ ఎక్కి విరూపాక్ష గుహను సమీపిస్తుండగా శాస్త్రి గారి కాళ్లు వణికాయి. చెమటలు పోశాయి. ఏదో భయం ఆవహించింది. ఆ సమయంలో స్వామి గుహ బయట రాతిబండపైన విశ్రమించి ఉన్నారు. దరిచేరి, కంపిత స్వరంతో ఇలా విన్నవించుకున్నాడు –

"మహాత్మా! చదవ వలసిన శాస్త్రాలన్నీ చదివాను. వేదాంతం చదివాను. ఎన్నో సంవత్సరాలుగా జపసాధన చేస్తున్నాను. కానీ ఇంతదనుక 'జపం' అంటే ఏమిటో అవగతం కాలేదు. మీ పాదాలను ఆశ్రయించాను. తపస్సు యొక్క రహస్యం తెలియచేయండి మహాత్మా".

తన వేపు ఆత్రుతగా చూస్తున్న గణపతి ముని వేపు పదిహేను నిమిషాలు దృష్టి సారించి రమణులు నిశితంగా గమనించాడు. ఆ భావాలకు భాష్యం చెప్పగల వారుండరు. శ్రీరమణ తన సుదీర్ఘమౌనం వదలి ఒక్కొక్క పలుకు పలికారు :

**"నేను అనే భావం ఎక్కడ మొదలవుతుందో దానిని గమనించు. అందుపైనే మనస్సును లగ్నం చేసి, లీనం చేయి. అదే తపస్సు. మంత్రం జపించినపుడు ఆ మంత్ర శబ్దానికి మూలం ఎక్కడో అది గమనించు. అందులో మనస్సు లయిస్తుంది. అదే తపస్సు."**

ఆ మాటలకు గణపతి ముని మానసం ఆనంద తాండవం చేసింది. భారం తీరింది. మనస్సు తేలికైంది. కొంచెంసేపు అక్కడే కూర్చుని పళనిస్వామి ద్వారా స్వామి పేరును వెంకట్రామన్ అని తెలుసుకుని ఆశువుగా అయిదు శ్లోకాలు చెప్పాడు. అందులో వెంకట్రామన్ పేరు 'రమణ'గా మార్చిచెప్పాడు. ఆ మార్పును శ్రీరమణ ఆమోదించినట్లు దరహాసం చేశారు.

మరునాడే గణపతిముని తన ముఖ్య బంధువులకు, శిష్యులకు లేఖలు రాశాడు – తన కొక సద్గురువు లభించినట్లు, ఆయన తనకు 'జ్ఞానోపదేశం' చేసినట్లు. ఆయనను 'భగవాన్ రమణ మహర్షి'గా తనవారికి పరిచయం చేశాడు. ఇంతవరకు ఏ గ్రంథంలో లేని 'బోధ' మహర్షి అనుభవమని అన్నాడు. 'మహర్షి' అంటే ఆధ్యాత్మిక శిఖరాలు మెట్టిన తాపసి అని అర్థం. గణపతిముని 'శిర్సి' నుండి రమణ మహర్షికి రాసిన లేఖలు అమాయకంగా ఉండేవి. చిన్నపిల్లవాడిలా ప్రశ్నించేవాడు. అందులో ఆధ్యాత్మిక విషయాలు ఉండేవి. గణపతిమునిగారి ఆత్మవిచారణ పాకాన పడలేదని మహర్షి భావించారు. కారణం 'సంకల్పాలు'. **తనవైన సంకల్పాలు కలిగిన వారికి సహజ సమాధి కలగదు. 'జ్ఞాని'కి సహజంగానే, జ్ఞానం అలవడాలి. ఒకవేళ సంకల్పాలు ఉన్నా వాటిని 'ప్రకృతి' బంధించకూడదు. ప్రారబ్ధం వల్లనో, దైవికంగానో ఆ సంకల్పాలు పైకొస్తుంటాయి. 'మనసు' మరణించిన జ్ఞానిని ఆ సంకల్పాలు నిలవరించవు.**

గణపతిమునికి, రమణ మహర్షికి ఒక స్పష్టమైన భేదం ఉంది. మహర్షి విరూపాక్షగుహలో ఉండేవారు. ముని ఆ దాపుననే మరొక గుహలో ఉండేవారు. గణపతిముని గారి ఆధ్యాత్మికానుభవం 'శక్తి' మార్గంలో ఉండేది. వారికి కపాల భేదనం కూడా జరిగింది. అంతకు ముందు రోజుల్లో దీర్ఘ తపస్సు చేసేవాడు. బాహ్యాంతరాల తేడా, రాత్రింబవళ్లు తేడా పోయింది. అయినా గణపతిముని రోజుకోసారి మహర్షిని దర్శించేవారు. ఒకరోజున గణపతిముని తన తల పగిలి పోయినంతగా బాధపడ్డారు. మర్నాడు వెళ్లి సద్గురు రమణకు ఆ విషయాలు చెప్పాడు. రమణ మహర్షి ప్రేమగా తన చేతిని గణపతిముని తలపైన ఉంచి నొక్కి పట్టారు. తల చల్లబడ్డది. వెళ్లి ఆముదం మర్దన చేసి, తలస్నానం చేయమని సలహా ఇచ్చారు. ఆనాటి రేయి గణపతిమునికి 'కపాలభేదనం' అనుభవమైంది. అది జరిగినంతసేపు సద్గురు రమణ స్మరణలోనే ఉన్నాడు. రమణ మహర్షి అనుగ్రహం ఆయనలోకి నిరాటంకంగా ప్రసరించింది.

గణపతిమునికి చాపల్యం ఎక్కువ. సద్గురు అనుగ్రహంతో తృప్తిపడలేదు. పుణ్యక్షేత్రాలు దర్శించడం, అక్కడక్కడ తపస్సు చేయడం ఆయన మానలేదు. ఆయన తపశ్శక్తి పలువురు శిష్యుల్ని ఆకర్షించింది. అయినా తన తపస్సు సంపూర్ణం కాలేదని ఆయన అనుమానం. శివానుగ్రహం కలగలేదు. మనశ్శాంతి లభించలేదు. అయినా పూర్తి విశ్వాసంతో అరుణాచలంలో తపస్సుకోసం వచ్చాడు.

సద్గురు రమణ లభించడం గణపతిముని తన తపఃఫలంగా భావించాడు. ఇరవైరోజులలో ఉమాదేవిని స్తుతిస్తూ వేయి శ్లోకాలు రాయాలన్న సంకల్పం

కలిగింది. విరూపాక్ష గుహకు సమీపంలోని మామిడి గుహలో రాయడం మొదలు పెట్టారు. నిరాటంకంగా రచన సాగుతోంది. అకస్మాత్తుగా గణపతిమునిగారి కుడిచేయి బొటన వేలుపై కురుపు లేచింది. తర్వాత కొన్నాళ్లకు పుణ్యకోటి అనే శస్త్ర వైద్యునికి ఒక కల వచ్చింది. కలలో ఎవరో కనిపించి గణపతిముని నివశిస్తున్న గుహ చూపించి, అక్కడకు వెళ్లమని చెప్పారు. అది దైవాజ్ఞగా భావించి పుణ్యకోటి గుహకు వెళ్లి గణపతిమునికి ఆపరేషన్ చేశాడు. అలా దైవ సహాయం అందుకున్న మునికి తాను ఇరవై రోజులలో ఉమా సహస్రం పూర్తి చేయగలనా అని అనుమానం. ఆపీత కుచాంబ ఆలయంలో కావ్యపఠన కార్యక్రమం ఏర్పాటైంది. తప్పక పూర్తి చేయాలి. గణపతిముని అయిదుగురు శిష్యులను కూర్చోపెట్టుకొని ఆశువుగా చెప్పసాగారు. వాళ్లు రాస్తుండేవారు. అలా ఆశువుగా చెబుతున్నంత సేపు రమణ మహర్షి ఆ ప్రక్కనే కూర్చున్నారు. మహర్షి మాటా పలుకూ లేకుండా నిశ్చలంగా, మౌనంగా కూర్చుని గణపతిమునికి కావలసిన ప్రజ్ఞను అందించారు.

సహస్రం చివరి శ్లోకం రాయడం పూర్తి అయిన తర్వాత భగవాన్ అర్ధ నిమీలితంగా మునివైపు చూచి "చెప్పిందంతా రాశారా?" అన్నారు. ఆ మాటలు అన్నప్పుడు మహర్షి ధ్యాన సమాధిలోనే ఉన్నారు. రమణ మహర్షికి బాహ్యానికి అంతరానికి భేదం ఉండదు. "రచన పూర్తి కావడం సద్గురు కృపా కటాక్షం. అవి నేను రాయలేదు, నేను చెప్పలేదు. భగవాన్ నానోట పలికించారు." అంచేత చివరిశ్లోకం ఇలా పూర్తి చేశాడు. "ఆచార్య రమణ కరుణ వల్లనే ఈ బృహత్ కావ్యరచన సాగింది" అని.

సద్గురువు అనుగ్రహం శిష్యునికి ఎప్పుడూ లభిస్తూ ఉంటుంది. అనుగ్రహం లభించని క్షణం ఉండదు. దానిని గుర్తించలేకపోవడం శిష్యుని బలహీనత, అలసత్వం.

శ్రీరమణులు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అవతారంగాను, అంశగాను చెబుతారు. దానిని రమణ మహర్షి ఎలా ఆమోదిస్తారు? పురాణ కథల్లో భగవంతుడు మానవ రూపంలో అవతరించడాన్ని నమ్ముతారు. ఇప్పుడూ తాము అవతార పురుషులమని చెప్పుకునే వారున్నారు. 'నేను దేవుడిని' అనేవారున్నారు. ఆ సిద్ధాంతానికి రమణుని ఆత్మవిచారణకు పొంతన కుదరదు. ఈ అవతారాల ప్రసక్తి తెచ్చి పెట్టిందే గణపతిముని. అంతవరకు రమణునికి ఆత్మవిచారం, ఈశ్వరోపాసన తప్ప అన్యం తెలియవు.

1908 జనవరిలో మహర్షి గణపతిముని, మరికొందరితో కలిసి పచ్చ యమ్మన్ కోవెలకు మకాం మార్చారు. ఒకనాటి ఉదయాన గణపతిముని రమణ

మహర్షి సన్నిధిలో కూర్చుని ఉండగా ఒక దృశ్యం స్పష్టంగా కనిపించింది. ఒక దివ్య తేజస్సు మహర్షి ఫాలభాగాన్ని ఆరుసార్లు స్పృశించింది. అది చూచిన ముని రమణులు కార్తికేయుని అవతారమేమోనని భావించాడు. కార్తికేయుడు జ్ఞానప్రదాత, జ్ఞానమూర్తి. అప్పుడే శ్రీరమణుని కార్తికేయునిగా వర్ణిస్తూ ఎనిమిది శ్లోకాలు చెప్పాడు. కార్తికేయుడే సుబ్రహ్మణ్య స్వామి.

గణపతిముని రమణ సన్నిధిని వదలి తపస్సు కోసం అప్పుడప్పుడు బయటకు వెళుతుండేవాడు. ఆయనకు 'సద్గురు' కృప చాలదనిపించేది! తన తపస్సుతో ఏదో సాధించాలన్న పేరాశ. వెళ్లినవాడు కొంతకాలానికి తిరిగి అరుణాచలం వస్తుండేవాడు. ఆ 'తిరుగుళ్లు' మిగిలిన రమణ శిష్యులకు నచ్చేవి కాదు. ఒక గురువును నమ్మితే ఆయననే సర్వస్వం అనుకోవాలి గదా! ఇంత పండితుడు – ఇలా ఎందుకు వ్యవహరిస్తాడు? అరుణాచలంపై ఉండేనాళ్లలో 1913లో ఒక సంఘటన జరిగింది. ఒక వేదాంత మహాసభలో గణపతిముని పాల్గొనవలసి వచ్చింది. లోకం, ప్రపంచం, ఆధ్యాత్మ, జ్ఞానసాధన మొదలైన అంశాలపైన చర్చ సాగింది. సభల నుండి తిరిగి వచ్చిన ముని స్కందాశ్రమం దాపున మామిడి గుహలో ఉన్నారు. రమణుల నుండి ప్రాచీన విజ్ఞానంపైన, సాధనలపైన వివరణ పొందాలని ఆశించాడు. రమణ మహర్షి ఏది చెప్పినా స్వానుభవంతో చెబుతారు. దానికి తిరుగుండదు.

గణపతిముని ఏడుగురు శిష్యులను ఆధ్యాత్మిక ప్రశ్నావళిని సంధించడానికి సిద్ధపరిచాడు. వాటి సమాధానాలలో 'రమణ తాత్వికత' స్పష్టమవుతుంది. ఎన్నిసార్లు చెప్పినా–రమణునిది ఒకే మాట, ఒకే బాట. అది హృదయ మందిరం. శ్రీకృష్ణుడు 'భగవద్గీత'లో చెప్పిన విధంగా రమణుల వ్యాఖ్యలను గణపతిముని 'రమణగీత'గా సంకలన పరిచారు. 300 శ్లోకాలను 18 అధ్యాయాలుగా విభజించారు. అందులో సాధకుని అప్రమత్తత, హృదయ విజ్ఞానం, ఆత్మవిచారణ, మనో నిగ్రహం లాంటి ముఖ్యాంశాల వివరణ ఉంది.

రమణగీత రమణ మహర్షి తాత్విక విచారణ. ఏ సాధన అయినా సహజంగా వికాసం చెందాలి అంటారు రమణులు. సహజ వికాసం ఎలా కలుగుతుంది? మనస్సు నిశ్చలం అయితే కలుగుతుంది. సద్గురు అనుగ్రహం వల్ల కలుగుతుంది. అప్పుడు చైతన్యం పూర్తిగా వికసిస్తుంది. దానిని సహజ పరిణామం అని ఎందుకంటారు? అది ఎవరిది వారికే స్వంతం కనుక. తన లోపలి నుండి వచ్చే మార్పు కనుక. అది ఒకరు ఇచ్చేది కాదు. ఒకరు తీసుకునేది కాదు. మరి దానికి అవరోధం ఏమిటి? **మనస్సే అవరోధం, ఆలోచనలే అవరోధాలు. మనస్సు**

**బయటి ప్రపంచంలో తిరిగినంతకాలం ప్రతిబంధకాలుంటాయి. సాధకుడు మొదట చేయవలసిన పని మనస్సును అంతర్ముఖం చేయడం. అందుకు ఆత్మ విచారణ సులభ పద్ధతి.** ఆత్మ విచారణ ఎలా చేయాలి? ఆత్మ వైపుగా భావాన్ని మళ్లించడం, ఆత్మ పైకి మనస్సును తిప్పడం. **మనస్సు కేంద్ర బిందువును 'నేను' గా భావించాలి మిగిలిన ఆలోచనలన్నీ దాని నుండి ప్రభవిస్తాయి. దానిలోనే లయిస్తాయి. అంటే మనస్సు – నేను అన్న వాటిని ముడి వేయాలి.** మేల్కొని ఉన్నప్పుడు జాగృతిలో రెండూ విడివిడిగా కనిపిస్తాయి. నిద్రలో అంటే స్వప్నంలో రెండూ ఏకమవుతాయి. సుషుప్తిలో రెండూ కరిగిపోయి శూన్యం మిగులుతుంది. అంటే **జాగృతిలో పైకొచ్చి, స్వప్నంలో ఏకమై, సుషుప్తిలో లయించి పోతుంటాయి. అదిగో, ఆ మూలాన్ని చేరుకోవాలి.** Source అంటే 'ORIGIN'. అలా లోపల 'అన్వేషిస్తూ పోతే హృదయ కేంద్రాన్ని చేరతాం. అన్ని ఆలోచనలు పుట్టేది హృదయం నుండే గదా. ఆధ్యాత్మ హృదయంలో చైతన్యం ప్రభవించి మనస్సును ప్రభావితం చేస్తూ మొత్తం శరీరానికి వ్యాపిస్తుంది. ఆధ్యాత్మ హృదయానికి, మనస్సుకు ఉన్న సంబంధం సూర్యచంద్రుల సంబంధం వంటిది. **హృదయం చైతన్యానికి మూలస్థానం. మనస్సు దానికి ప్రతిబింబం. మనస్సును చైతన్యంతో హృదయంలో సంధింపచేయాలి.** దానికి 'ఆత్మవిచారణ' ఉపాధేయం. సరైన మార్గం. అంతర్వీక్షణ. గమనిక అంటే మనస్సును కేంద్రంగా చేయడం కన్నా, హృదయాన్ని కేంద్రం చేయడం సరైన పద్ధతి. **బంధంవల్ల పరిమితులు ఏర్పడుతుంటాయి. బంధాలు లేకపోతే నిర్వికల్పమే. అది సమాధి. సహజ సమాధి అవుతుంది.** ఆ స్థితిని చేరడానికి అరణ్యంలో ఉన్నా ఒక్కటే. రాజభవనంలో ఉన్నా ఒక్కటే. అన్ని క్రియలలోను అనుగ్రహ వీక్షణం తెలుస్తూ ఉంటుంది".

వాస్తవానికి రమణ మహర్షి సంస్కృతం చదువుకోలేదు. భాషా పాటవం, పాండిత్యం లేదు. 'రమణ గీత'లో సంస్కృతం జీవనదిలా ప్రవహిస్తుంది. మాటలు వాటంతట అవే దొర్లుకుంటూ వచ్చి పడతాయి. 'రమణగీత' రచన గురించి శ్రీరమణ మహర్షి మాటల్లో –

"1915లో విరూపాక్ష గుహలో ఉన్నాం. అవి చాతుర్మాస్య దినాలు. వర్షాకాలం కనుక ఎవరూ బయట తిరిగే పని ఉండదు. జగదీశ్వరశాస్త్రి అనే భక్తుడొకరు ఒకరోజున కాగితం మీద "హృదయకుహరమధ్యే" అని రాసి, ఆ కాగితం చేతిలో పట్టుకుని కూర్చున్నాడు. ఏమిటది అని నేను అడిగాను 'ఏదో శ్లోకం రాద్దామనిపించింది. మూడు పదాలు రాశాను. ఆపైన కలం సాగలేదు' అన్నాడు.

‘మిగిలింది పూర్తి చేయండి’ అన్నాను. ‘లోపల నుండి రావడం లేదు’ అని, ఆ కాగితం నేను కూర్చున్న చోట వదిలి వెళ్లిపోయాడు. తర్వాత చాలా సార్లు అతనికి జ్ఞాపకం చేశాను. ‘శ్లోకం పూర్తిగా రాయి’ అని. తన వల్ల కావడం లేదన్నాడు. ఆ శ్లోకం నేనే పూర్తి చేసి, రాగానే అతనికి చూపించాను. దానిపైన ‘జగదీశన్’ అని రాసి పెట్టాను. అప్పటికి అతను యువకుడు. అది చదివి ‘ఇది రాసింది భగవాన్ మీరు కదా? జగదీశన్ అని ఉంది?’

‘ఏమో! అది పూర్తి చేసింది జగదీశ్వరుడే కావచ్చు’ అన్నాను.

‘అయితే ఇవ్వండి’ అని కాగితం తీసుకువెళ్లి దాచిపెట్టుకున్నాడు.

భగవాన్ పూరించిన శ్లోకం ఇది.

**“హృదయ కుహర మధ్యే, కేవలం బ్రహ్మమాత్రం**
**అహమహమితి, సాక్షాత్ ఆత్మరూపేణ భాతి**
**హృది విశ, మనసా, త్వం చిన్వతా మజ్జతావా**
**పవన చలన రోధాత్ ఆత్మనిష్ఠో భవత్వం”**

ఆధ్యాత్మ హృదయ మధ్యంలో ఉండేది బ్రహ్మం! బ్రహ్మం అంటే ఆత్మ. ఆ హృదయంలోకి చొచ్చుకుపో. నేను ఎవరు? అని ప్రశ్నించుకుంటూ విచారణ చేస్తూ లోపలకు వెళ్లు. **శ్వాస నిశ్చల మయినపుడు హృదయంలో ప్రవేశించ గలుగుతావు. అక్కడ ఆత్మగా, ఏకాత్మగా మిగిలిపోతావు.**

**“హృత్ స్థలే మనః స్వస్థతాక్రియా,**
**భక్తి, యోగ, బోధాశ్చ నిశ్చితం”**

మనస్సును, మనో క్రియలను హృదయంలో లయింప చేసినప్పుడు, భక్తి, కర్మ, ధ్యాన, జ్ఞానాది యోగాలన్నీ అక్కడ కేంద్రీకృతమవుతాయి. అన్ని బాధ్యతలు భగవంతుని పరం చేయాలి. **నీవు చేయవలసిన పని హృదయంలో స్థితమై ఉండడం ఒక్కటే. అదే ఆత్మ స్థితి.**

పూర్ణత్వం సిద్ధించినపుడు అన్ని పనులు వాటంతట అవే జరిగిపోతాయి. అందులో సందేహం లేదు. హృదయంలో స్థితమైన వానికి అపజయం ఉండదు.

గణపతిమునికి మహర్షి ఇచ్చిన మొదటి ఉపదేశం, సందేశం అదే.

★ ★ ★

గణపతిముని తన తపస్సు ఏకాంతంగా కొనసాగించే నిమిత్తం తిరువొత్తియూర్‌లోని గణేశాలయం చేరుకున్నాడు. తపస్సులో లీనం అయినాడు. 18వ రోజున ఆయన తపస్సమాధిలో ఉండగా, తన ప్రక్కన మహర్షి కూర్చుని

ఉన్నట్లనిపించింది. "నేను ఆశ్చర్యంతో, కంగారుతో కళ్లు విప్పాను. గురుదేవులు తన చేతిని నా తలపైన పెట్టి, నన్ను కూర్చోమన్నారు." అప్పటికే గణపతి శరీరంలో మహాశక్తి ఆపాదమస్తకం పాకుతోంది. తనను అనుగ్రహించడానికి కార్తికేయావతారం అయిన రమణ మహర్షి, అరుణాచలం నుండి తిరువొత్తియూర్‌కు రావడం అద్భుతం!

1896 సెప్టెంబరు 1న తిరువణ్ణామలై చేరింది మొదలు రమణ మహర్షి ఆ ఊరు వదలి వెళ్లింది లేదు. అలాంటిది మహర్షి తిరువణ్ణామలైలో ఉంటూ తిరువొత్తియూర్‌లో గణపతిమునికి ఎలా దర్శనం ఇచ్చారు? శిష్యుని ఆకాంక్ష, అవసరం గురువును రప్పిస్తుంది. ఆ సంఘటన గురించి చాలా కాలం తర్వాత రమణులే ఇలా చెప్పారు –

"కొన్ని సంవత్సరాల క్రితం ఒకరోజున మామూలుగా పడుకుని వున్నాను. మేలుకునే ఉన్నాను. నా శరీరంపైకి లేస్తున్నట్లు అనిపించింది. లేచి ఎక్కడికో వెళ్లింది. నా చుట్టూ ప్రపంచం శూన్యమైంది. చివరకు ఏదో వెలుగు నన్ను కమ్మింది. తర్వాత నా శరీరం క్రిందికి దిగింది. పరిసరాలు కనిపించాయి. నేను తిరువొత్తియూర్‌లో ఉన్నాననిపించింది. పెద్ద రోడ్డుపైన ఉన్నాను. దూరంగా గణేశుని ఆలయం కనిపించింది. నేను ఆలయం లోపలకు నడిచాను. ఏదో మాట్లాడాను. జ్ఞాపకం లేదు. అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. నేను ఉన్నది విరూపాక్షగుహలోనే. ఆ విషయం అంతా పళని స్వామికి అప్పుడే చెప్పాను."

1929లో గణపతిముని పాలకొట్టు గ్రామంలో గణపతి ఆలయం ఎదురుగా ఒక పెంకుటింట్లో ఉండేవారు. విశ్వనాథస్వామి మరికొందరు రమణ భక్తులు మునికి సహాయంగా ఉండేవారు. మధ్యాహ్నంవేళ మహర్షి వచ్చి మునిగారి వద్ద కొద్ది నిముసాలు కూర్చునేవారు. రమణ మహర్షికి భక్తులంటే ఎంతో వాత్సల్యం. కొండమీది అరణ్యం అంతా రమణమహర్షి గణపతికి తిప్పి చూపించేవారు.

ఒకసారి గణపతిముని అన్నాడు "నేను భారతదేశంలో చాలా అరణ్యాలు తిరిగి చూచాను. అరుణాచలం అడవులతో పరిచయం లేదు".

రమణ చిన్న పిల్లాడిలా నవ్వుతూ : "నాయనా అరుణాచలం పైన నా పాదాలు స్పృశించని ప్రదేశం లేదు. కొండపైన, విరూపాక్ష గుహలో ఉండే రోజుల్లో, అడవి అధికారులు సైతం వెళ్లని ప్రదేశాలు నేను తిరిగాను".

ఒకసారి రమణ మహర్షి విశ్వనాథ స్వామి గణపతిమునిని వెంటబెట్టుకుని అడవిలోపలకు తీసుకువెళ్లాడు. చాలా లోపలకు వెళ్లేసరికి వెనకనుండి వారిని

వెతుకుతూ మురుగనార్ వచ్చిచేరాడు. భగవాన్ ఒక్క క్షణం కనిపించకపోతే మురుగనార్ తల్లడిల్లిపోతాడు.

రమణ మహర్షి రచనలన్నింటికీ ప్రేరణ మురుగనార్. 1928లో మురుగనార్ అభ్యర్థన పైన భగవాన్ 'ఉల్లాదునార్పదు' రాశారు. అది 'మహర్షి' జ్ఞానభాండారం. దానికి తెలుగులో యోగిరామయ్య అభ్యర్థన మేరకు రమణులే స్వయంగా "ఉన్నది నలభై" రాశారు. ఉపనిషత్తులు, వేదాల సారం 'ఉన్నది నలభై'లో రమణ మహర్షి నిక్షిప్తం చేసారని గణపతిముని విశ్వాసం.

ఒక భక్తుడు ప్రశ్నించాడు : "భగవాన్ గణపతిమునిని 'నాయన' అని పిలుస్తారు, ఎందుచేత?"

"అందుకు ఒక కారణం – ఎవరినైనా మర్యాదగా పిలవడం మంచిది. పైగా గణపతిశాస్త్రి గారు నాకంటే పెద్దవారు. అందువల్లనే గణపతిశాస్త్రిగారూ అంటాను. అలా 'గారు' అన్నప్పుడు ఆయన ఇబ్బంది పడేవారు. అలా పిలవద్దని "నేనూ మీ శిష్యుడిని" అని చాలాసార్లు చెప్పారు. ఆయన శిష్యులంతా నాయన అనేవారు. నేనూ అలాగే పిలుస్తున్నాను".

రమణ మహర్షి సంస్కృతంలో ఏది రాసినా గణపతిమునికి చూపించి దిద్దిపెట్టమనేవారు. ఒక చంద్రగ్రహణ సమయంలో 'ఉపదేశసారం' వ్యాఖ్య పూర్తి చేశారు. 1929 తర్వాత గణపతిముని మహర్షితో గడిపింది తక్కువ. పరిస్థితులు ఆయనకు ప్రతికూలించాయి. సిర్సి వెళ్లి ఆనందాశ్రమం నెలకొల్పి తన శిష్యులతో అక్కడ ఉండేవారు. 58వ ఏట 1936లో నాయన మహాసమాధి అయినారు. ఆయన చనిపోయినట్లు టెలిగ్రాం వచ్చినపుడు రమణ మహర్షి 'అటువంటివాడు ఎక్కడా దొరకడు' అని అభినందించారు.





# 17. రామస్వామి అయ్యర్

**'ఆ**త్మ విచారణ' ఒక్కొక్క శిష్యుని కోణంలోంచి ఒక్కొక్క అంశాన్ని వ్యక్తీకరించేవారు రమణమహర్షి. సాధకుల అవసరాలను బట్టి బోధ చేశారు. మనవాసి రామస్వామిఅయ్యర్ తొలినాటి భక్తులలో ఎన్నదగిన వ్యక్తి. తిరువణ్ణా మలైలో పబ్లిక్ వర్క్సులో సూపర్‌వైజర్. 1908లో అరుణగిరిపై ఉన్న బ్రాహ్మణ స్వామిని గురించి విన్నాడు. అయితే ప్రజలు స్వామి గురించి భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు. ఏది నిజం? చూస్తే గదా తెలిసేది! ఒక మిత్రుని సాయం తీసుకుని కొండపైకి వెళ్లాడు. ఏమైంది? చూచాడు. వెనుతిరిగి వచ్చాడు? తోడుగా వచ్చిన మిత్రుడు అన్నాడు "టైం వేస్టు" అని. ఒక నెల రోజుల తర్వాత రామస్వామి అయ్యర్ ఒంటరిగా వెళ్లాడు. కొండపైకి వెళ్లాలని మనసు పీకింది. వెళ్లకుండా ఉండలేని పరిస్థితి. ఈయన వెళ్లేసరికి మహర్షి ఒక్కరే విరూపాక్ష గుహలో ఉన్నారు. ఆనాటి సత్సంగం గురించి రామస్వామి అయ్యర్ తన డైరీలో భద్రంగా రాసుకున్న మాటలు –

"వారిని దర్శించగానే ఆత్మ ఉద్దీప్తమైంది.

నేను ప్రశ్నించాను : స్వామీ! జీసస్‌లాంటి మహాత్ములెందరో పాపవిమోచన కోసం జన్మించారు. నాకూ అలాంటి విమోచన కలుగుతుందా?

మహర్షి ఇంగ్లీషులోనే సమాధానం చెప్పారు. "There is Hope, yes, there is Hope."

తర్వాత అనేకసార్లు స్వామి దర్శనానికి వెళ్లాను. ఒకరోజు రాత్రి స్వామితో గుహలోనే ఉండిపోయాను. ఒకసారి స్వామి నిశ్చలంగా కూర్చుని ఉన్నారు. నేను

వారి ఎదురుగా కూర్చున్నాను వారి వేపు చూస్తో... ఒక గంట తర్వాత నా వైపు చూచారు. ఆ చూపుల్లో ఏదో విద్యుత్ అనుభూతించాను. అంతకుముందు ఒకసారి అట్లానే జరిగింది. చింతచెట్టు క్రింద కూర్చుని ఉండగా నా శరీరం పులకించింది. ఒక్కసారిగా ఏదో శక్తి నన్ను ఆవహించింది. అది ఫలానా అని చెప్పలేను. తర్వాత చాలా సంవత్సరాలకు నా మనస్సు 'లోపల'కు నిష్క్రమించ సాగింది. ఆలోచనలు ఆగిపోయాయి. అప్పుడు నా శరీరంలో శక్తిపాతం జరిగింది. గొప్ప ఆనందం పొందగలిగాను.

నాకు అజీర్తి రోగం. తిన్నది అరగదు. నిద్ర పట్టదు. చాలా బాధపడతాను. స్వామి నా విషయం అడిగారు. చెప్పాను. వెంటనే నా తల వేడెక్కిపోయింది. ఒక నిమిషం తర్వాత నా బుర్ర చల్లబడ్డది. ఆనాడు ఒక భక్తురాలు స్వామికి భోజనం తెచ్చింది. రొట్టెలు. నేను గంజి మాత్రం తీసుకుంటాను. ఆరోజు భక్తులతో కలిసి నేను భోజనం చేశాను. స్వామి స్వయంగా పిలిస్తే రానని ఎలా చెప్పను? వెళ్లాను. అనుమానం లేకుండా భోజనం చేశాను. ఆ రాత్రి సుఖంగా నిద్రపోయాను. నా అజీర్తి రోగం పోయింది. స్వామిపైన భక్తి పెరిగింది. స్వామి వద్దకు వెళ్లవద్దని చెప్పినవారే తర్వాత స్వామి దర్శనానికి రాసాగారు. నిజంగా అది నాకు మరోజన్మ.

స్వామి అందరినీ దయగా, ప్రేమగా చూస్తారు. ఎవరైనా స్వామి వద్ద చనువుగా ఉండవచ్చు. మమ్మల్ని 'రిభుగీత' చదవమని ఇచ్చారు. వారివైపు చూస్తే చాలు మన లోపల ఏదో కలవరం కలుగుతుంది. చాలామంది గురువులు శిష్యుల్ని తల స్పృశించి ఆశీర్వదిస్తారు. శిష్యులు గురువులకు పడిపడి పాదాభివందనాలు చేస్తారు అనుగ్రహ ప్రాప్తి కోసం. ఇక్కడ రమణస్వామి ఒక్కచూపు చాలు – నిలువెల్లా శక్తి నిండిపోతుంది. వారి చూపులోనే అనుగ్రహం, ప్రేమ ప్రవహిస్తాయి.

స్వామి అంటారు : "అసలు బాధ అంతా ఆత్మను అలక్ష్యం చేయడం వల్లనే. ఆత్మను ఉపేక్షిస్తే అన్నీ కష్టాలే. నేను అనే స్పృహ ఉంటే ఏ చెడు జరగదు. నేను ఎవరు? అనే ప్రశ్న వేసుకుని విచారణ చేస్తే ఎంతో హాయి అనిపిస్తుంది. మనసు లోపలి తీరం చేరతారు. అలా ప్రశ్నిస్తే సంకల్పానికి బలం చేకూరుతుంది. విల్ పవర్ తగ్గితే ఆనందం తగ్గుతుంది. ఈ విషయాలు ఇప్పుడు నాకు స్పష్టంగా తెలుస్తున్నాయి".

మేధాశక్తి పెరగాలంటే ఒక్కటే ఉపాయం ... ఆలోచనల్ని నిలపడం. ఆలోచించడంవల్ల బుర్ర వేడెక్కుతుంది. ఆలోచనలు నిలిచిపోతే మనస్సు చల్లబడుతుంది. మనశ్శాంతి కలుగుతుంది. అప్పుడు అంతా ఆనందమే.

## ఎచ్చమ్మాళ్



రమణ మహర్షి గారి కథలో ఎచ్చమ్మాళ్ పాత్ర విస్మరించడానికి వీల్లేనిది. శ్రీరాముని కథలో శబరి పాత్ర వంటిది 'రమణాయణం'లో ఎచ్చమ్మాళ్ పాత్ర. ఆమె అసలు పేరు లక్ష్మి అమ్మాళ్. ఊరు మందకొలత్తూర్. బ్రాహ్మణస్వామి తొలినాటి భక్తులలో ఆమె ఒకరు. పాతికేళ్ల వయసులోనే భర్తను పోగొట్టుకుంది. తర్వాత కన్న బిడ్డలు ఒక కొడుకు, ఒక కూతురు చనిపోయారు. జీవితం దుర్భరం అనిపించింది. విధిని నిందించసాగింది. చిన్నతనం నుండి జీవితం హాయిగా సాగింది. ఇప్పుడు భర్త, పిల్లలు పోయాక ఒంటరి బ్రతుకైంది. ఎటుచూచినా చీకటి. కాలు కదిపితే కష్టాలు కాటువేస్తున్నాయి. తండ్రిగారి అనుమతితో గోకర్ణం యాత్రకు వెళ్లింది. అక్కడ తాపసుల దర్శనం వల్ల మనశ్శాంతి ఆశించింది. కానీ ఆశించిన మనశ్శాంతి లభించలేదు. ఉత్తరదేశంలో చాలా పుణ్యక్షేత్రాలు దర్శించి ఎందరో స్వాములను సేవించింది. ఎవరూ ఆమెకు మనశ్శాంతి కలిగించలేదు. ఇంటికి చేరింది.

ఆమె ఉత్తరదేశ యాత్రలలో చాలా పుణ్యం సంపాదించిందని అయినవారు భావించారు. కాని ఆమెలో ఆశించిన మార్పు రాలేదు. ఎవరో సలహా చెప్పారు. తిరువణ్ణామలైలో ఒక యువసన్యాసి ఉన్నాడని, ఆయన ఎవరితో పలకడని, అయినా ఆయన దర్శనం వల్ల మనస్సు కుదుటపడుతుందని, కష్టాలు తీరి పోతాయని ! ఏ పుట్టలో ఏ పాముందో! ఏ కొండ మీద ఏ స్వామి ఉంటాడో! ఎచ్చమ్మాళ్ వెంటనే బయలుదేరింది. బంధువుల ఇళ్లకు వెళ్లదలచలేదు. మానుతున్న గాయాల్ని మరింత కెలుకుతారు. మాటల సానుభూతి మనసును మరింత బాధ పెడుతుంది. ఒక స్నేహితురాలిని వెంట తీసుకుని కొండపైకి వెళ్లింది. స్వామిని దర్శించింది. చూపులు లేవు, పలకరింపులు లేవు. గంటసేపు స్వామి సన్నిధిలో నిలబడే ఉండిపోయింది. తదేకంగా స్వామిని చూడడం తప్ప మరో ఆలోచన లేదు. మరో ధ్యాస లేదు. మరో ప్రపంచం లేదు. తాను, తన ఎదురుగా స్వామి రూపం తప్ప ఏమీ లేని, ఏమీ తెలియని తన్మయస్థితి. ఉన్మీలన స్థితి అది. ఆమెలో శక్తపాతం జరిగిపోయింది. స్వామిని వదిలి వెళ్లకూడదనే నిర్ణయం చేసుకుంది. స్నేహితురాలితో కలిసి కొండదిగి వచ్చింది అప్పటికి. తొలిదర్శనంతోనే ఆమె మనస్సు నిర్మలమైంది. విచారం తొలగిపోయింది.

తర్వాత రోజూ స్వామి దర్శనానికి రాసాగింది. వచ్చి కూర్చుంటుంది. నెమ్మదిగా గుండెలో గూడు కట్టుకున్న గుబులు తీరింది. ఇప్పుడు ఏ విచారం లేదు. దిగులు లేదు. ఏదో ప్రేమ, ఇదీ అని చెప్పరాని వాత్సల్యం ఆమెలో. అంతా స్వామి దయ.

"నాకు స్వామియే సర్వస్వం" అనే నిర్ణయంతో ఆమె జీవితం మారి పోయింది. నేను ఆరాధించేది స్వామిని. నాకు వేరే చింతన వద్దు. చింత వద్దు."

ఎచ్చమ్మాళ్ పూర్తిగా స్వామి సేవకు అంకితమైంది. కొండక్రింద మకాం పెట్టింది. రోజూ స్వామికి, ఆయన శిష్యులకు వంటచేసి, మధ్యాహ్నానికి కొండపైకి తీసుకుపోతుంది. అందరూ తిన్న తరువాత, మిగిలింది స్వామి ప్రసాదంగా తను తింటుంది. తన రక్షకుడు స్వామి. ఆయన్ని వదలిపోవడం ఇంక జరగని పని. తన ఖర్చులకు అన్నగారు, తండ్రిగారు పంపే డబ్బు ఇలా స్వామికి ఉపయో గించడం ఆనందంగా వుంది. అంతకన్నా ఈ జన్మకు కావలసింది ఏముంది? స్వామి అనుగ్రహం పొందడానికి ఇదే చక్కని మార్గం. అలా నలభై సంవత్సరాలు ఎచ్చమ్మాళ్ మహర్షి సేవలో పునీతమైంది. ఆమె నిరుపేద. ఉన్నది త్యజించింది. ఆమె ఇల్లు రమణ భక్తులకు కోవెల. ఆమెకు వేరే పూజలు, వ్రతాలు లేవు. అన్నీ వదిలిన తర్వాతనే ఆత్మ శాంతి లభించింది. భగవాన్‌కు చేరువ కాగలిగింది. తనకు ఏది జరిగినా భగవాన్ చెవిని వేస్తుంది. పరిష్కారం అడగదు. విషయం తెలియ చేయడం వరకే తన కర్తవ్యం. ఎలా పరిష్కరించేది స్వామి ఇష్టం.

మహర్షి అనుమతితో సెల్లమ్మాళ్ అనే పిల్లను దత్తత తీసుకుంది. కట్టుకున్న వాడు, కన్నబిడ్డలు కాకుండా పోయిన తర్వాత ఈ దత్తత ఎందుకు? మనిషికి మనిషి తోడు, మనస్సుకు ఊరట చేదోడు, వాదోడు. అందుబాటులో ఉన్నవారితో ఆత్మీయత పంచుకోకపోతే ఎవరికీ మనసు నిలవదు! బయటివారిని తనవారని భావించే సంస్కారం అందరికీ ఉండదు. ఆ పెంచుకున్న పిల్లకు పెళ్లి చేసింది. మనవడికి రమణ అని పేరు పెట్టింది. అయినా దురదృష్టం ఎచ్చమ్మాళ్‌ను వదలలేదు. **భక్తి పెరిగిన కొద్దీ కష్టాలు పెరుగుతాయేమో! కష్టాలు భక్తుల పాలిట పరీక్షలు.** ఆమె తిరువణ్ణామలైలో ఉండగా సెల్లమ్మాళ్ చనిపోయిన వార్త అందింది. ఏం జబ్బు చేసిందో తెలియదు. పెంచుకున్న కాస్త బంధం తెగిపోయింది. క్షణంలో గుండె రాయి చేసుకుంది. అలా సెల్లమ్మాళ్ బంధ విముక్తురాలైంది. ఆమె పరిస్థితికి మహర్షి కళ్లు చెమ్మగిల్లాయి. ఇంక భగవంతుడు తప్ప తనకు వేరే ఎవరున్నారు? భగవంతుని సన్నిధికి చేర్చే వ్యక్తి మహర్షి ఒక్కరే.

ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందడానికి అన్నేసి కష్టాలు పడాలా? కష్టాలు పరీక్షలంటారు నిజమా? ఆ పరీక్షల్లో ఫెయిల్ అయిన వారే ఎక్కువ. కష్టాలవల్ల మనస్సు వికలమవుతుంది తప్ప నిర్మలం కాదు గదా! ఎచ్చమ్మాళ్ ఒక చక్కని ఉదాహరణ. ఒక సద్గురువును నమ్మినవారు ఆశించేది ఏమిటి! భౌతికసుఖాలా, సిరిసంపదలా? **కావలసిన ఆత్మశాంతి గురువు ఇస్తాడు. అడిగినా, గీ పెట్టినా భౌతిక సంపదలు, సుఖాలు ఇవ్వడు. దానికీ ఒక పరిమితి ఉంటుంది –**

**అడగడానికి ఇవ్వడానికి.** ఎచ్చమ్మాళ్ మొదట ఉత్తరదేశ యాత్రలు చేసినప్పుడు ఒక గురువు వద్ద ఉపదేశం పొంది సాధన చేసింది. ఇరవై నాలుగు గంటల పాటు ఆమె ధ్యాన స్థితిలో ఉండగలదు. శరీర స్పృహ కోల్పోయి సమాధిలో ఉండగలదు. ఆమె యోగస్థితిని ఎవరో మహర్షికి చెప్పారు. విని ఊరుకున్నారు. ఆమె స్వయంగా తన స్థితిని మహర్షికి తెలియచేసినప్పుడు 'వాటిని మానెయ్యి' అని ఒక్కమాటన్నారు.

**"అది నీ గమ్యం కాదు, వెలుగులు చూస్తే ఒరిగేది లేదు. అవి యోగ సిద్ధులు కావు. ఆత్మను అన్వేషించు. ఆత్మను తెలుసుకోవాలి. అందుకు దగ్గర మార్గాలుండవు."**

ఆమె అష్టాంగ సాధనలు మానింది. తనకు గురువుపై విశ్వాసం చాలనుకున్నది. గురువు అనుగ్రహం చాలు. నాటినుండి మహర్షిని మనస్సులో మననం చేయసాగింది. ఆ భావధారణ వల్ల ఆమెకు ఆధ్యాత్మ అనుభవాలు ఇబ్బడి ముబ్బడిగా కలగసాగాయి.

ఉత్తర దేశం నుండి ఒక శాస్త్రి గారు మహర్షి దర్శనానికి వచ్చారు. ఆయన విరూపాక్ష గుహలో మహర్షితో సంభాషిస్తుండగా ఎచ్చమ్మాళ్ భోజనం తీసుకు వచ్చింది. ఆ రోజు ఆమె చాలా చిరాకుగా కనిపించింది. 'ఏమిటి సంగతి?' మహర్షి అడిగారు.

"భోజనం తీసుకుని కొండ ఎక్కుతున్నాను. నా మార్గంలో ఇద్దరు నిలబడ్డారు. వారిలో ఒకరు రమణ మహర్షి. రెండవ వ్యక్తి ఎవరో తెలియదు. నేను గాభరాగా ముందుకు వస్తున్నాను. "నేను ఇక్కడ ఉంటే నీవు కొండపైకి పోతున్నావా" అన్నారు. వెనక్కి తిరిగి చూచాను. ఇద్దరూ కనిపించలేదు. నాకు భయం వేసింది."

ఎచ్చమ్మాళ్ ఆవిషయం చెప్పినపుడు ఉత్తరాదిశాస్త్రిగారికి అసూయకలిగింది. ఈ యమ్మ ఎంత పుణ్యం చేసుకున్నదో! ఎక్కడోవున్న భగవాన్ దర్శనమిచ్చారు.

ఆయన మహర్షితో అన్నారు: "స్వామీ తమరు ఇక్కడ నాతో మాట్లాడుతున్నారు. అక్కడ ఆయమ్మకు దర్శనం ఎలా ఇచ్చారు? అలాంటి అనుగ్రహం నాకూ కలిగించండి."

సద్గురువు తన శక్తి చాటుకుంటాడా? తనకు సిద్ధులు, శక్తులు ఉన్నాయని అసలు చెప్పుకోడు!

"ఆమె మనసులో సదా నన్నే స్మరిస్తుంది. మనం అక్కడ కనిపించినట్లు భ్రమపడ్డదేమో" అని నవ్వారు.

మహాత్ముల చేష్టలు అర్థం కావు – వారి మాటలు అర్థం కావు!

## అరూప దర్శనం



శాంతమ్మాళ్ కాస్త పెద్దావిడ. వితంతువు. రామనాథ్ జిల్లా ఆమెది. ఆమె కొన్ని సంవత్సరాల క్రితం మహర్షిని గురించి విన్నది. ఆయన జీవిత చరిత్ర చదివింది. మహర్షి ఫోటో ఒకటి సంపాదించి పూజగదిలో పెట్టుకుని ఆరాధిస్తున్నది. ఆయనను దైవ స్వరూపంగా భావించి పూజిస్తుంది. పగలంతా అదే స్మరణ. రాత్రి కలల్లోనూ భగవాన్ దర్శనాలే. తను తిరువణ్ణామలై వెళ్లినట్లు, స్వామికి తన చేతులతో తనే భోజనం వడ్డిస్తున్నట్లు భావిస్తుంది. ఆమె కళ్ల ముందు వెలుగులు కనిపిస్తుంటాయి. కళ్లు మూసుకుంటే మహర్షి రూపం కనువిందు చేస్తుంది. ఆ రూపం తేజస్సుగా, వెలుగుగా మారుతుంది. వచ్చి మహర్షికి విన్నవించుకుంది.

"అలా రానివ్వకు శాంతమ్మా. దానివల్ల నీ లక్ష్యం చెదురుతుంది. రూపాన్ని చూడడం విశేషం కాదమ్మా. మనస్సు నిగ్రహించి నిశ్చలం చేసుకోవాలి" అన్నారు మహర్షి.

చాలా మంది భక్తులు చేసే పని అదే. మహర్షి రూపాన్ని ఊహించుకుని ధ్యానం చేస్తే అదే రూపం కనిపిస్తుంది. అలా ఊహించుకోవద్దని మహర్షి అందరికీ సలహా లిస్తుంటారు. అయితే కొందరి విషయంలో అలాంటి దర్శనాలకు ప్రత్యేకత ఏర్పడుతుంది.

తిరువణ్ణామలైలో పబ్లిక్ వర్క్సులో ఉద్యోగి రాఘవాచారి. 1910లో ఆయన తరచుగా మహర్షిని దర్శిస్తుండే వాడు. ఎప్పుడు వెళ్లినా విరూపాక్ష గుహలో భక్తులు గుంపుగా ఉండేవారు. ఆయనకు ఏకాంతం లభించేది కాదు. మనస్సులోని ఆవేదన చెప్పుకోవడానికి అవకాశం ఏర్పడేదీ కాదు. ఒక రోజున మూడు ప్రశ్నలు తయారు చేసుకుని, ఏమైనా సరే, అడిగి తీరాలని మహర్షి సన్నిధికి చేరాడు –

1. స్వామీ, మీతో ఏకాంతంగా కొద్ది నిమిషాలు మాట్లాడే అవకాశం ఇస్తారా? మీరు, నేను తప్ప ఎవరూ ఉండకూడదు.
2. నేను థియోసాఫికల్ సొసైటీ సభ్యుడిని. మా దివ్యజ్ఞాన సమాజం గురించి మీ అభిప్రాయం ఏమిటి?
3. మీ నిజరూపం చూపించండి, నాకా అర్హత ఉందనిపిస్తేనే, నేను చూడగలిగితే.

నేను లోపలకు వెళ్లి నమస్కారం చేసి కూర్చున్నాను. అప్పుడక్కడ ముప్పయి మంది వరకు భక్తులున్నారు. నేను వెళ్లగానే అందరూ లేచి వెళ్లిపోయారు. నేను

స్వామి ఎదుట ఒక్కడినే మిగిలాను. నా మొదటి ప్రశ్నకు అడగకుండానే జవాబు లభించింది. స్వామి నావైపు చూచి 'నీచేతిలో ఉన్న పుస్తకం ఏమిటి? భగవద్గీతా?' నేను థియోసాఫికల్ సొసైటీ గురించి అడిగేలోగా స్వామి అన్నారు :

"మంచిదే ... మంచిపనే చేస్తున్నారుగా".

అవునన్నట్లు నేనూ తల ఊపాను. నా రెండవ ప్రశ్న అడగకుండానే జవాబు దొరికింది. మిగిలింది మూడవ ప్రశ్న : ఉత్సుకతతో ఎదురు చూస్తూ కూర్చున్నాను. అరగంట గడిచింది. నేను నోరు విప్పి అడగలేదు. లోలోపల అనుకున్నాను. 'అర్జునుడు శ్రీకృష్ణుని అడిగాడు విశ్వరూపం చూపించమని. నాకు మీ నిజరూపం దర్శించాలని వుంది చూపించరూ'.

స్వామి అరుగుపైన కూర్చుని ఉన్నారు. వారి ప్రక్కన గోడమీద దక్షిణామూర్తి పెయింటింగ్ వేలాడుతోంది. ఎవరు బహూకరించి వెళ్లారో మరి. స్వామి ఆ పెయింటింగ్ వైపు, నా వైపు మార్చిమార్చి చూడసాగారు. నేను వారి కళ్ల లోకి చూచాను. నా దృష్టి నుండి స్వామి రూపం, దక్షిణామూర్తి రూపం మాయమై ఉత్తి శూన్యం మిగిలింది. అంతలో ఒక తెల్లని మేఘం. అందులో మహర్షి, దక్షిణామూర్తి రూపాలు రేఖా మాత్రంగా కనిపించసాగాయి. తర్వాత ఆ రూపాలూ అంతర్థానమైనాయి. తర్వాత వెలుగు రేఖల్లో కన్ను, ముక్కు, అవయవాలు కనిపించాయి. వారిద్దరి రూపాలు కళ్లు చెదిరేటంత తేజస్సులో మెరిసిపోతున్నాయి.

సాష్టాంగ నమస్కారం చేసి, ఆనందంతో నోట మాట రాక గుహ బయటకు వచ్చాను. తర్వాత నెల రోజులు కొండకు వెళ్లే ధైర్యం కలగలేదు. అరుణగిరి వైపు చూస్తే రమణులే కొండంత దేవరగా కనిపించసాగారు. నెల తర్వాత ధైర్యం కూడ దీసుకుని వెళ్లాను. స్కంధాశ్రమం వెలుపలనే స్వామి దర్శనమిచ్చారు. నా అనుభవం గురించి వివరించాను. నా అనుమానాలు, ప్రశ్నలు, అనుభవాలకు వివరణ అర్థించాను. ఒక నిమిషం తర్వాత భగవాన్ పెదవి విప్పారు –

"నీవు నా రూపాన్ని చూడాలనుకున్నావు. నా 'అరూపాన్ని' చూచావు. నేను రూపరహితుడిని. నిరాకారుడిని. కనుక నీ అనుభవం సత్యమైనదే. మిగిలిన దృశ్యాలు నీ మనోకల్పనలు. భగవద్గీత చదివావు గదా. దాని ప్రభావం నీ మనస్సుపైన పనిచేస్తోంది".

గణపతిమునికీ ఇలాంటి అనుభవమే ఒకటి కలిగింది.

మహర్షి ప్రశ్నించారు, "ఇంతకీ నేనెవరు? 'నేను' అంటే ఎవరు? ఏమిటి? రుషినా? జ్ఞానినా? విజ్ఞానినా? వివిజ్ఞానినా? నేనెవరు?"



# 18. హంప్రీ అనుభవం

**గు**రువుల ఆనవాళ్లు శిష్యులలో కనిపించాలి!

శిష్యులు గురువులకు గీటురాళ్లు కావాలి!

భక్తుల్ని రమణ మహర్షి చిత్రంగా ఆకర్షించేవారు. భక్తుల అనుభవాలలో మహర్షిని అనుశీలించడంవల్ల అవగాహన విస్తరిస్తుంది పాఠకులకు. ఆయా భక్తులలో పాఠకుడు పరకాయ ప్రవేశం చేస్తూ ఆయా అనుభవాలు తనవిగా అనుభూతిస్తూ ఆనందిస్తాడు. పేర్లు వేరైనా భక్తి ఒక్కటే. భక్తులు వేరైనా 'భక్తి' గుణం ఒక్కటే గదా! ఇరవైయవ శతాబ్దం తొలిదశకంలో రమణ తపస్సు జనాన్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. నాలుగు దశాబ్దాలు గడిచే సరికి ఆయన అధునాతన 'మహర్షి', అద్వితీయ 'తపశ్శాలి' అయినారు. సాధారణంగా మహత్తులు, సిద్ధులు ప్రదర్శించి కీర్తిగడిస్తారు. రమణ మహర్షి ఏ సిద్ధులు చూపలేదు, మహత్తులు చూపలేదు. అయినా జ్ఞానశిఖరంలా వెలిగారు. అరుణగిరివైపు అందరి దృష్టిని మళ్లించారు. ఆయన కావాలని ఆ పని చేయలేదు. 'ఆయనే కావాలని' భక్తులు ఎగబడ్డారు. మహర్షి ప్రభలు సముద్రాలు దాటి పరదేశీయుల్ని సైతం ఆకర్షించడానికి కారకుడు హంప్రీ!

1911 జనవరిలో హంప్రీ పోలీసు డిపార్టుమెంటులో అసిస్టెంటు సూపరింటెండెంటు ఉద్యోగిగా బాధ్యతలు తీసుకోవడానికి ఇంగ్లండు నుండి వచ్చినవాడు. ఆయన బొంబాయిలో ఓడ దిగేసరికి జబ్బుపడ్డాడు. బొంబాయి నుండి రైలు ప్రయాణం చేయలేని అస్వస్థత. రెండు నెలలపాటు ఆస్పత్రిలో చికిత్స

తీసుకోవలసి వచ్చింది. ఆరోగ్యం చక్కబడిన తర్వాత ట్రయినింగ్ కోసం రాయవెల్లూరు వచ్చాడు. 1911 మార్చి 18న వెల్లూరు చేరాడు. ఆయన గారికి తెలుగు రాదు. ఆయనకు తెలుగు నేర్పడానికి ఎస్. నరసింహయ్య అనే తెలుగు పండితుని ట్యూటర్‌గా నియమించారు ప్రభుత్వంవారు. వచ్చిన రోజునే 'అ, ఆ'లు అక్షరాభ్యాసం ప్రారంభించాడు. హంప్రీకి జ్యోతిషం పిచ్చి, అతీంద్రియ శక్తులపై ఆసక్తి. జ్యోతిషం మీద ఒక పుస్తకం సంపాదించి పెట్టమని తన తెలుగు ట్యూటర్‌ని అడిగాడు. పనిలో పనిగా "ఇక్కడ ఎవరైనా మహాత్ము లున్నారా?" అని వాకబు చేశాడు.

మన దేశంలో ఎవరూ తాము అభిమానించే గురువుల గురించి, మహాత్ముల గురించి బహిరంగంగా చర్చించరు. అందులోనూ విదేశీయుల ముందు అసలు మాట్లాడరు. అంచేత తనకు తెలియదన్నాడు తెలుగుమాస్టరు. మర్నాడు ట్యూషన్ మాస్టరు రాగానే హంప్రీ అన్నాడు : "పండిట్ జీ! నిన్న మీరు మహాత్ము లెవరూ ఈ ప్రాంతంలో లేరని చెప్పారు. రాత్రి కలలో మీ గురువుగారిని నేను చూచాను".

పండిట్ ఆశ్చర్యపడ్డాడు.

"నేను బొంబాయిలోనే మిమ్మల్ని చూచానండి" అన్నాడు.

"నన్ను బొంబాయిలో చూచారా? నేనెప్పుడు బొంబాయి రాలేదు. అసలు బొంబాయి ఎక్కడ ఉందో నాకు తెలియదు."

అప్పటికే నరసింహయ్య కొన్ని ఫోటోలు సేకరించి తెచ్చాడు. వాటిని హంప్రీ చేతికిస్తూ "వీరంతా మహాత్ములే. చూడండి" అన్నాడు. వాటిలో గణపతిమునిగారి ఫోటో చూపించి, "మీ గురువు ఇట్లానే ఉండాలి ఈయన మీ గురువుగారా?"

పండిట్ అవునని తలాడించాడు.

హంప్రీకి మళ్లీ జబ్బు చేసింది. రెండు వారాలు ఊటీలో ఉండడానికి వెళ్లాడు. అక్కడ హంప్రీకి ఒక అనుభవం కలిగింది. ఆ విషయం తెలుగు మాస్టారికి ఉత్తరం రాశాడు –

"నేనొక చిత్రమైన మనిషిని చూచాను. ఆయన కళ్లు విశాలం. పెరిగిన గడ్డం, జుత్తు. ఆయన గొప్పవాడనిపించింది. ఆయనకి ప్రాణాయామం నేర్చుకోవలసి ఉందిట".

"శాఖాహారం వల్ల యోగానికి ఏం లాభం? నాకు ఏదైనా యోగ సంస్థలో చేరాలని, యోగం నేర్వాలని ఉంది. యోగులు పోయినవారి ఆత్మలతో మాట్లాడు తుంటారట. పూర్వజన్మలో నేనూ ఒక యోగినట".

అలా హంఫ్రీ రెండు మూడు ఉత్తరాలలో తన మనస్సు విప్పి చెప్పాడు. హంఫ్రీ ఊటీ నుండి నవంబరులో తిరిగి వచ్చాడు. పోలీసు శాఖలో చేరాడు. తెలుగు చదువు సాగిస్తున్నాడు. ఒకనాడు మాస్టారు పాఠం మొదలు పెట్టేలోగా కాగితం పెన్సిల్ తీసుకుని ఒక బొమ్మ గీశాడు. ఒక పర్వతం. కొండ పైన ఒక గుహ. గుహ లోపల ఒక స్వామి, గుహకు ఎదురుగా ఒక వాగు ప్రవహిస్తోంది. ఆ బొమ్మ మాస్టారికి చూపించి “రాత్రి నాకు కలలో ఈ దృశ్యం కనిపించింది. దీని అర్థం ఏమిటి పండిట్?” అని అడిగాడు.

అది అరుణాచలమని, అది విరూపాక్ష గుహ అని, ఆయన రమణ అని గుర్తించడానికి నరసింహయ్యకు క్షణం పట్టలేదు. మహర్షి ఆత్మ విచారణ గురించి, ఆయన తపస్సు గురించి కొంచెం పరిచయం చేశాడు.

అది హంఫ్రీకి రమణ మహర్షి గురించిన తొలి పరిచయవాక్యం. తర్వాత హంఫ్రీ మొదటగా కలుసుకున్నది గణపతిమునిని. హంఫ్రీకి గణపతిముని పాండిత్యం పట్ల గొప్ప ఆరాధన ఏర్పడ్డది. 1911 నవంబరులో తిరువణ్ణామలైలో థియోసఫీ సమావేశాలు జరిగాయి. ఆ సభల్లో గణపతిశాస్త్రి ప్రసంగం విన్నాడు. అప్పుడే వారిరువురి పరిచయం. గణపతిముని స్వయంగా హంఫ్రీని వెంట తీసుకువెళ్లి మహర్షికి పరిచయం చేశాడు. రమణ మహర్షిని తొలిసారి తాను కలుసుకున్నప్పటి అనుభూతిని హంఫ్రీ ఇలా రాసి పెట్టుకున్నాడు –

“సెలవు పెట్టి తెలుగు మాస్టారితో కలిసి గణపతిశాస్త్రి గారిని చూడటానికి వెళ్లాను. శాస్త్రి గారూ, మాస్టారూ ఇద్దరూ మహర్షి శిష్యులు. మధ్యాహ్నం రెండు గంటల వేళ కొండపైన గుహను చేరుకున్నాం. మహర్షి గారి సన్నిధిలో కూర్చున్నాం. మాట లేదు పలుకు లేదు. అంతా మౌనం. నేను మౌనంగా కూర్చుని, కన్నార్పకుండా మహర్షినే చూచాను. నాలో ఏదో స్పందన. మనస్సులో ఉద్విగ్నత. ఆరాటం. అరగంటసేపు అలా చూస్తూ కూర్చున్నాను. అది ధ్యానమా? ధ్యాసంతా ఆయన మీద పెట్టడం ధ్యానమే కదా! శూన్యంలోకి మహర్షి, మహర్షిలోకి శూన్యంగా నేను  చూస్తున్నా. **ఆయనది భౌతిక శరీరం కాదు. అదొక ఆస్ట్రల్ బాడీ. అది ఏదో దివ్య పదార్థంతో తయారు కాబడిందనిపించింది నాకు.**

తర్వాత శాస్త్రి గారు నన్ను ఏదైనా అడగమన్నారు. ఏం అడగను? నాకేం కావాలో నాకు తెలిస్తే గదా, అడగడానికి. దివ్యత్వం గురించి, బోధన గురించి ప్రశ్నించాను– చిన్నపిల్లవాడిలా అమాయకంగా. మహర్షి పొడిపొడి మాటలు తెలుగులో, ఇంగ్లీషులో చెప్పారు. అవే నన్ను కుదిపివేశాయి, నన్ను వశపరచుకున్నాయి.

అక్కడి దృశ్యం నాకు ఆశ్చర్యం కలిగించింది. చిన్న పిల్లలు పదేళ్ల లోపు వాళ్లు కొండెక్కి వస్తారు. ఎవరూ పిలవరు వారిని. స్వచ్ఛందంగా వస్తారు. స్వచ్ఛంగా ఉంటారు. వచ్చి మహర్షి ఎదురుగా మౌనంగా కూర్చుంటారు. నిశ్శబ్దంగా లేచి వెళ్లిపోతారు. ఎందుకు వచ్చినట్లు? ఎందుకు పోయినట్లు? అది ప్రతి నిత్యం జరిగే పని. మహర్షి అవసరం పిల్లలకు ఏముంది? పిల్లలతో మహర్షికి ఏం పని? మహర్షిని మాటలతో వర్ణించడం అసాధ్యం, అసంభవం. ఆయన కరుణ, హుందాతనం, గాంభీర్యం మాటలకు అందనివి. మాటలలో పొదగలేనివి."

మహర్షికి హంఫ్రీకి మధ్య జరిగిన సంభాషణం :

హంఫ్రీస్ : నేను ప్రపంచానికి ఉపయోగపడగలనా?

మహర్షి : ముందు నీకు నీవు సహాయం చేసుకో. అదే ప్రపంచానికి నీవు చేసే సాయం.

హంఫ్రీస్ : లోకానికి నావల్ల మేలు జరగాలని నా కోరిక. నేను పనికిరానా?

మహర్షి : నిన్ను నీవు ఉద్ధరించుకుంటే, లోకాన్ని ఉద్ధరించినట్లే. నీవు లోకంలో ఒకడివి. నీవు వేరు – ప్రపంచం వేరు కావు. నీవు ప్రపంచానికి భిన్నం కావు – ప్రపంచం నీకు భిన్నం కాదు.

హంఫ్రీస్ : అవును నిజం.

మహర్షి : సర్వ సమర్పణ (ప్రపత్తి) ద్వారా ఆత్మను శోధించి గ్రహించు. నీవూ ఉన్నత స్థితికి చేరగలవు.

తర్వాత రెండు మార్లు హంఫ్రీస్ భగవాన్‌ని దర్శించాడు. రెండవసారి అంతర్‌ప్రేరణతో, ఎర్రని ఎండను లెక్కచేయకుండా వెల్లూరు నుండి తిరువణ్ణామలైకి యాభయ్ మైళ్లు సైకిలు తొక్కి వెళ్లాడు. రాఘవాచారి హంఫ్రీని మహర్షి గుహకు తీసుకువెళ్లాడు. అప్పుడు కృష్ణస్వామి అయ్యర్ అనే జిల్లా మున్సిఫ్ మహర్షి వద్ద ఉన్నాడు. ఆయనే ట్రాన్స్‌లేటర్‌గా వ్యవహరించాడు. ఆనాటి విషయాలు హంఫ్రీ ఇలా రాసుకున్నాడు డైరీలో :

"కొండపైకి వెళ్లి స్వామి గుహను చేరగానే, స్వామి నన్ను చిరునవ్వుతో స్వాగతించారు. నేను వస్తానని స్వామికి ముందుగా అనిపించిందేమో. గుహలో కూర్చునేలోపు వారొక ప్రశ్న అడిగారు. అది నా వ్యక్తిగత విషయం. ఎవరికీ తెలిసే అవకాశం లేదు. అంటే స్వామి వద్దకు వచ్చేవారి జాతకాలు వారికి ముందే తెలిసిపోతాయని కంగారు పుట్టింది నాకు.

"నువ్వింకా భోజనం చేయలేదు" సూటిగా అడిగారు.

అవునన్నాను. వారు భోజనం తెప్పించారు. అన్నం, కూరలు, నెయ్యి. చేతితో తినడం నాకు అలవాటు లేదు. నా అవస్థ చూచి స్వామి ఒక స్పూను తెప్పించారు నవ్వుతూ. స్వామి నవ్వు అద్భుతం.

తిన్నా నా ఆకలి తీరలేదు. మళ్లీ భోజనం తెప్పించారు. చివరకు వారి చేతితో ఒక పండు ఇచ్చారు. దాంతో నా ఆకలి తీరింది. వారికి అన్నీ తెలుస్తాయి. నేను ఆబగా భోజనం చేస్తున్నప్పుడు అక్కడ ఉన్న వారికి నా గత చరిత్ర చెప్పారు. వారి ముందు మన జీవితాలు తెరిచిన పుస్తకాలు. నా గత జన్మలు తెలిశాయి వారికి. ఆ రోజు మూడు గంటలు వారి సన్నిధిలో ఉన్నాను.

నాకు దాహం వేసింది. వారే ఒక భక్తునితో చెప్పి నిమ్మనీరు తెప్పించారు.

నేను బయలుదేరినపుడు వారు గుహ బయట వరకు వచ్చి సాగనంపారు.

"నీ ఇష్టం. ఎప్పుడైనా రావచ్చు" అన్నారు. నా మనస్సు శాంతించింది. ఎంతటి కరుణ. శిష్య వాత్సల్యం. మహర్షి సమక్షంలో సర్వం మరచిపోయాను.

మూడవసారి వెళ్లినపుడు హంఫ్రీస్ విన్నవించుకున్నాడు:

"ఉద్యోగం వత్తిడిలో ధ్యానం కుదరడం లేదు భగవాన్".

హంఫ్రీస్ : మాస్టర్! ఏదీ జ్ఞాపకం ఉండడం లేదు. మీరు చెప్పే విషయాలలో చివరిది మాత్రం జ్ఞాపకం ఉంటుంది. మిగిలినవి మరచి పోతున్నాను. ఏం చేయమంటారు?

మహర్షి : **ఉద్యోగంలో శ్రద్ధ పెట్టు. ధ్యానంలో మనస్సు పెట్టు. దేనినీ అలక్ష్యం చేయవద్దు.**

తర్వాత సంభాషణల్లో మహర్షి అనేక విషయాలు హంఫ్రీకి బోధించారు. వాటిని హంఫ్రీ భద్రపరచుకున్నాడు. అమూల్యసంపదలు కదా మహర్షి వాక్యాలు! అవి అందరికీ ఉపకరిస్తాయి.

## మాస్టర్ అంటే ఎవరు?

మాస్టర్ అంటే వేరే అర్థం లేదు – 'సద్గురువు' అనే అర్థం. **అన్యమైన దానిని ఆశ్రయించక, తనలోని ఈశ్వరాంశను లేదా ఆత్మను ఆరాధించి, ఆశ్రయించే వాడని సద్గురువు పదానికి అర్థం.** దివ్యత్వం అనే మహా సాగరంలో తన వ్యక్తిత్వాన్ని, అహంకారాన్ని సంగమింప చేసేవాడు సద్గురువు. అలా దివ్యత్వంలో సంలీనమై, తనకంటూ ఏమీ మిగుల్చుకోక దివ్యత్వంలో మునిగిపోయి సర్వాన్ని ఈశ్వరార్పితం చేసి ఈశ్వరునికి ప్రతినిధి అయినవాడు

సద్గురువు. మాస్టర్ పెదవి విప్పితే వచ్చే ప్రతిమాట ఈశ్వర సత్యమే. తానేదీ ఆలోచించడు. ఏదీ ప్రయత్నించడు. ఏదీ వాంఛించడు. సద్గురువుకు ప్రపంచంలో వాంఛించ తగింది ఉండదు. అన్ని పనులు అప్రయత్నంగా, మానసాతీతంగా, ప్రజ్ఞ ప్రభావంలో జరిగిపోతుంటాయి. సద్గురువు చేయి కదల్చినా అది ఈశ్వర ప్రణిదానమే అవుతుంది. **వాలుచూపు, జాలిచూపు ఎలా చూచినా అందులో కరుణ జాలువారుతుంది. చూపుతో అద్భుతాలు చేయగలడు సద్గురువు.** అవి మానసాతీత ప్రతిభలు. అవి అతీత మానస ప్రజ్ఞలు.

అలాంటి మహత్తుల గురించి మాస్టర్లు ఆలోచించరు. వాటిని ఆశించరు. ఆలోచించడం, ఆశించడం అవసరం లేని స్థితి వారిది. సాధకుని హృదయంలో సద్గురువుపట్ల నెలకొనే విశ్వాసం బట్టి అతీంద్రియ ప్రతిభలు లెక్కకు మిక్కిలిగా లభిస్తాయి. ఆ పనులు అప్రయత్నంగా, అసంకల్పితంగా, వాటంతట అవిగా ప్రకృతి ధర్మానుసారం జరిగిపోతుంటాయి. ఏ సద్గురువు ఏదీ సంకల్పించడు, ప్రకల్పించడు. తాను సుదూర ప్రాంతాలకు వెళ్లి దర్శనం ఇవ్వగలడు. మనసులోని భావాల్ని గ్రహిస్తాడు. అవేవీ కోరుకుంటే వచ్చినవి కావు. సాధకులు కోరదగినవీ కావు. సిద్ధులు, మహత్తులు, అతీంద్రియ శక్తులు లేకపోతే తపస్సు హాయిగా సాగుతుంది. సద్గురువు ఆత్మవివేచన వల్ల, ఆత్మవివేకం వల్ల వాటిని పొందగలడు.

కేవలం దీర్ఘకాల తపస్సు వల్ల, అవిరళ కృషి వల్ల గురువు వాటిని సాధించాడని అనుకోవడం భ్రమ. **ఏ సద్గురువు, ఏ మాస్టరు అతీంద్రియ శక్తులు తనకు కావాలని కోరడు. అసలు కోరికలు త్యజించకపోతే గురువు ఎలా కాగలడు? లోకులు అతీంద్రియ శక్తులను, సిద్ధులను గొప్పగా భావిస్తారు. అన్నింటి వెనుక ఉన్నది ఒకే శక్తి.** అది తపస్సాధన. మనం చూచేవన్నీ శాశ్వతాలనీ, చూడలేనివి అశాశ్వతాలనీ అనుకుంటాం. మాస్టర్లు కళ్లతో చూడలేని వాటిని జ్ఞానంతో చూస్తారు. వారికి అవి శాశ్వతాలు. చూచేవి ఎప్పటికైనా నశించేవే. శాశ్వతమైనది ఆత్మ. **ఆత్మపైన ధారణ చేస్తే, శాశ్వతత్వం లభిస్తుంది. అమృతత్వం సిద్ధిస్తుంది.**

క్షణం క్షణం మారే బాహ్య ప్రపంచం పైన మనస్సు నిలవదు. జీవితం, మృత్యువు, ప్రపంచం - మూడూ స్థిరత్వం లేనివి- నిలకడ లేనివి- శాశ్వతం కానివి. అవీ, ఇవీ చూడడం దేనికి? వాటన్నింటికీ మూలమైన దాన్ని చూస్తే చాలదా? అదే గమనిక రహస్యం. గమనికలో స్వారస్యం. ఎన్నో సంవత్సరాలు తపస్సు, యోగం చేస్తే గాని ఎవరూ సద్గురువు స్థాయికి చేరరు, మాస్టర్లు కాలేరు. రోజూ పావుగంట సాధన చాలు సామాన్యులకు. **"ఏది చూస్తుందో దానిపైన ధారణ చెయ్యి. అది నీలోనే వుంది. బయట ఎక్కడో లేదు. కనుక లోపలికి**

**చూడడం నేర్చుకో. అభ్యసించి, సాధన చేస్తే గాని అది పట్టుపడదు. దేనిపైన మనస్సు నిలవడం లేదన్న బాధ అవసరం లేదు. ఏదీ కాని దానిపైనే మనస్సు నిలపాలి. మనస్సులేని ధ్యాస ధ్యానంగా మారుతుంది.** ఫలితం కనిపించడానికి చాలా సంవత్సరాలు పడుతుంది. అయినా అయిదారు నెలల్లోనే ధ్యానం రుచి తెలుస్తుంది. శక్తి, సహనం సహజంగా లభిస్తాయి. ఆ శక్తి పుష్కలంగా లభిస్తుంది. **అంత శక్తి నీలో ఉన్నట్లు, నీకున్నట్లు, నీకే తెలియదు.**

## సిద్ధి : బుద్ధి

తపస్సు చేసినా, యోగం చేసినా ప్రతి ఒక్కరికీ అతీంద్రియ శక్తులు, సిద్ధులు కలుగుతాయని చెప్పలేం. బుద్ధి మారడం తథ్యం. మనస్సు మంచి మార్గంలో పడుతుంది. మంచి బుద్ధి కలిగితే చాలదా, వేరే గురువు ఎందుకు? సద్బుద్ధి సద్గురువు చేసినంత సహాయం చేస్తుంది. సిద్ధులు ఎందుకు? ప్రతి పనికి ఫలితం ఆశించకూడదు. పనిచేయడం వరకే మనకు పర్మిషన్. ఫలితం ఇలా కలగాలన్న 'డిమాండ్' చేయకూడదు. బుద్ధి కలిగితే సిద్ధి కలిగినట్లే. ధ్యానం కుదిరితే మోక్షం లభించినట్లే.

**ధ్యానానికి కూర్చుని మనస్సు గురించి, శరీరం గురించి, చుట్టూ ప్రపంచం గురించి ఆలోచించడం మానుకో.** అవి ఈశ్వరీయతకు ప్రతినిధులు కావు. మనస్సు గురించి పూర్తిగా మరచిపో. **అసలు నీకో మనస్సు లేదనుకో. అప్పుడు శరీరం, మనస్సు మాయమైపోతాయి.** మిగిలేది ఆత్మ స్పృహ మాత్రమే. అది మాటలకు, వర్ణనకు అందదు. ఆ స్థితిలో సదా ఉండగలిగినవాడు సద్గురువు – సద్గురువే మాస్టరు.

## మతం : స్వగతం

సద్గురువుకు 'మతం' అన్నది గతించిన 'గతం'. ఏ గురువు మతం నీడన నిలబడి తపస్సులో ప్రగతిని సాధించలేడు. మనుగడ సాగించ గలడు, కీర్తి గడించ గలడు. దివ్యత్వాన్ని సాధించలేడు. **సద్గురువు మతానికి అతీతుడు. మేధావి తత్వానికి అతీతుడు.** ఏ గురువు మనస్సును విశ్వసించడు. మనస్సుతో ఆలోచించడు. **మతం ఎందుకు? అదొక పిల్ల చేష్ట, చాపల్యం. సామాజిక భద్రత కోసం మతం.** కొన్ని కష్టాలు రాకుండా మతం అడ్డుపడుతుంది. **యోగాగ్ని మనిషి కల్మషాలను కడిగివేస్తుంది. కర్మలను కాల్చి వేస్తుంది. విజ్ఞత, వివేకం కలిగిస్తుంది. భ్రమల్ని పూర్తిగా తొలగించి సత్యం వైపు నడిపిస్తుంది.** అన్ని మతాలు ఒక్క శిఖరానికి చేర్చేవే. అక్కడ అన్ని బాటలు ఆగిపోతాయి. ఆ తర్వాత శూన్యంలో ప్రవేశించ వలసిందే ... ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందదలిస్తే.

## ఈశ్వరుడు

వలయంగా తిరిగే అన్ని మతాలకు కేంద్ర బిందువు ఒక్కటే భగవంతుడు. పేర్లు వేరైనా భగవంతుడు ఒక్కటే. భగవద్విలాసం ఒక్కటే. అందరిలో భగవదంశ ఉంటుంది. ప్రపంచంలో అన్ని తావుల ఈశ్వరీయత ఉంటుంది. ఆ భావనతో ధ్యానం మొదలవుతుంది. **దృశ్య ప్రపంచాన్ని అదృశ్యం చేయడమే ధ్యానం.** భగవంతుడు అంటే అనంతశక్తి. ఈశ్వరీయత సర్వవ్యాపకం. ఆస్తి, నాస్తి రెండూ భగవత్కల్పితాలే. అసలు జ్ఞానం మన లోపల నుండే ఉద్భవిస్తుంది. జ్ఞానం అన్నది 'తెలుసుకోవడం' వల్ల కలగదు. 'దర్శనం' వల్ల లభిస్తుంది. అది అంతర్దర్శనం.

## ఆత్మదర్శనం

ప్రజ్ఞ ప్రభవించడం ఒక్కటే ఆత్మదర్శనానికి నిదర్శనం. **భగవంతుని దర్శించడం అంటే మనలోని ప్రజ్ఞను తెలుసుకోవడం, వెతికి పట్టుకోవడం. భగవంతుడు అన్నది ఒక సంకేతం మాత్రమే.**

ఒక కాన్వాసుపైన చిత్రకారుడు బొమ్మగీస్తాడు. రంగులు అద్దుతాడు. దీపం వెలుగులో ఆ బొమ్మ అందంగా కనిపిస్తుంది. లైటు ఆర్పితే బొమ్మ, రంగులు ఏవీ కనిపించవు. అంతా చీకటి మయం. జీవితమూ అంతే! 'కాంతిని' భగవంతుడు అనుకుందాం. మనిషి చేసే పనులన్నీ చిత్రాలు. మన మనస్సు కాన్వాసు లాంటిది.

సద్గురువు ధ్యానంలో మనసుపైన ధ్యాస నిలపడు. మనసు దాటి పోతేనే మహాత్ముడు. మనస్సు దాటి ఆత్మ దిశగా పయనం సాగాలి. అసలీ లోకాన్ని గురించిన స్పృహ ఉంటేనే ఆలోచనలు, అనుమానాలు. లేకుంటే అంతా ఆత్మగతమే.

## ఏది పాపం!

ఏది పాపం? అసలు పాపం అంటే ఏమిటి?

ఒక తాగుబోతు ఉన్నాడు. తను చేసిన తప్పుడు పనులు మరచిపోడానికి తాగుతాడు. మనిషిలో భగవదంశ ప్రవేశిస్తే ఎవరూ తప్పులు చేయరు. తాగడం వల్ల పాపం పరిహారం కాదు. శరీరం, మనస్సు ఆత్మకు సంబంధం లేనివి.

## ధ్యానం అంటే ...

భగవంతుని ఎలా ఆరాధించాలి! ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క తీరు. ఒక్కొక్క రీతి. సర్వం సమర్పించుకోవడం గొప్ప ఆరాధన. అది తపస్సు. మనసా, వాచా అంటారు – ఆ రెండింటిని ప్రక్కన పెడితే చాలు మిగిలేది తపస్సే. సర్వం తపోమయమవుతుంది. జీవితం తపో నిలయ మవుతుంది.

 

## 19. ఎవరికెవరు ఈలోకంలో

**కాతే కాంతా కస్తే పుత్రః సంసారోయ మతీవ విచిత్రః ।**
**కస్య త్వం వా కుత ఆ యాతః తత్వం చింతయ తదీదం భ్రాంతః ॥**

*ఎవరు నీ భార్య? ఎవరు నీ కుమారుడు? సంసారమే పెద్దభ్రాంతి.*
*నీవు ఎవరి కొడుకువి? ఎక్కడ నుండి వచ్చావు? ఆలోచించు!*

**మన** దేశంలో కుటుంబ వ్యవస్థ చాలా విలువైంది. పటిష్టమైంది. మన వారికి అనుబంధాలు, ఆత్మీయతలు ఎక్కువ. ఎవరు ఎలాపోతే మనకేం అనే మనస్తత్వం ఈ దేశంలో లేదు. అంతా మనవాళ్లే. అంతా అయినవాళ్లే. అంతటి గాఢానుబంధం మనది. అది ఆత్మానుబంధం కూడా. సంసార పక్షంగా జీవించే వారికి సరే! సర్వసంగపరిత్యాగులైన సన్యాసులకూ ఆత్మీయబంధాలు తప్పవని పిస్తుంది. **కొన్ని వదులుకుంటే తప్ప, విలువైనవి మరికొన్ని లభ్యంకావు.** మనదేశ సంస్కృతీవిభవానికి ఆధ్యాత్మికత్వం పునాది. వేదాంతం గోడలు. మహాత్ములకు ఈ భవబంధాలు, అనుబంధాలు ప్రతిబంధకాలవుతుంటాయి. వైరాగ్యానికి సంసారం పెద్ద అవరోధం. మహా మహావారికే ఈ అవరోధాలు తప్పలేదు. అనుబంధాలను వదులుకుని, అవరోధాలను అతిక్రమించడం మహాత్ములకు, మహర్షులకే సాధ్యం!

కుటుంబ బంధాలు ఎంత జటిలమో, మతం, ఆచారాలు అంతకంటే కఠినంగా ఉంటాయి. కుటుంబాన్ని వదిలించుకోవచ్చునేమో గానీ మతాన్ని, ఆచార,

సంప్రదాయాలను వదిలించుకోవడం దుస్తరం, దుస్సాహసం అనిపిస్తుంది. మతం వెన్నంటి కులాలు, అసమానతలు, ఆచారాలు, మడి, మైల, సంప్రదాయం ఉక్కు గోడలు లేపుతాయి. వాటిని దాటడం అంత సులభం కాదు. మన పురాణ పురుషుల, మహర్షుల చరిత్రలు చూస్తే అందరూ ఈ విషపు కోరల్లో చిక్కినవారే కనిపిస్తారు. కుటుంబాలు త్యజించి, అరణ్యాల బాటలుపట్టి, వైరాగ్యంతో సన్యసించిన వారే కనిపిస్తారు. నానా అవస్థలు పడ్డవారే అందరూ. ఏ పని చేయాలన్నా సెంటిమెంట్లు అడ్డుగా నిలుస్తాయి. మత సంప్రదాయాలు మరింత ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ఒక మతం తాను పట్టిన కుందేలుకు మూడు కాళ్లంటే, మరొకరి మతం అసలు కాళ్లే లేవని వితండవాదం చేస్తుంది.

సన్యాసానికి, వైరాగ్యానికి 'ప్రేమ' పెద్ద అవరోధం. భార్య బిడ్డలు ఒకవైపు, అమ్మా నాన్నలు రెండో వైపు ప్రేమబంధాలతో పట్టి వేస్తారు, కట్టి పడేస్తారు. గౌతమ బుద్ధుడు, శంకరాచార్య, కృష్ణచైతన్య అందుకు ప్రత్యక్ష నిదర్శనాలు. ఇటీవలి కాలంలో రమణమహర్షి, అరవిందయోగి, రామకృష్ణ పరమహంస మరొకరకంగా మహనీయులు. వీరిలో ఎవరి మార్గం వారిది. ఒకరితో మరొకరిని పోల్చడానికి లేదు. వారి బోధనల్లోను హెచ్చుతగ్గులు కనిపిస్తాయి. ఆంతర్యం ఒక్కటే కావచ్చు కానీ మాట వేరు, ఆచరణ మార్గాలు వేరు వేరు.

విత్తనం మొలకెత్తిన తర్వాత దానికి రక్షణ అవసరం. తీగకు ఆధారం అవసరం. ఏ పొదచాటునో మొక్క సురక్షితంగా ఎదుగుతుంది. పెరిగిన తర్వాత దానికి ఎలాంటి రక్షణ అవసరముండదు. సాధకునికి ఎదిగే సమయంలో గురురక్షణ కావాలి. ఎదిగిన తర్వాత అవసరముండదు. **నా స్నేహితులు, నా బంధువులు అనే మమతలు పంచుకున్నంతకాలం, అనుబంధాలు పెంచుకున్నంత కాలం సాధకుడు ఎదగడు. అతనిలో ఆధ్యాత్మికత పరిమళించదు. చిన్నచిన్న బంధాలను ముందుగా త్రుంచివేసుకోగలగాలి. నావారు అన్న ధ్యాస పోవాలి.** వీరెవరు? నేనెవరు? వీరికి నాకు ఏం సంబంధం? అని ప్రశ్నించుకుంటూ ముందుకు సాగాలి. ఆధ్యాత్మికత గలవారు గురువుల్ని ఆశ్రయిస్తారు. జిజ్ఞాస కలవారితోనే స్నేహం చేస్తారు. మంచి విషయాలు వింటారు. మంచి పుస్తకాలు, ఆధ్యాత్మ గ్రంథాలు మాత్రమే చదువుతారు. అందువల్ల మానసిక వికాసం కలుగుతుంది. వికారాలు తగ్గుతాయి.

తనలో వైరాగ్య భావం బలపడినప్పుడు, పరిణతి చెందినప్పుడు, ఈశ్వరునిపై అపార విశ్వాసం ఏర్పడుతుంది. బంధాలు అవే తెగిపోతాయి. వైరాగ్యం ఏర్పడుతుంది. ఎన్ని కష్టాలైనా ఎదుర్కోడానికి సిద్ధపడతాడు. సర్వసమత్వం,

సర్వహితత్వం, సమచిత్తత్వం ఏర్పడతాయి. అప్పుడే అసలు సిసలైన జ్ఞానం చివురు తొడుగుతుంది.

★ ★ ★

1900లో తిరువణ్ణామలై వెళ్లి వచ్చిన వెంటనే నాగస్వామి కాలం చేశాడు. మహర్షి కాలాతీతుడు కనుక విచారించలేదు. చిన్న తమ్ముడు నాగసుందరం చిన్నవాడు. ఇంకా లోకానుభవం లేనివాడు. పైగా అతనికి చిన్నప్పటి నుండి మూర్ఛల రోగం. పెద్దయిన తర్వాత ఆ రోగం తగ్గింది. ఏదో దైవభక్తి తప్ప పట్టుదల లేదు. తర్వాత తంజావూరు జిల్లా తిరువేంగడు ఆలయంలో చిన్న ఉద్యోగం దొరికింది. 1902లో అన్నగారిని చూడటానికి వచ్చాడు. అప్పుడు మహర్షి సద్గురు స్వామి గుహలో ఉన్నాడు. మౌనం పాటిస్తున్నాడు. ఎవరితో మాట్లాడడు. ఎవరినీ గుర్తించడు. అన్నగారి పరిస్థితి చూచి నాగసుందరం ఏడ్చాడు. కాని మహర్షిలో ఏ వికారం లేదు. ఈ బంధాలన్నీ ఎప్పుడో వదిలించుకున్న విరాగి. తను అక్కడే ఉంటానని అడిగాడు. మహర్షి అంగీకరించక, ఇంటికి వెళ్లి పొమ్మని పంపివేశాడు. కన్నతల్లిని ఎవరు చూచుకుంటారు?

తర్వాతి కాలంలో మహర్షి తల్లి అళగమ్మాళ్, ఇతర బంధువులు అప్పుడప్పుడు తిరువణ్ణామలై రాసాగారు. ఆమెకు యాత్రల పిచ్చి. తిరుపతి వేంకట రమణుడంటే ఇష్టం. కాశీ యాత్ర చేసివస్తూ 1914లో తిరుపతి నుండి తిరువణ్ణామలై వచ్చింది. అప్పుడు విరూపాక్ష గుహలో కొన్నాళ్లు ఉండిపోయింది. అప్పుడే టైఫాయిడ్ వచ్చి, రెండు మూడు వారాలు పడకేసింది. రమణ మహర్షి పట్టించుకోక తప్పలేదు. ఇతరులకు ఏమాత్రం కష్టం కలిగినా బాధపడే స్వభావం. మహర్షి తల్లికి సేవచేశాడు. కన్నతల్లి ఆరోగ్యం విషమించినపుడు అమ్మను రక్షించమని అరుణాచలేశ్వరుని స్తుతిస్తూ నాలుగు గీతాలు రాశాడు. అళగమ్మాళ్ ఆరోగ్యం చక్కబడిన తర్వాత మనమదురై వెళ్లిపోయింది. అక్కడ పరిస్థితులు బాగాలేవు. అప్పుల బాధ ఎక్కువై తిరుచ్చుళిలో ఇల్లు అమ్మవలసి వచ్చింది. మరది నెల్లియ్యప్పన్ మరణించాడు. ఉమ్మడి కుటుంబం దారుణంగా దరిద్రావస్థకు చేరింది. 1915లో నాగసుందరం భార్య కాలం చేసింది. అళగమ్మాళ్ వయసు మీరింది. పైగా నిస్సహాయ. మహర్షిని ఆశ్రయించక తప్పని పరిస్థితి. అప్పటికి రమణ మహర్షికి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. భక్తులు, శిష్యులు ఎక్కువైనారు.

1916లో అళగమ్మాళ్ తిరువణ్ణామలై వచ్చి చేరింది. కొన్నాళ్లు ఎచ్చమ్మాళ్ ఇంట కాలం గడిపింది. ఆమెకు కొడుకుతో కలిసి ఉండాలని కోరిక. కాని భక్తులు భయపడ్డారు. అయినవారు కనిపిస్తే భగవాన్ పారిపోతారు. 1896లో

స్వామి అలానే చేశారు. అయితే అప్పటికీ ఇప్పటికీ పరిస్థితులు మారాయి. ఇరవై సంవత్సరాలు గడిచాయి. మహర్షి ఇప్పుడు అందరితో మాట్లాడుతున్నారు. భక్తుల సందేహాలు తీరుస్తున్నారు. ఆనందంగా, నవ్వుతూ అందరిలా ఉంటారు. ముసలి తల్లి రక్షణ మహర్షికి తప్పలేదు. ఎవరికైనా తల్లి రుణం తీర్చుకోక తప్పదు గదా! కొన్నాళ్లు కొండ దిగువన గడిపి, తర్వాత స్కందాశ్రమం చేరింది. విరూపాక్ష గుహలో మకాం పెట్టింది. విరూపాక్ష గుహవదలి స్కందాశ్రమం చేరినప్పుడు మహర్షితో పాటు తనూ మారింది. మహర్షి అయినా తనకు కన్నబిడ్డడే కదా!

మహర్షి నీడన చేరినా, అళగమ్మాళ్‌కు చిన్నకొడుకుపైన ప్రేమ తగ్గలేదు. అతను తన కళ్ల ముందే ఉండాలని పట్టుపట్టింది. నారాయణరెడ్డి అనే ప్రియశిష్యుని పంపి చిన్నకొడుకును పిలిపించుకుంది. అలా వచ్చి చిన్నస్వామి హోదా సంపాదించాడు నాగసుందరం. మొదట తనూ, ఆశ్రమవాసుల ఆనవాయితీ ప్రకారం పట్టణంలోకి వెళ్లి భిక్ష చేసేవారు. సన్యాసిగా జీవించదలచిన వారికి 'భిక్షాటన' నామోషీ కాదు. లజ్జ, అభిమానం, అహంకారం వదిలితే తప్ప ఎవరూ భిక్షాటన చేయరు. అవి సన్యాసికి అవసరం. భిక్షాటన విరమించిన తర్వాత, సన్యసించి, నిరంజనానంద అవతారమెత్తాడు. చిన్నస్వామిగా మన్ననలందు కోసాగాడు. ఆశ్రమానికి వచ్చి చేరిన వెంటనే అళగమ్మాళ్ వంట కార్యక్రమం ప్రారంభించింది. ఆమెకు మడి, మైల పట్టింపు లెక్కువ. తనకోసం కాస్త మడిగా వండుకునేది. మహర్షికి, ఆయన భక్త జనానికి వేరే వండి వార్చేది.

హిమాలయాల్లో చాలామంది సాధు సన్యాసులు, రుషులు ఉంటారు. ఎవరూ పొయ్యి వెలిగించరు. వంటలు చేసుకోరు. దక్షిణ భారతంలో ఆ సంప్రదాయం లేదు ... వంట గొడవలు పెట్టుకుంటే గృహ వాతావరణం వస్తుందని. శేషాద్రిస్వామి అనేవారు కాస్త వ్యంగ్యంగా రమణ మహర్షి కోసం వచ్చిన భక్తులతో "ఊ వెళ్లిచూడండి. చూచి తరించండి. అక్కడ ఓ కొత్త గృహస్తు కనిపిస్తాడు. మీకు స్వీట్లు తినిపిస్తాడు వెళ్లండి".

నిజమే. మహర్షి ఆశ్రమం ఒక అన్నసత్రంలా ఉండేది అప్పుడు. వంటలు, భోజనాల హడావుడి. ఎవరూ ఓ గంట ధ్యానం చేసినట్టు కనపడదు. ఇదంతా పైకి కనిపించే తంతు. వీటితో మహర్షికి ఏమాత్రం సంబంధం ఉండేది కాదు. ఆయన ఏదీ కావాలనలేదు, ఆమోదించనూ లేదు. చేస్తే వద్దు అనడు. వద్దన్న పని చేయాలనుకోవడం మనిషి నైజం. అనవసరంగా పట్టుదలలు పెరుగుతాయి.

అళగమ్మాళ్ ఓ పిచ్చి మాలోకం. మహర్షికి అయినా గానీ, తన చాదస్తం వొదలదు. ఇంకా 'నా కొడుకు, నా కొడుకు' అంటుంది. మహర్షి అయితే మాత్రం

నా కొడుకు కాకుండా పోతాడా? అంటుంది. అది వ్యామోహం, పేగు బంధం. తను ప్రేమించి నంతగా కొడుకులు తనను ప్రేమించాలని ఆశిస్తుంది. ఎవరికీ ఏ అనుమానం రాకుండా మహర్షి కొన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. అళగమ్మాళ్ ఏదైనా అడిగినా ముభావంగా ఉండేవాడు. ఎటో చూస్తూ సమాధానం చెప్పేవాడు కాదు. అందరిలో ఉన్నప్పుడు ముక్తసరిగా పలకరించేవాడు. "నీవు ఒక్కదానివే నాకు అమ్మవు కావు. తల్లీ... ఆడవారంతా నాకు మాతృసమానులే" అనేవాడు.

మహర్షి మనస్సు, తత్వం ఆమెకు అర్థం కావు. ఆమెకున్న ప్రాపంచిక మమకారాలు, వ్యామోహాలు, భ్రాంతులు తొలగించాలని ఆయన సంకల్పం. అసమానతలు కూడదని, వైరాగ్యం అవసరమని పరోక్షంగా తెలియచెప్పేవాడు. మాటల్లో, చేతల్లో, హావభావాల్లో వ్యక్తపరచేవాడు. ఆమెకు 'మతం' పెట్టనికోట లాంటిది. ప్రయాగ, తిరుపతి దర్శించింది. అనేక పుణ్యక్షేత్రాలు చూచి వచ్చింది. దక్షిణామూర్తి స్తోత్రం కంఠతా వచ్చు. కట్టలు తెంచుకునే దైవభక్తి ఆమెది. ఆరు సంవత్సరాలపాటు మహర్షితో కలిసి ఉన్నా వండి పెట్టడంలో ఉన్న శ్రద్ధ ఆయన బోధలు, వైఖరి అర్థం చేసుకోవడంలో లేదు. భక్తులకు మహర్షి చెప్పే మాటలు విని మరచిపోయేది. కాషాయ చీరకట్టి సన్యాసిని వేషంలోకి మారింది కాని మనస్సు సన్యసించలేదు. కొంత కాలానికి మార్పు రాసాగింది. పూర్వ వాసనలు తగ్గాయి. మరో రెండు మూడు సంవత్సరాలకు పోతుందనగా తరచు జబ్బుచేసేది. మనో నిగ్రహం పెరగడంవల్ల మృత్యు వంటే భయం పోయింది. హాయిగా తనువు చాలించడానికి సిద్ధపడ్డది. అంతిమ వైరాగ్యం ఆమెది. మహర్షి సదా ఆమె ప్రక్కనే కూర్చుని రాత్రింబవళ్లు పరిచర్య చేస్తుండేవాడు. తనకు నిద్ర అవసరం లేదు. విశ్రాంతి అవసరం లేదు. కడపటి దినాల్లో మహర్షి ఆమెకు చేసిన సేవ చిరస్మరణీయం. అందరికీ ఆదర్శప్రాయం.

1922 మే లో అళగమ్మాళ్ ఆరోగ్యం పూర్తిగా చెడింది. ఏ మందులు పనిచేయని పరిస్థితి. రమణ మహర్షి ఆమె మంచం ప్రక్కనే కూర్చున్నారు. వైశాఖ బహుళ నవమి. ఆనాడు ఆమె నిర్యాణం చెందుతుందని మహర్షికి అనిపించింది. చేయగలిగినంత చేశాడు. కన్నతల్లి కోసం మృత్యువుతో దెబ్బలాడలేదు గదా! అన్నీ ప్రకృతి ధర్మానుసారం, మనిషి కర్మానుసారం జరుగుతుంటాయి. ఆయన నిగ్రహానికి ప్రతినిధి, అనుగ్రహానికి మాందాత. ఎగసిపడుతున్న గుండెను తన చేతితో అదిమిపట్టి చూచాడు. శ్వాస ఊర్ధ్వగతిని సాగుతోంది. దానిని హృదయ కుహరంలోకి పంపే ఏర్పాటు చేశాడు తన సంకల్పంతో, తపశ్శక్తితో. శ్వాస మందగించడంతో అంతిమ ఘడియలు సమీపించాయని తెలిసింది. **ఎడమచేతితో తల్లి శిరస్సును పట్టుకుని ధ్యానం చేయసాగాడు.** శిష్యులు రామనామం జపించారు.

కొందరు వేదపఠనం చేశారు. 1922 మే రాత్రి 8 గంటలకు ఆమె అంతిమశ్వాస విడిచింది.

ఆమెకు అవసాన కాలం సమీపించినందువల్ల పగలంతా మహర్షి ఆమె ప్రక్కనే ఉన్నారు. భోజనానికి లేవ లేదు. ఆశ్రమంలో ఎవరూ భోజనం చేయలేదు. చీకటిపడే సమయానికి వంట అయింది. మిగిలిన వారిని వెళ్లి తినమన్నారు. ఎవరూ వెళ్లలేదు. ఆమె ఆత్మ విముక్తి చెందిన తర్వాత భారంగా నిట్టూర్చారు. అప్పుడు లేచి, "అంతా అయిపోయింది. మనం వెళ్లి భోజనం చేయవచ్చు, మనకు మైల లేదు" అన్నారు.

కొందరు శిష్యులు భోజనాలు చేశారు. శవం పక్కన ఉంటే భోజనం ఎలా సహిస్తుంది సనాతనులకు, సదాచార పరులకు! తల్లి చనిపోయిన బాధ మహర్షిలో ఏ మాత్రం కనిపించలేదు. ఆ రాత్రి సంఘటన గురించి శిష్యులు కొందరు ఇలా రాసి పెట్టుకున్నారు.

"స్వామి ఇప్పుడు చాలా ఆనందంగా ఉన్నారు. నిశ్చింత. రాత్రంతా భక్తులు భగవాన్‌తో కలిసి 'తిరువాచకం' గానం చేస్తూ కూర్చున్నారు. ఇప్పుడు పూర్తి స్వతంత్రం. తల్లి గారి అవరోధం, ఆలోచన లేవు. ఇంక తన ప్రస్థానం ఆగే పని లేదు".

తల్లిగారి మరణం వల్ల మహర్షి బాధపడకపోవడం చాలా మందికి నచ్చలేదు. మృత్యువంటే ఏమిటి? విచారించడం ఎందుకు? అని ఎవరూ ఆలోచించరు. ఆ క్షణంలో తిరిగిరాని లోకాలకు జీవుడు పయనించడమే కదా మృత్యువు. ఆ రహస్యం తెలియనివారు ఏడుస్తారు. కన్నీరు కార్చి విలపిస్తారు. భగవాన్ సర్వసాక్షి, సర్వం ఎరిగిన మహర్షి. ఆయనకు విచారమా! విడ్డూరం!

**సత్యాన్ని గుర్తించడం ఆధ్యాత్మిక రంగంలో మొదటి ప్రకరణం. సత్యశోధన, అవగాహన ఎంతగా వేగం పుంజుకుంటే అంత త్వరగా మనిషికి నిజాన్ని నిర్భయంగా ఆమోదించగల స్థైర్యం కలుగుతుంది.**

ఆ దృష్టితో లేదా అంతర్దృష్టితో వీక్షిస్తే, పరిశీలిస్తే మహర్షి మనోగతం అర్థ మవుతుంది ఎవరికైనా. ఆ సంస్కారం ఎందరికుంటుంది? ఆశ్రమాలను అతుక్కుని బ్రతికినంత మాత్రాన సంస్కారం అబ్బుతుందా? ఆత్మశోధన ఉండవద్దా? ఆయన దృష్టిలో మృత్యువు ఒక ఘటన. మరణం ఒక సంఘటన. రెండుసార్లు తను అనుభవించాడు కనుక భయపడవలసిన అవసరం లేదు. అనుభవం నేర్పిన పాఠం.

"వాచారంభణం నామధేయం". రూపం మారడం తప్ప మృత్యువంటే వేరే అర్థం లేదు. ఒక పేరు పోయి మరొక పేరు వస్తుంది. ఒక రూపం పోయి మరొక రూపం ధరిస్తుంది. అంతకు మించి మౌలికమైన మార్పు జరగదు. జననం,

మరణం అన్నవి ఒకే ఘటనకు రెండు కొనలు. ఒకే నాణానికి రెండు పార్శ్వాలు. అదే వచ్చే మార్పు. మృత్యువుకు అతీతమైనది ఏదైనా ఉంటుందా? ఉంది. సత్యం. అది మాత్రమే వాస్తవం. మహర్షి ఈ మహత్తర సత్యాన్ని ఎప్పుడో గుర్తించారు. భౌతికమైన హద్దుల్ని ఎన్నడో అతిక్రమించారు. అందుచేతనే తల్లి అళగమ్మాళ్ మృతి ఆయనను ఏ మాత్రం బాధించలేదు.

అవును అళగమ్మాళ్ మృతి చెందింది. అంటే ఏమైనట్లు? మృత్యువు తర్వాత ఏమి జరిగినట్లు? భౌతిక శరీరం వదలిన తర్వాత మనిషి ఏమవుతాడు? రమణ మహర్షి దృక్పథం పాతిక, ముప్పయి సంవత్సరాల క్రితం వేరు. అళగమ్మాళ్ మృతి నాటికి వారి మనఃస్థితి వేరు. దృక్పథంలో మార్పు వచ్చింది. మొదట ఉన్న వైరాగ్యం ఇప్పుడు లేదు. తపస్సుకు సన్యాసం పుచ్చుకోనవసరం లేదు. గృహస్తులు సులభంగా గమ్యం చేరగలరని బోధించసాగాడు. కన్నతల్లి పట్ల రమణునికి మొదట ఉన్న విముఖత ఇప్పుడు లేదు. తమ్ముని విషయంలోనూ దయ చూపిస్తున్నాడు. ఇప్పుడు ఎవరిపైన అయిష్టత లేదు. పెద్ద ఇష్టతా కనిపించనీయడు.

కఠోపనిషత్‌లో నచికేతుడు యముని అడిగిన ప్రశ్న అదే. బృహదారణ్యకోపనిషత్‌లో జరత్కారవ అర్ధభాగ యాజ్ఞవల్క్యుని అడిగిన ప్రశ్న అలాంటిదే. సమాధానం రెండు రకాలు :

**మొదటి సమాధానం :** వ్యవహారంలో చూస్తే మృత్యువు తప్పనిసరి. మృతి తర్వాత ఆత్మ పైలోకాలను ఆశ్రయిస్తుంది. పుణ్యాత్ములు పుణ్యలోకాలకు, ఊర్ధ్వ లోకాలకు చేరుతుంటారు. పుణ్యం చేసుకోనివారు తిరిగి వెంటనే మనుష రూపంలో జన్మిస్తుంటారు. మహాపాపులు జంతువులుగా జన్మిస్తారు.

**రెండవ సమాధానం :** పారమార్థిక దృష్టితో చూస్తే మృత్యువు మిథ్యా జ్ఞానం వల్ల కలుగుతుంది. నానాత్వం వల్ల కలుగుతుంది. అంటే సత్యాన్ని, ఈశ్వరుని, బ్రహ్మన్ని అర్థం చేసుకోకపోవడంవల్ల కలిగే భ్రమ 'మృత్యువు'. భిన్నత్వ, నానాత్వ దృష్టిపోయి 'ఏకాత్మ' భావన బలపడితే 'పరమాత్మ' తత్వం తెలుస్తుంది. అప్పుడు మృత్యువు మరణిస్తుంది. అమృతత్వం నిలబడుతుంది.

***యం యం వాపి స్మరన్భావం త్యజ త్యంతే ఫలేబరం***
***తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః. – భగవద్గీత***

*ఆత్మ శరీరాన్ని వదిలిపెట్టే క్షణంలో ఏ విధంగా భావిస్తుందో, ఏది సంకల్పిస్తుందో ఆ భావం రూపుదిద్దుకుంటుంది.*

ఆమె అవసాన సమయంలో రమణ భక్తులు 'రామ' స్మరణం చేశారు. వేదపఠనం చేశారు. చివరి వరకు భగవన్నామ స్మరణ చేస్తూనే ఉన్నారు. మహర్షి

తన స్పర్శతో ఆమె హృదయ కుహరంలోకి అనంత శక్తిని అనుగ్రహించారు. ఆమె కర్మ విముక్తికి సంపూర్ణంగా సహకరించారు.

ఆమె అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు సాక్షీమాత్రంగా ప్రక్కన నిలబడి మౌనం పాటించారు. తను నిర్వహించ వలసిన 'కర్మ' ముందుగానే నిర్వహించారు. కన్న తల్లికి మోక్షప్రాప్తి కలిగించడం కన్న కొడుకు చేయవలసిన పని. వార్త తెలిసిన వెంటనే చూత గుహ నుండి గణపతిముని వచ్చారు. అళగమ్మాళ్‌ను సమాధి చేయాలన్న నిర్ణయం జరిగింది. భక్తులు వాహనం తయారు చేసి ఆమె శవాన్ని కొండపై నుండి పాలితీర్థానికి చేర్చారు. ఎంత రహస్యంగా ఉంచినా 'అమ్మ' గారి మరణవార్త బయటకు పొక్కింది. చుట్టు ప్రక్కల గ్రామాల జనం గుంపులుగా వచ్చారు.

శ్మశానం దాపున ఒక గుంట తీసి శవాన్ని గుంటలో కూర్చో బెట్టి విభూతి, ఉప్పు, కర్పూరం, సుగంధాలు వేసి పూడ్చి, ఆపైన రాళ్లతో సమాధి నిర్మించారు. మహర్షి ఆ సమాధిపైన ఒక శివలింగాన్ని నిలిపారు. ఆనాటి నుండి అళగమ్మాళ్ మాతృభూతేశ్వరిగా ఆరాధించబడుతోంది. ఆ సమాధిపైన ఒక దేవాలయం నిర్మించబడింది. కాలక్రమంలో మహర్షిలో వచ్చిన మానవతా దృక్పథానికి ఒక ఉదాహరణ. ఏకాంతంలో తపస్సు చేసుకోవడం కాక, ప్రజలకు అందుబాటులో ఉండి వారిని ఆదుకోవాలన్న భావం అప్పుడే కలిగింది.

ఒకసారి మైలాపూర్ నుండి శేషగిరి అయ్యర్ కుటుంబ సమేతంగా స్వామి దర్శనానికి వచ్చాడు. కొన్నాళ్ళు స్వామితో గడపడంతో ఆత్మీయత పెరిగింది. తిరిగి వెళ్లేరోజు శేషగిరి భార్య స్వామికి నమస్కరించి వెక్కివెక్కి ఏడవసాగింది. మహర్షిని వదలి వెళ్లాలంటే బాధ. ఆమెను చూస్తే మహర్షికి కళ్లనీళ్లు తిరిగాయి. కన్నీరు నిగ్రహించుకుని అన్నారు: "ఎందుకు తల్లీ విచారం. నీవు వెడుతున్నది అరుణాచలానికే అనుకో" గొప్ప ఊరడింపు. గొప్ప సూత్రం. తానున్నచోటునే అరుణాచలంగా భావించ గలిగితే ఈశ్వరుడు మన హృదయంలో ఉన్నట్లే గదా!

భక్తిమార్గంలోంచి జ్ఞానమార్గంలోకి మళ్లడం అంత సులభం కాదు. అందరూ భక్తితోనే ఆగిపోతారు. భక్తినే పరమం అనుకుంటారు ... పై మెట్టును ఎక్కలేక. భక్తి జ్ఞానానికి మార్గం కావాలి. మదురై నుండి తిరువణ్ణామలై వచ్చిన కొత్తలో స్వామి దేవాలయంలో తరచు సమాధిలోకి వెళ్లిపోయేవారు. పారవశ్యంతో కన్నీరు కార్చేవారు. అది భక్తి పారవశ్యం. భక్తి గీతాలు విన్నా అంతటి ఆనందం కలిగేది. అప్పటికి భక్తి, జ్ఞానం ఒక్కటేనన్న భావం వారిది. కన్నీటిలోంచి, కరుణలోంచి జ్ఞానం ఉద్భవిస్తుంది. ఆత్మ విచారణలో ధ్యాని సర్వం మరచి ఆత్మతో ఏకీకరణ అయినప్పుడు సర్వం జ్ఞానమయమే!



# 20. మహర్షి : శేషాద్రి స్వామి

**"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం।"**

జ్ఞానుల కృషిని జ్ఞానులు మాత్రమే గుర్తిస్తారు.

తిరువణ్ణామలై ప్రశస్తికి, ప్రస్తుతికి శ్రీ శేషాద్రిస్వామి, శ్రీ రమణమహర్షి ఇరువురూ కారకులే. ఇరువురు కారణజన్ములు. ఒకరికొకరు తీసిపోని మహాత్ములు. అరుణగిరికి ఆ ఇద్దరు రెండు దివ్యనేత్రాలు.

శేషాద్రిస్వామి 1929 జనవరి 11 న నిర్యాణం చెందినపుడు వచ్చి శ్రద్ధాంజలి ఘటించిన వేలాది మంది భక్తులు ఆయన ప్రాభవానికి నిదర్శనం. ఇప్పటికీ రమణాశ్రమం వెళ్లేవారు శేషాద్రిస్వామి ఆశ్రమాన్ని దర్శిస్తారు. వారిరువురి మధ్య సారూప్యత ఎక్కువ. అన్నివిధాలా వారు సమీపస్థులు. వారిరువురిని కలిపి చదవడంలో ఒక ఆనందం ఉంటుంది. శేషాద్రిస్వామి ఆశ్రమం రమణాశ్రమానికి కూతవేటు దూరంలో ఉంది.

శేషాద్రిస్వామి జీవితం ఒక విచిత్ర గ్రంథం. ఒక మార్మిక నిధి. 1870లో ఉత్తర ఆర్కాట్ జిల్లా వందవాసి తాలూకా వల్లూర్‌లో జన్మించారు శేషాద్రిస్వామి. ఆయన కామకోటి శాస్త్రియార్ అనే పురాణ పండితుని పర్యవేక్షణలో పెరిగాడు. తల్లిగారి పేరు మరకతమ్మాళ్. ఆమె సంగీత విద్వన్మణి. రామాయణ, భారతాలు క్షుణ్ణంగా చదివింది. శేషాద్రికి తల్లివద్దనే పురాణ పరిచయం, సంగీత స్వర పరిచయం. ఆయన మేధాశక్తి అపూర్వం. జ్ఞాపకశక్తి అమోఘం. పధ్నాలుగు సంవత్సరాలకే సంస్కృతంలో పాండిత్యం సంపాదించాడు. ఆయనకు కంచికామాక్షి ఆరాధ్యదేవత. కంచిలో తండ్రితో కలిసి ఉండేవాడు. ముక్త పంచశతిలో అయిదు

వందల శ్లోకాలు కామాక్షి ఆలయంలో నిత్యం పారాయణ చేస్తూ, ప్రదక్షిణలు చేస్తూ, రాత్రింబవళ్లు ఆలయప్రాంగణంలోనే ఉండేవాడు.

పదిహేడవ ఏట 'బాల' మంత్రోపదేశం పొందాడు. అర్థరాత్రి నదీతీరాన శ్మశానంలో ఒంటరిగా బాల మంత్రోపాసన చేసేవాడు. తమ కులదేవత 'పెరియాందవర' ఆలయంలో నిష్టగా ధ్యానం చేసేవాడు. ఒకసారి దేవీ దర్శనమైంది. ఆనాటి నుండి శేషాద్రి జీవితం మలుపు తిరిగింది. కుటుంబం పట్ల, చదువుల పట్ల ఆసక్తి పోయింది. ఊరూరు తిరుగుతూ, రకరకాల మంత్రాలు అనుష్ఠించసాగాడు. ఒక్కొక్కరోజు రాత్రి తెల్లవార్లు ధ్యానంలో ఉండేవాడు. ఇల్లు వదలి ఊళ్ళు పట్టి తిరగసాగాడు. అతనిది పిచ్చి భక్తి అని అందరూ ఈసడించేవారు.

1890 చివరన తిరువణ్ణామలై చేరుకున్నాడు. అరుణాచలేశ్వరుడే శేషాద్రిని తన కొలువులో చేర్చుకున్నాడు. బంధువులు ఆయన ఆచూకీ తెలిసి, వెళ్లి, ఇంటికి రమ్మని ప్రాధేయపడి భంగపడ్డారు. 39 సంవత్సరాలు తిరువణ్ణామలైలోనే ఉండిపోయాడు. ఆయన మంత్రం వదిలేవాడు కాదు. విరాగి. పది సంవత్సరాల లోనే మంత్రసిద్ధుడైనాడు. అనేక అతీంద్రియ సిద్ధులు ఆయన వశమైనాయి. మనస్సులు చదివేవాడు. మొహం చూచి జరగబోయే సంఘటనలు చెప్పేవాడు.

వివేకవంతులకే మైత్రి విలువ తెలుస్తుంది. స్వార్థపరులు స్నేహాలను లెక్కచేయరు, పైగా ద్వేషం పెంచుకుంటారు. శేషాద్రిస్వామి, రమణమహర్షి మైత్రి విలువ తెలిసినవారు. ఇద్దరు జ్ఞానులు. తపోధనులు. ఇరువురి జీవితాలు ఒకే రేఖపైన కదులుతున్నాయి. ఇరువురి మధ్య సారూప్యత ఎక్కువ, సామీప్యత ఎక్కువ. ఇద్దరూ బ్రహ్మచారులు. బాల్యంలోనే వైరాగ్యం పెంచుకొని ఇల్లు వదలి వచ్చినవారు. ఇద్దరూ చిన్నతనంలోనే తండ్రుల్ని కోల్పోయారు. తండ్రుల జ్ఞాపకాలు కరిగిపోగా తిరువణ్ణామలై చేరుకున్నారు. అరుణాచలేశ్వరుని ఆశ్రయించారు. ఇల్లు వదలి వచ్చే వరకు ఇద్దరూ చాదస్థులే. సంప్రదాయాన్ని పాటించిన వారే. తిరువణ్ణామలై వచ్చి చేరిన వెంటనే కులాన్ని గాలికి వదలి భిక్షుక వృత్తి స్వీకరించారు.

ఇద్దరిలో ముందుగా తిరువణ్ణామలై చేరిన వ్యక్తి శేషాద్రిస్వామి. చదువుల సరస్వతి. సంస్కృతంలో శ్లోకాలు రాయగల ప్రజ్ఞ కలవాడు. వేదాలు, పంచకావ్యాలు, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం నేర్చాడు. సంగీతంలో పాండిత్యం వుంది. మంచి గాయకుడు. అందుకు రమణ మహర్షి శుద్ధ వ్యతిరేకం. శేషాద్రిది పిచ్చివాలకం. కావాలని పిచ్చిగా నటించేవాడు. అతని పిచ్చి ఓ నటన. జనం తనని పిచ్చివాడని, మతిలేని వాడని భ్రమపడితే తనజోలికి రారని ఆయన నమ్మకం. నిజానికి అతను పిచ్చివాడు కాదు. మహాజ్ఞాని. పుంభావ సరస్వతి. రమణ మహర్షి ఎన్నడూ

పిచ్చివాడనిపించుకోలేదు. తొలినుండి స్వామిగా గుర్తింపు పొందాడు. బ్రాహ్మణ స్వామి అయినాడు. అయితే మౌనంగా ఉండడంవల్ల, శరీర స్పృహ లేకపోవడం వల్ల జనం ఆయన దగ్గరకు వచ్చి చేరేవారు కాదు.

శ్రీరమణుని ప్రతిభను, తపోదీక్షను మొదట గుర్తించిన వ్యక్తి శేషాద్రిస్వామి. ఈయన ఎవరో తనను మించినవా డనుకున్నాడు. అతని పరిణతి చెందిన 'ఆత్మ'ను గుర్తించాడు. ప్రాపంచికతకు అతీతుడని, అతీంద్రియ శక్తి సంపన్నుడని తెలుసుకున్నాడు. అంత సులభంగా అంతర్ముఖుడు కావడం, దేహచింత లేకుండా సమాధి స్థితుడు కావడం మహర్షులకే సాధ్యమని శేషాద్రి స్వామి అంచనా. అంతటి నిశ్చల సమాధి తనకు ఇంకా అలవడనందుకు అసూయపడి ఉండవచ్చు. ఆ అసూయ రమణుని పట్ల ఆత్మీయతగా, ఆరాధనగా మారింది. అల్లరి పిల్లకాయలు రాళ్లు రువ్వుతుంటే, వారిని తరిమి వేసే పని చేపట్టాడు. అంటే రమణుని తపస్సుకు భంగం కలగకుండా రక్షించే బాధ్యత తను వహించాడు. పూర్వం యాగ రక్షణకు శ్రీరాముడు చేసిన పని అలాంటిదే గదా! అదే తొలిదర్శనం. అదే వారి తొలి పరిచయం. తర్వాత పవలకున్రులో బ్రాహ్మణ స్వామితో పరిచయం అయింది. మఠం వారి ప్రసాదాలు, భక్తుల నివేదనలు ఇద్దరూకలిసి కైంకర్యం చేసేవారు. ఇద్దరూ అన్నదమ్ము లనిపించేవారు. జంట రుషులుగా భాసించేవారు. రమణుని మకాం గిరి పైకి మారిన తర్వాత శేషాద్రి అప్పుడప్పుడు వెళ్లి పరామర్శించేవారు. ఇద్దరూ కలిసి భోజనం చేసేవారు. శేషాద్రిస్వామి ఏం చేసేదీ ఎవరికీ తెలియదు. ఆయన తన ఆంతర్యం తెలియనిచ్చేవాడు కాదు. ఒక్కొక్కసారి ఉదారంగా ఉండేవాడు. భక్తులకు వరాలు అనుగ్రహించేవాడు. తనకు అన్నంపెట్టిన వారిని మరిమరీ ఆశీర్వదించేవాడు.

తిరువారూర్ నివాసి సుబ్రహ్మణ్య మొదలియార్, తల్లి, భార్యతో కలిసివచ్చి 1908 నుండి సాధు సన్యాసులకు అన్నదానం చేయడం ఆనవాయితీగా పెట్టుకున్నాడు. ఆయన 30 ఏళ్లవాడు. మహర్షికి, ఆయన శిష్యులకు శేషాద్రిస్వామికి 'అన్నసేవ' చేశాడు. మొదలియార్‌కు ధర్మచింతన కన్న ధనచింతన ఎక్కువని శేషాద్రికి తెలుసు. ఆయన మనస్సు ఆధ్యాత్మికం వేపు తిప్పాలని ప్రయత్నించేవాడు. ఒకసారి కొండపైకి పనికట్టుకు వెళ్లి మొదలియార్‌కి చెప్పాడు "చూడు మొదలీ! నా తమ్ముడు నాకంటె చిన్నవాడు. పదివేలు సంపాదిస్తున్నాడు. నేను ఒక వేయి సంపాదిస్తున్నాను. నీవు కనీసం ఒక వందైనా సంపాదించుకోవద్దా."

ఆ మాటల అర్థం మొదలియార్ నషాలానికి తాకాయి. ఖంగుతిన్నాడు. శేషాద్రి తనను, మహర్షితో పోల్చడంలో ఏమాత్రం అహంకారం లేదు. తనకంటే

రమణుడు ఆధ్యాత్మికంగా ఉన్నతుడని అంగీకరించడంలో అసూయ లేదు. అదీ శేషాద్రి స్వామి జీవన తత్వం. మహర్షి అంటే అంత ప్రేమ ఆయనకి.

మొదలియార్‌కు చాలా ఆస్తి గొడవలు, కోర్టు చిక్కులు ఉన్నాయి పాపం.

"ఎక్కడ స్వామీ! టైం లేదు. అన్నీ లిటిగేషన్స్. ఎన్నో సమస్యలు".

శేషాద్రి స్వామి మళ్లీ గట్టిగా నొక్కి చెప్పాడు "కాలం వృధా చేస్తున్నావు మొదలీ! నా మాట వినక పోయావో బ్రహ్మ హత్యా దోషం తగులుతుంది జాగ్రత్త" అని హెచ్చరించాడు.

మొదలియార్ భయంతో వణికిపోయి మహర్షి దగ్గరకు పరుగెత్తాడు. అతనికి మహర్షి మాటపై నమ్మకం ఎక్కువ. మహర్షి అంతా విని అన్నాడు:

"మంచిమాట అన్నాడయ్యా! నువ్వు బ్రాహ్మణుని హత్య చేస్తున్నావన్నమాట. అంటే బ్రహ్మాన్ని తెలుసుకోలేక పోతున్నావని అర్థంలే. బాధపడకు".

ఈ మాట గుండెలో మరింత లోతుగా దిగబడ్డది. పెద్దవాళ్ల మాటలు అర్థం చేసుకోవడం కూడా ఒక యోగ్యతే అవుతుంది. అదీ యోగార్హతే.

అప్పుడప్పుడు శేషాద్రిస్వామి ఎచ్చమ్మాళ్ ఇంటికి వెడుతుండేవాడు. వెళ్లినప్పుడు ఆమె భోజనం పెడుతుంది. ఎచ్చమ్మాళ్ రోజూ కొండపైకి స్వామికి, ఆయన శిష్యులకు భోజనం తీసుకువెళ్లి తిరిగి వచ్చేటప్పుడు శేషాద్రి స్వామిని కలిసేది. ఇద్దరూ కలిసి ఆమె ఇంటి వరకు వచ్చేవారు. ఆధ్యాత్మిక విషయాలపై శేషాద్రిస్వామి ఎవరికీ సలహాలివ్వడు. ఒక్క మొదలియార్ విషయంలో గట్టి సలహా యివ్వడం జరిగింది. అలాంటి సంఘటన ఒకటి ఎచ్చమ్మాళ్ విషయంలోనూ జరిగింది.

శేషాద్రిస్వామి ఎవరికీ ఉపదేశం చేయడు. ఎవరికి వారు తాము ఎన్నుకున్న మార్గంలో పూర్ణత్వం సాధించాలన్నది వారి ఆకాంక్ష. ఒక గురువును వదలి మరొక గురువు వెంట పడడం సహించరు. ఆయనకు తెలియని మంత్రాలు లేవు. మంత్ర సిద్ధుడు. ఎవరికి ఏ మంత్రం ఉపయోగిస్తుందో ఇట్టే గ్రహించగలడు. తన వద్దకు వచ్చిన వారు, ఎవరుగాని రమణమహర్షికి అభిమానులని తెలిస్తే అక్కడికే పంపేవాడు. ఎవరైనా ఒక్క గురువునే నమ్ముకోవాలన్నది ఆయన సిద్ధాంతం. తనకు, రమణ మహర్షికి తేడా లేదని అనేక సందర్భాలలో నిరూపించి చూపారు.

★ ★ ★

తిరుచ్చుళి నుండి లక్ష్మి అమ్మాళ్ అనే ఆమె భగవాన్ దర్శనానికి వచ్చింది. ఎచ్చమ్మాళ్ ఇంట్లో ఉంటూ రోజూ కొండపైకి వెళ్లి రమణుని సేవించుకుని వచ్చేది.

ఒక వారం తర్వాత ఆమె ఎచ్చుమ్మాళ్‌తో అన్నది "వారం దినాలైనా శేషాద్రి స్వామి దర్శన భాగ్యం కలగలేదు".

మర్నాడు ఆమె స్కందాశ్రమానికి బయలుదేరి దేవాలయం వద్దకు రాగా అక్కడ శేషాద్రిస్వామి కనిపించాడు. అభిమానుల మనసు గ్రహించడం స్వామికి వెన్నతో పెట్టిన విద్య. సంకల్పిస్తే చాలు దర్శనమిస్తాడు. లక్ష్మి అమ్మాళ్ గుడి వాకిట శేషాద్రిస్వామిని చూచి ఆశ్చర్యపడ్డది. తన కళ్లను తను నమ్మలేకపోయింది. ఆయనకు నమస్కారం చేస్తూ అనుకున్నది "ఈ స్వామిని సేవించే భాగ్యం కలగలేదే" అని. వెంటనే స్వామి అన్నాడు – "తేడా ఏముంది. ఇక్కడి సేవ, అక్కడి సేవ రెండూ ఒక్కటే". రమణులూ తానూ భిన్నం కాదని అర్థం.

ఆయన ఎప్పుడూ ఎవరినీ ఏమీ అడగరు. అప్పుడప్పుడు అరుణాచలేశ్వర దేవాలయంలోని ఉత్తర మండపం చేరతాడు. అక్కడికి మహర్షి శిష్యులు వస్తారు. ఎవరైనా ప్రసాదం పెడితే నేలకేసి కొట్టేవాడు.

"స్వామీ ఇది ప్రసాదం, అలా పారేయకూడదు" అంటే

"నేనేమీ వృధా చేయలేదయ్యా, అవన్నీ సన్నజీవాలకు పెట్టాను" అనేవాడు.

1914 ప్రాంతంలో శేషాద్రిస్వామి తరచు విరూపాక్ష గుహకు వేంచేసేవాడు. మహర్షితో కలిసి భోజనానికి కూర్చునేవాడు. అన్నం నేల మీద విసరడం ఆయన అలవాటు. మహర్షి సేవకుడు కందస్వామి శేషాద్రి చర్యలకు బాధ పడేవాడు.

"స్వామీ! మీరిలా చేస్తే ఇక మీదట నేను మీకు భోజనం పెట్టను" అన్నాడు.

అంతే, మరల శేషాద్రి ఎన్నడూ భోజనం వేళకు కొండపైకి వెళ్లలేదు.

అంత పట్టుదల, మొండితనం, ఆత్మాభిమానం ఆయనకు.

ఆ విషయం తెలిసి పళనిస్వామి అన్నారు "శేషాద్రి తెలివిగలవాడు, జ్ఞాని కాదు. అ అన్నం పారేశాడే అనుకో. ఆ మాట మొహం మీదనే అంటే బాధపడడూ? తను భగవాన్ దగ్గరకు రావడం లేదు నీ కారణంగా".

నిజానికి శేషాద్రి ఎవరి మాటలు పట్టించుకోడు. విమర్శలూ లెక్కచేయడు. అసలు మనుషులనే లెక్కచేయడు. కాని మలయాళ స్వామి పళని చేసిన విమర్శ చెవిన పడ్డప్పుడు "అది రమణుని పట్ల అవిధేయతగా బాధపడ్డాడు".

"అయినా పెట్టిన తిండి అంతా తినాలని ఏముంది? ఆకలి మీద ఉన్నవాడు అంతా తింటాడు. ఆకలి లేనివాడు తినడు. విమర్శించడానికి వాడెవడు? చీమలు, కాకులు ఏవి తింటేనేం. అవీ బ్రతకాలిగా?"

**అప గచ్ఛంతు తే భూతా యే చాత్ర భువి సంస్థితాః**
**ఆగమార్థంతు దేవానాం గయనార్థంచ రక్షసాం**

*యక్షులు రాక్షసులు, గంధర్వులు, భూతప్రేత పిశాచాలు మన కంటికి కనిపించరు. ఈ భోజనం వారికి ఆహార మవుతుంది.*

★ ★ ★

సోమసుందరం అని మహర్షి శిష్యు డొకడుండేవాడు. అతనికి చిత్త చాంచల్యం. మహర్షి మీద అలిగి వెళ్లిపోయాడు. తర్వాత ఏం చేయాలో తోచలేదు. ఎక్కడికి పోవాలి? ఎవరిని ఆశ్రయించాలి? దేవాలయంవద్ద శేషాద్రి స్వామి కోసం నిరీక్షించాడు. శేషాద్రి స్వామి వచ్చీ రాగానే ఆయన మనస్సు గ్రహించి "పో. తిరిగి రమణ దగ్గరకు పో" అని గట్టిగా కసిరాడు. అతను తటపటాయిస్తూంటే మరీ గట్టిగా అరిచాడు.

"పో రా... రమణుడే నీకు గతి... పోయి శరణాగతుడివి కా. ఆలస్యం చేయకు".

వెంటనే బయలుదేరి అతగాడు చీకట్లో చచ్చీ చెడి, కొండెక్కి అర్థరాత్రికి విరూపాక్ష గుహకు చేరుకున్నాడు.

★ ★ ★

చిదంబరం నుండి శాస్త్రిగారొకరు మహర్షి దర్శనం కొరకు వచ్చేవాడు. ఒక రోజున దేవాలయానికి వచ్చాడు. ఆయన ధ్యానం కుదరడం కోసం గంజాయి తాగుతుంటాడు. ఆ రోజు వాడిన గంజాయి మంచిది కాకపోవడంతో తల తిరగడం మొదలైంది. పిచ్చిపిచ్చిగా మాట్లాడసాగాడు. దిక్కుతోచని స్థితిలో శేషాద్రిస్వామి దగ్గరకు చేరాడు. తనని రక్షించమని ఆయన కాళ్ల మీద పడ్డాడు.

శేషాద్రిస్వామి "గంజాయి మానుకోమని నీకు లోగడ ఒకసారి చెప్పాను. అయినా గంజాయి దమ్ముకొడుతున్నావు" అని గట్టిగా కేకలు వేశాడు.

వాస్తవానికి శేషాద్రి ఆ మాట ఎప్పుడూ శాస్త్రికి చెప్పలేదు. మానమని చెప్పింది రమణ మహర్షి. మహర్షి మాట శేషాద్రి మాట ఒక్కటే.

★ ★ ★

ఒకసారి ఎ.వి. అయ్యర్, అదే పబ్లిక్ వర్క్స్ ఉద్యోగి, వచ్చి శేషాద్రిస్వామి వద్ద నిలబడ్డాడు. ఆయన మనసులో ఆలోచన మహర్షిని దర్శించాలని. పైకి చెప్పడానికి భయపడ్డాడు.

శేషాద్రి ఆయన మనస్సు చదివినట్లు “వెళ్లు, వెళ్లు. వెళ్లవయ్యా వెళ్లు. నీ మనసులోని కల్మషం తుడిచి పెట్టుకుపోవాలంటే మహర్షిని దర్శించక తప్పదు” అన్నాడు.

★ ★ ★

శేషాద్రిస్వామి, రమణమహర్షి ఏక హృదయాలు అనడానికి మరొక ఉదాహరణ. ఒకసారి టి.వి. అయ్యర్ అనే భక్తుడు శేషాద్రిస్వామి వద్దకు వచ్చాడు. అయ్యర్ మహర్షిని తన గురువుగా భావిస్తాడు. శేషాద్రిస్వామి ఆ భక్తుని గురు భక్తిని పరీక్షకు పెట్టాడు.

శేషాద్రి : అయ్యరూ, ఇక్కడ తిరువణ్ణామలైలో మూడు లింగా లున్నాయయ్యా, నీకు తెలుసా?

అయ్యర్ : మూడు లింగాలా? ఒక్క లింగమే నాకు తెలుసు, అది జ్యోతిర్లింగం. అరుణగిరి.

శేషాద్రి : కాదయ్యా. అబద్ధం చెప్పకు, నీకు మూడు లింగాలు తెలుసు.

అయ్యర్ : తెలియదు స్వామీ. మిగిలిన రెండు లింగాలు ఎక్కడ ఉన్నాయో చెప్పండి. వెళ్లి చూస్తాను.

శేషాద్రి : నీకు తెలుసులేవయ్యా అయ్యరూ?

అయ్యర్ : ప్రమాణ పూర్వకంగా తెలియదు స్వామీ!

శేషాద్రి : నీవు ప్రణామం చేసే రమణుడు ఒక లింగం – జ్ఞానలింగం

అయ్యర్ : అవును స్వామీ, గురువే లింగం అంటారు. ‘గురులింగం’ కదా! మరి మూడవది

శేషాద్రి : అదీ నీకు తెలుసు....

అయ్యర్ : తెలియదు స్వామి, చెప్పండి

శేషాద్రి : మూడవ లింగం పేరు శేషాద్రి.

అయ్యర్ : అంటే తమరేనా స్వామీ, లేక

శేషాద్రి : అవును. ‘నేను’ నేనే గదా.



**రమణమహర్షి – పరమహంస యోగానంద**



# 21. తస్మాత్... జాగ్రత...

**డబ్బు** చుట్టూ దొంగలు తిరుగుతుంటారు.

ఆశ్రమాల చుట్టూ దొంగస్వాములు తిరుగుతుంటారు.

దొర లెవరో, దొంగ లెవరో చెప్పడం కష్టం.

మంచి స్వాము లెవరో, దొంగ స్వాము లెవరో చెప్పడం మరీ కష్టం.

సద్గురువుల్ని వెతికి పట్టుకోవడం మరీ మరీ కష్టం! దొంగస్వాములకు డబ్బుపైన వ్యామోహం. నిజం స్వాములకు డబ్బంటే అసహ్యం.

సన్యసించిన తర్వాత రమణులు డబ్బు ముట్టలేదు. ఎన్నడూ ఏదీ ఆశించలేదు. డబ్బుకోసం సన్యసించి ఆయనను ఆశ్రయించిన వారు ఉన్నారు. డబ్బు లక్ష సమస్యలు తెస్తుంది. అవసరాలు తీరడానికి డబ్బు కావాలి. సుఖాలు మరిగినవారికి మరింత డబ్బు అవసరం. అంచేతనే సన్యాసులు ఆడంబరాలు, అలంకారాలు, అహంకారాలు వదలుకుంటారు. స్వామీజీలు వాటిని పెంచుకుంటూ పోతారు. నిజమైన దరిద్రాన్ని వరించినవాడే సన్యాసి.

అన్ని పాప కృత్యాలకు మూలం సంపద. ధనాశ అన్ని దుశ్చర్యలకు పునాది. అందుకే సామెత 'సూది బెజ్జంలోంచి ఏనుగును పంపవచ్చుగాని, ధనాశాపరుడిని స్వర్గం చేర్చడం అసాధ్యమని'. ఎవరూ పుణ్యాన్ని డబ్బుతో కొనలేరు. దొంగలు హరించని సొమ్ము స్వాముల సొత్తు.

నీతి సూత్రాలు ఎన్నయినా వల్లించవచ్చు. ఆచరించడమే కష్టం. పాపం! స్వాములకూ గడవాలి కదా! డబ్బు అవసరం ఉంటుంది. బ్రహ్మాన్ని, ఈశ్వరుని

నమ్ముకుని కడుపు మాడ్చుకోలేరు గదా! ఆశ్రమాలకూ డబ్బు కావాలి. అయితే ఎంత వరకు? అవసరాలకు ఆశించడం తప్పుకాదు. పరిమితులుండాలి. అత్యాశ, సంపాదనపై దృష్టి ఉండకూడదు. సంపాదించి నిల్వచేసుకోకూడదు. అలా చేస్తే అది 'ధనాశ' అవదు. అవసరార్థం గ్రహించడం, సంపాదించడం నేరం కాదు. అది పాపం కాదు. ఎంత సంపాదించినా కొంత సత్కార్యాలకు వినియోగిస్తే అది సత్క్రియ అవుతుంది. అది సత్కర్మ అనిపించుకుంటుంది.

ఏరికోరి దరిద్రం అనుభవించడం పుణ్యకర్మ అనిపించుకోదు. అలా అయితే దరిద్రులంతా పుణ్యపురుషులు కావాలి. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు. అతి దారిద్ర్యమూ  ఆశించదగింది కాదు. అతి సంపదా మంచిది కాదు. సమతుల్యత అవసరం. సమ్యక్ దృష్టి అలవడాలి. అప్పుడు ఏ ప్రమాదమూ ఉండదు. ఏ పాపమూ అంటదు. పవిత్రమైన హృదయం, నిష్కల్మషమైన మనస్సు డబ్బుతో ముడిపడి ఉండవు.

అనుకోని అతిథిలా వచ్చి కూర్చుంటుంది దరిద్రం. కదలదు, మెదలదు. మనిషిని అతలాకుతలం చేస్తుంది. పిచ్చివాడిని చేస్తుంది. దరిద్రం బాధ భరించలేకనే నూటికి తొంభయ్ తొమ్మిది మంది సన్యాసులవుతారు. నూటికి, కోటికి ఒక్కరు కనిపిస్తారు రమణ మహర్షి, శేషాద్రిలాంటి మహాత్ములు. వీరు ప్రేమతో పేదరికాన్ని తరిమివేయగలరు. దరిద్రాన్ని ప్రేమించగలరు. పవిత్రమైన ప్రేమ ఉన్నచోట పేదరికం ఉండదు. డబ్బు ప్రసక్తి ఉండదు. పవిత్రత దరిద్రాన్ని జయిస్తుంది.

రమణ మహర్షి మొదటినుండి నిస్సంగుడే. పవిత్రంగా జీవించాడు. ఆయనకు జీవితం మీద మమకారం లేదు. దేనిపైన వాంఛ లేదు. ఎవరిపైన ఇష్టం లేదు. అయినా అవసరానికి అన్నీ సమకూరుతుండేవి. కావలసిన భోజనం ఎవరో తెచ్చి పెడుతుండేవారు. ఆశ్రమం నెలకొల్పేవరకు ఆయన ఏ విషయాలు పట్టించుకునేవారు కాదు. ఆయన వైరాగ్యమే గొప్ప ఆకర్షణ. ఆశ్రమం ఏర్పడడం, విదేశీభక్తుల రాక, ప్రచారం ఒక్కసారిగా మొదలయ్యాయి. గురుమూర్తంలో ఉండే రోజుల్లో భక్తులు మధ్యాహ్నం తర్వాత వస్తుండేవారు. పండ్లు, చిరుతిండ్లు తెచ్చి సమర్పించేవారు. మహర్షి ఒక మూలన బల్లపైన కూర్చుని ఉండేవారు. మధ్యాహ్నం ధ్యానంలోకి వెళితే మర్నాడు మధ్యాహ్నం వరకు కళ్లు విప్పేవారు కాదు. ఉన్న చోటు నుండి కదిలేవారూ కాదు. తెచ్చిన ప్రసాదాలు భక్తులే అందరికీ పంచేవారు.

గిరి నివాసంలో ఒక విధమైన సాంఘిక జీవనం కనిపిస్తుంది. సమ వర్తనం కనిపిస్తుంది. ఎవరు ఏది యిచ్చినా ఆయన చేతితో ముట్టుకోరు. అందరూ సమంగా పంచుకోవలసిందే. తినే పదార్థాలైనా, ఖరీదైన బహుమతులైనా పంపిణీ

జరగవలసిందే. మహర్షి కోసం దాచడం కాని, రేపటి అవసరాలకు నిలవచేయడం గానీ ఉండేది కాదు. రేపటి సంగతి రేపు. ఆయన వైరాగ్యం, పవిత్ర శీలం జనాన్ని ఆకర్షించాయి. ఆశ్రమం ఎంత పెరిగినా, ఎప్పుడూ అయ్యగారి నట్టిల్లులాగే ఉండేది. తిరువణ్ణామలై వచ్చిన రోజున చేతితో విసిరిన మూడున్నర అణాలు తర్వాత ఆయన డబ్బు ముట్టలేదు. డబ్బు కావాలనీ ఆశించలేదు. అయినా డబ్బు మహర్షిని పరీక్షలకు గురిచేసింది.

ఒకసారి ఉద్దండి నాయనార్ మహర్షికి నూరు రూపాయలు బహూకరించాడు. మహర్షి ఆ సొమ్మును ప్రేమగా తిరస్కరించారు. నాయనార్ ఆ సొమ్ము శేషయ్యర్ చేతికిచ్చి "ఏదైనా మంచిపనికి ఉపయోగించండి" అన్నాడు. తదాది ఆశ్రమానికి డబ్బు కాస్త కాస్త జమ కాసాగింది. రోజు రోజుకు ఆశ్రమం రూపు మారసాగింది. ముందు ఒక పర్ణశాల, ఆ చుట్టూ తోట, ఓ మందిరం. పాలితీర్థం వద్ద గల తల్లి సమాధి మహర్షికి నివాసమైంది. అక్కడ క్రమంగా భవనాలు, తోటలు ఏర్పడసాగాయి. మహర్షి వేటినీ కోరింది లేదు. వాటంతట అవే ఏర్పడసాగాయి. లోకానికి రమణాశ్రమం అవసరం, మహర్షికి కాదు.

ఆశ్రమం ఏర్పడిన తీరు విచిత్రం. భక్తులు సంబారాలు, డబ్బు విరాళాలుగా యిస్తారు. ప్రత్యేక సందర్భాలలో అన్న సంతర్పణ జరుగుతుంది. మామూలుగా రోజూ 50,60 మంది భక్తులుంటారు భోజనానికి. అదనంగా పది మంది వచ్చినా కొరత ఉండేది కాదు. అవసరానికి అన్నీ సమకూరుతుండేవి. వేటినీ దాచి పెట్టడం ఉండేది కాదు. మహర్షి భోజనానికి ముందే బయట పేదలకు, సాధు బైరాగులకు అన్నదానం జరిగేది. భక్తులు సాధారణంగా భగవాన్‌తో కలిసి భోజనం చేసేవారు. అప్పుడప్పుడు రౌడీల దందా తప్పేది కాదు.

ఒకసారి ఒక సంపన్నుడు ఆశ్రమానికి వచ్చాడు. అక్కడకు ఎవరు వచ్చినా ఎవరూ పట్టించుకోరు. ఎవరని అడగరు. ఎవరైనా సరాసరి వెళ్లి మహర్షిని దర్శించి పోతుంటారు. ఈయన సరాసరి మహర్షి వద్దకు వెళ్లి నమస్కారం చేసి ఎదురుగా కూర్చున్నాడు. నేరుగా మహర్షిని ఇంగ్లీషులో ప్రశ్నించాడు 'మహర్షీ! మీరు దేవుని చూచారా?'

అలాంటి ప్రశ్న ఎవరూ అడగరు. అది ఔచిత్యం కాదు– అజ్ఞానం.

మహర్షి సమాధానం చెప్పలేదు. అతను మహర్షి కూర్చున్న పులిచర్మం వైపు నిదానించి చూచి అడిగాడు. 'పులిని చంపడం పాపం కదూ?'

అందుకూ మహర్షి జవాబివ్వలేదు. అంతలో ఎవరో వచ్చి అలాంటి ప్రశ్నలు అడగవద్దని హెచ్చరించారు. అతను చిరాకుగా, "నేను నిన్నడగలేదు. నాకు స్వామి స్వయంగా సమాధానం చెప్పాలి" అన్నాడు.

పావు గంట మౌనం తర్వాత అతను లేచి బయటకు వెళ్లిపోయాడు.

ఆశ్రమవాసి ఒకరు అతన్ని నిలదీసి ప్రశ్నించాడు. అతను అలా ఆశ్రమాలు తిరిగి, స్వామిజీల్ని బెదిరించి, అడ్డమైన ప్రశ్నలు వేసి, డబ్బు దండుకుంటుంటాడని తెలిసింది.

మహర్షి దగ్గర బాగా డబ్బు ఉందన్న ప్రచారం సాగింది. 1920లలో రెండుసార్లు ఆశ్రమంలో దొంగలు పడ్డారు. మొదటిసారి గోడకు కన్నంవేసి సమాధి మందిరంలో ప్రవేశించారు. కొన్ని వస్తువులు దొంగిలించారు.

వారం తర్వాత మరొకమారు ఆశ్రమంలో దొంగలు పడ్డారు. అది లూటీ. రాత్రి 11:30 గంటల వేళ మహర్షి హాలులో రాతి బల్ల మీద పడుకున్నారు. అది అమ్మగారి సమాధి ఎదురుగా కట్టిన హాలు. తాటాకుల పైకప్పు, ఇటుక గోడలు. హాలు కిటికీల వద్ద నలుగురు ఆశ్రమవాసులు పడుకుని నిద్రపోతున్నారు. అర్ధరాత్రి దాటిన తర్వాత కుంజుస్వామి, మస్తాన్ బయట మనుషుల అలికిడి గమనించారు. బయట ఆరుగురు శిష్యులు నిద్రపోతున్నారు. మస్తాన్ 'ఎవరది' అని కేకవేశాడు. దొంగలు కిటికీ అద్దాలు పగులకొట్టారు. కుంజుస్వామి, మస్తాన్ భయంతో సమాధి వద్దకు పరుగుతీశారు. దొంగలు మహర్షి పడుకునే చోట కిటికీ పగులగొట్టారు. కుంజు ఉత్తరం వైపు ద్వారం తెరిచి రామకృష్ణ అనే మరొక శిష్యుని సాయంగా పిలుచుకువచ్చాడు. అంతలో అదే గుమ్మంలోంచి ఆశ్రమం శునకాలు కరుప్పన్, జాన్ బయటకొచ్చాయి. దొంగలు వాటిని బాదారు. అవి పారిపోయాయి. కుంజు హాలులోకి వెళ్లాడు.

మహర్షి దొంగలతో అన్నాడు "రండి, దొంగగారూ, మీకు కావలసింది తీసుకుపోండి".

ఆ మాటలు లెక్కచేయకుండా దొంగలు కిటికీ పగులకొట్టారు. కుంజు వేరే గుమ్మంలోంచి బయటకు వెళ్లి దొంగల్ని అడ్డుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

మహర్షి నెమ్మదిగా "వాళ్ల పని వాళ్లని చేసుకుపోనివ్వండి. మన ధర్మం మనది" అన్నాడు.

"మనం ఓర్పు వహిద్దాం. వాళ్ల పనిలో మనకెందుకు జోక్యం".

దొంగలు రెచ్చి పోయారు. కుంజు మాటలకు కోపం తెచ్చుకున్నారు. అతని అంతు చూస్తామని బెదిరించారు. కుంజు పొలాలకు అడ్డంపడి పట్నంలోకి పారిపోయాడు.

ఈలోగా రామకృష్ణ దొంగల్ని బ్రతిమాలుకున్నాడు "ఏవీ పాడుచేయకుండా మీకు కావలసినవి తీసుకుపొండి". నాలుగు పాకలు తగలపెడతామని బెదిరించారు.

కరుప్పన్‌ని రక్షించమని మహర్షి రామకృష్ణతో చెప్పారు. అతను దానిని షెడ్‌లోకి తీసుకువెళ్లాడు. అతను తిరిగివచ్చేలోగా మహర్షి, తంగవేలు, మస్తాన్, మునిస్వామి ఉత్తరంవైపు గుమ్మంగుండా బయటకు చేరుకున్నారు. దొంగలు నిర్దాక్షిణ్యంగా అందరిని కర్రలతో కొట్టారు. మహర్షికి ఎడమ తొడపైన గట్టి దెబ్బ తగిలింది. మహర్షి కుడివైపు చూపించి, "కావాలంటే ఈ తొడమీద కూడ కొట్టండి బాబూ" అన్నారు. వాళ్లు కొట్టబోతుండగా రామకృష్ణ వచ్చి మహర్షిని దూరంగా లాక్కువెళ్లాడు.

దొంగలు బెదిరించారు : "తప్పించుకున్నారో తలలు తీస్తాం."

"మీకు ఏం కావాలో తీసుకుపొండి" చెప్పారు మహర్షి

రామకృష్ణ లాంతరు వెలిగించి తెచ్చియిచ్చాడు. ఒక దొంగ బీరువా తాళాలు అడిగాడు. దొంగలు అల్మైరా తెరిచి వెండి విగ్రహాలు, చిన్న సామాగ్రి, పండ్లు, బియ్యం పట్టుకుపోయారు. ఆనాడు పోయిన వస్తువుల విలువ పది రూపాయలు. తంగవేలు రొక్కం ఆరు రూపాయలు దొంగల పాలైంది.

దొంగలు వెళ్లిన తర్వాత రామకృష్ణ దీనంగా అడిగాడు "దెబ్బలు బాగా తగిలాయి".

"అవును. మంచి పూజ జరిగింది" అన్నారు భగవాన్

దొంగల్ని వెంబడిస్తానని రామకృష్ణ బయలుదేరాడు. మహర్షి వారించి "రామకృష్ణా, మనం సాధువులం. మన ధర్మం మనం అతిక్రమించకూడదు. నీవు వెళ్లి దొంగల్ని కొడతావు. ఎవడో చస్తాడు. అప్పుడు లోకం మనల్నే నిందిస్తుంది. నీవు జైల్లో పడతావు. ఆశ్రమంలో ఉండవలసిన వాడివి జైల్లో ఉండగలవా? పొరపాటున పళ్ల సందున నాలుక పడ్డదనుకో, పళ్లు పీకేసుకుంటావా?"

అది మహర్షి ధోరణి. రెండు గంటల ప్రాంతంలో కుంజు పోలీసుల్ని తీసుకు వచ్చాడు. మహర్షి స్థిమితంగా కూర్చుని వేదాంతం బోధిస్తున్నారు. పోలీసులు ఏం జరిగిందని మహర్షిని ప్రశ్నిస్తే "ఎవరో అజ్ఞానులు ఆశ్రమంలో ప్రవేశించారు. ఏమీ దొరక్క నిరాశతో వెళ్లిపోయారు" అన్నారు.

పోలీసులు తిరిగి వెడుతుండగా మునుసామి అనే కుర్రవాడు వచ్చి దొంగలు స్వామిని, శిష్యుల్ని చితక్కొట్టారని చెప్పాడు. మర్నాడు సర్కిల్, డి.ఎస్.పి. వచ్చారు.

కొన్నాళ్లకు దొంగలు దొరికారు. ఆశ్రమంలో పోయిన వస్తువులు కొన్ని లభించాయి. మహర్షికి మొదటి నుండి కష్టాలు పడడం, అవమానాలు సహించడం అలవాటే. అంచేతనే వారిలో ఓర్పు, సహనం, క్షమాగుణం పెరిగాయి.



# 22. మహర్షి జీవన శైలి

**మహర్షికి** తపస్సే సర్వస్వం. వేరే జీవితం ఏముంది? జీవన శైలి ఏముంటుంది? తనదంటూ ఏమీ లేనివాడు, తనకంటూ ఏమీ మిగుల్చుకోనివాడు మహర్షి కదా! ఆయన కన్నవారిని, బంధువుల్ని ఎన్నడూ తన వారనుకోలేదు. తనకు దగ్గరివారుగా భావించనూలేదు. అయినా మనస్సు విలవిల్లాడుతుంది. గుండె గుబగుబలాడుతుంది. మనుషుల బాధలకన్న సన్నకారు జీవాలబాధలు ఆయన్ని కలచివేస్తాయి. వాల్మీకి మహర్షివలె విషాద కావ్యం రాయకపోయినా, హృదయం నిర్వేదంతో, విషాదంతో నింపుకునేవారు. ఇల్లు వదలి వచ్చాక మళ్లీ ఇంటి ముఖం చూడలేదు. ఊరు గురించి ఆలోచించలేదు. తనెవరో, తనవారెవరో! ఎవరి కెవరు ఈ లోకంలో? అన్నట్లు ప్రవర్తించారు. పరమాత్మకు దగ్గర కావాలంటే అయినవారికి దూరం కాక తప్పదు. బంధువుల్ని దూరం చేసుకున్నాడు కాని ఆత్మీయతలకు దూరం కాలేదు. అయిన వారందరికీ దూరమై పైవారందరినీ ఆత్మ బంధువులుగా, ఆత్మీయులుగా భావించాడు. అందరిలో తనను చూచుకోగల ఆత్మదర్శి ... క్రాంతదర్శి మహర్షి.

రమణాశ్రమంలో ఒక చిత్రమైన ఆచారం నెలకొన్నది. అక్కడ ఎవరికి ఎవరూ స్వాగతం చెప్పరు. పలకరించరు. కుశల ప్రశ్నలు వేయరు. ఎవరు దేనికీ అడ్డు చెప్పరు. అది ఆనాటి సంప్రదాయం. నేటికీ అదే ఆనవాయితీ. మహర్షికి ఆవులన్నా, పక్షులన్నా, కోతులన్నా ఎంత ఇష్టమో! వాటికీ ఆత్మలున్నాయంటారు. చాలా మంది వేదాంతులు, తాత్వికులు, జ్ఞానులకు మాత్రమే ఆత్మలుంటాయని

సామాన్య మానవులకు సైతం ఆత్మలు ఉండవని అంటారు. మనుషులకు తప్ప మిగిలిన జీవాలకు ఆత్మలుండే అవకాశం లేదంటారు.

"అదిగో లక్ష్మి వచ్చింది అన్నం పెట్టండి" అంటారు ... ఆశ్రమంలోకి వస్తున్న గోమాతను కిటికీలో నుండి చూస్తూ. భక్తుల దృష్టి గోవు వైపు తిరుగుతుంది. 'ఆవు వచ్చింది గడ్డి వేయండి' అనరు. 'భోజనం వడ్డించండి' అంటారు. ఎంత వైచిత్రి. ఎంత లాలస? ఎంతటి మాతృ హృదయ స్పందన అది. వారి దృష్టిలో అది ఆవు కాదు. 'లక్ష్మి' అని పేరుపెట్టడంలోనే రమణీయత కనిపిస్తుంది.

'పిల్లలు తిన్నారా?' అని అడిగితే, ఆశ్రమంలో ఎవరో పిల్లలున్నారని అనుకుంటాం. అంతలో రెండు కుక్కలు పరుగున వస్తాయి. వెంటనే వాటి ముందుకు అన్నం పళ్లాలు వస్తాయి.

ఒకటి తోక ఆడిస్తుంది. 'దానికి మంచి నీళ్లు కావాలి' అంటారు. అది 'రోజ్' అనే శునకం.

'రా..రా...బుజ్జీ' అనగానే ఒక పిల్లి వచ్చి ఒళ్లో కూర్చుంటుంది.

నెలలుగా, సంవత్సరాలుగా అక్కడ ఉంటున్న వారికి ఆ దృశ్యాలు పరిచయం. భక్తులకిచ్చే గౌరవం మహర్షి ఆ చిన్నచిన్న జీవాలకూ యిస్తారు.

ఈ జీవకారుణ్యం వెనుక ఒక కారణం వుంది. అది ఎవరికీ తెలియనిది. అవి సన్న జీవాలే కావచ్చు. వాటిలో మహాత్ము లుంటారు. మహా తాపసులు ఆ శరీరాలతో తనకు సహాయం చేయడానికి వస్తుంటారని మహర్షి భావన. అందుచేత అంతగా వారిని గౌరవించి మన్నన చేస్తుంటారు. వేటిని కసిరినా ఆయన సహించరు. ఆయన దృష్టిలో అవి నోరులేని జీవాలు కాదు ఎవరో తాపసులు తాత్కాలికంగా ఎన్నుకున్న శరీరాలు. వారు పూర్వ మానవ శరీరాలను త్యజించి తన దగ్గరకు వచ్చారంటారు. తమ పూర్వజన్మ కర్మ శేషాలను వదలించుకోడానికి ఈ రూపాలలో తనను సేవించుకుంటున్నారంటారు. రెండవ కారణం : మహర్షి దృష్టిలో మనిషి ఎంత ఉత్తముడో అవీ అంతే ఉత్తములు.

రమణ మహర్షి ఒక్కరే కాదు. ఇలా జీవ కారుణ్యం ప్రదర్శించిన మహాత్ములు ఎందరో ఉన్నారు. గురువులకు గురువుగా ఆరాధించబడే దత్తాత్రేయులవారు శునకాలతో మైత్రి నెరపినవారే. అయ్యప్పస్వామి పులులకు మిత్రుడు. అసలు రమణులు గిరి నివాసం ఆరంభించగానే శునకాలు వచ్చి చేరాయి. అవే మహర్షికి ఆ దినాలలో నేస్తాలు. అంగరక్షకులు, శిష్యులు, భక్తులు తోడు ఉండని దినాలలో శునకాలే కాపలా. మొదట్లో కమల అని ఓ ఆడశునకం ఉండేది. దాని సంతానం

నీల, జాక్. రోజ్ మరో మూడు పిల్లలు కమల మనవ సంతానం అంటారు భగవాన్. మహర్షికి వాటి వంశవృక్షం బాగా తెలుసు.

కమల చనిపోతున్నప్పుడు భగవాన్ చిన్న పప్పీలను పిలిచి ఓదార్పుగా, "మీ అమ్మమ్మను పోయిచూడండి. ఇంక వారు కనిపించరు" అన్నారు. కమల చనిపోయినప్పుడు మనుషుల్ని పరామర్శించినట్లే పరామర్శించారు. "రోజా, మీ అమ్మమ్మ చనిపోయింది" అన్నారు. ఆశ్రమంలో శునక సంతతి ఆయనకు బాగా జ్ఞాపకం. వాటికి పేర్లు తనే పెట్టారు.

విరూపాక్ష గుహలో ఉండే రోజుల్లో నల్లకుక్క ఒకటి ఉండేది. దానిని 'చిన్న కరుప్పన్' అనేవారు. దానికి నియమాలు, నిష్ఠలు చాలా ఎక్కువ. అభిమానమూ ఎక్కువే. గుహ బయట దూరంగా ఒక పొదచాటున ఉండేది. దానికి వైరాగ్యం అధికం. మిగిలిన కుక్కలతో కలిసేది కాదు. పొద దగ్గరకు వెళ్లి దానికి అన్నం పెడుతుండేవారు. తర్వాత అదే ఆశ్రమానికి వచ్చింది. మహర్షి దగ్గరకు వచ్చే భక్తులందరి ముందు ప్రేమతో తోకాడిస్తుంది. అది దాని పలకరింపు. ఎవరైనా 'ఛీ, పో' అని కసురుకుంటే తిరిగి వాళ్ల మొహం చూచేది కాదు. ఒకసారి ఒక సద్బ్రాహ్మణుడు చెట్టుక్రింద జపం చేసుకుంటున్నాడు. చిన్నకరుప్పన్ వెళ్లి ఆయన్ని ముట్టుకుంది. ఆయన అగ్నిహోత్రావధానులై దానిని కసిగా కొట్టాడు. అ దెబ్బతో అది ఆశ్రమం వదలి వెళ్లిపోయింది. దానికి ఎంత అభిమానమో!

ఆశ్రమంలో ఉండే జంతువులు, పక్షులు అన్నీ జ్ఞానం కోసం, కర్మ విమోచనం కోసం వచ్చి సేవ చేస్తున్నాయని మహర్షి చెప్పేవారు. సెగప్పన్, కమల గిరి ప్రదక్షిణ చేసేవారి వెంట వెళ్లేవి. వారికి సహాయంగా ఉండేవి. త్రోవలోని గుళ్లు, కోనేళ్లు, గుహలు భక్తులకు చూపించేవి. జాక్ మరింత సున్నితంగా, తెలివిగా ప్రవర్తించేది. మహర్షి శిష్యులతో ప్రదక్షిణకు బయలుదేరుతూ "జాక్, మేం ప్రదక్షిణ చేసి వస్తాం. నీవు టౌన్‌లోకి వెళ్లు" అనేవారు. అది కొండదిగి వెళ్లి వారికోసం ఎదురు చూచేది. "నీవు ఆశ్రమానికి వెళ్లిపో" అంటే వెళ్లిపోయేది. మళ్లీ భోజనం వేళకు తయారయ్యేది. దానిని భగవాన్ ఒక గొప్ప తపస్విగా వర్ణించేవారు. అది టౌనుకువెళ్లి దేవదాసి ఇంట ప్రసాదం తిని పూజారితో కలిసి కొండకు వచ్చి విరూపాక్ష గుహకు వచ్చి మహర్షిని దర్శిస్తుండేది. మళ్లీ సాయంత్రం నర్తకి ఇంటికి వెళ్లేది. మఠంచేరి నిద్రపోయేది.

మహర్షి ప్రేమకు, ఔదార్యానికి ఈ చిరు జంతువులు చక్కని ఉదాహరణలు. మహర్షి భక్తులకన్న వాటి అవసరాలు ముందుగా గమనించేవారు. నోరులేని జంతువులని కాదు– వారు మహా పురుషులని, అతిథులని. ఆశ్రమం బయట

నిలబడిన దరిద్ర నారాయణులకు ముందు ప్రసాదం పెట్టించేవారు. మిగిలింది ఆశ్రమ వాసులకు. ఈ సన్న జీవాలతో మహర్షికున్న అనుబంధం చెప్పుకోకపోతే మహర్షి కథ అసమగ్రం, అసంపూర్ణం అవుతుంది. తాను జంతువుల్ని, పక్షుల్ని, ఉడతల్ని, కోతుల్ని ఆదరిస్తూ ప్రేమస్వభావం మనుషులకు బోధించేవారు. వాటిని చీత్కరించుకుంటూ మహర్షి అనుగ్రహం పొందడం అసంభవం అని అందరికీ తెలుసు. మనిషి భగవంతుని ప్రేమించడం గొప్పకాదు. అందులో స్వార్థం ఉంటుంది. మనిషి సాటి మనిషిని ప్రేమించడంలోనూ ఒక తృప్తి, ఒక అవసరం ఉంటుంది. కాని నోరులేని జీవాలను ప్రేమించడంలో అసలు ప్రేమ సూత్రం ఉంది.

పాలితీర్థం వద్ద ఆశ్రమంలో ఒక ఆవు ఉండేది. ఆ ప్రాంతం అప్పట్లో అడవి. చిరుతల సంచారం ఎక్కువ. ఆవును చిరుతల బారి పడకుండా రక్షించడం కష్టమయ్యేది. దాని బిడ్డలలో ఒకదాని పేరు లక్ష్మి. ఆవును, దూడను పోషించమని ఊళ్లో ఒక ఆసామికి అప్పగించారు. పండగలప్పుడు, పబ్బాలప్పుడు దానిని ఆశ్రమానికి తీసుకు వచ్చేవారు. ఆ తర్వాత లక్ష్మి రోజూ ఆశ్రమానికి వచ్చేది. అది రాగానే దానికి మేత వేయాలి. ఆశ్రమం హాలులోకి వచ్చి మహర్షి దగ్గర నిలబడుతుంది. దాని ఒళ్లు నిమిరి పంపేవారు భగవాన్. "ఏం కావాలో చూడండ్రా, లక్ష్మి వచ్చింది". అది అన్నం తినేది. పళ్లు తినేది. సాయంత్రం ఊళ్లోకి తిరిగి వెళుతూ తిరిగి మహర్షిని దర్శించి మరీ వెళ్లేది. మహర్షి దానిని కణ్వాశ్రమంలోని శకుంతలతో పోల్చేవారు.





# 23. ఆశ్రమ పథం

**"శాంతమిద మాశ్రమ పథం"**

ఆశ్రమం అంటేనే ధ్యానులకు నెలవు అని అర్థం. ధ్యానానికి ప్రశాంత వాతావరణం అవసరం. కనుక ఆశ్రమాలు ఎప్పుడూ ప్రశాంత వాతావరణంలో ప్రశాంతంగా ఉంటాయి.

**నాటి** రమణాశ్రమం ఎలా ఉండేదో నేడూ అంత ప్రశాంతంగానే ఉంటుంది. నాగరికత రమణాశ్రమ ప్రశాంతిని భంగ పరచలేదు. అదనంగా కొన్ని కార్యక్రమాలు వచ్చిచేరాయి. రమణ మహర్షి ఉన్నకాలంలో ఆశ్రమం ఎలా ఉండేదో ఊహించడం ఇప్పుడు కష్టం. అయినా ఇప్పుడూ అక్కడ రమణ చైతన్యం ఉంది. అణువణువున రమణ స్పర్శ ఉంది.

ఆ రోజుల్లో పర్వదినాలలో, ఉత్సవ సమయాలలో జనం రద్దీ ఎక్కువగా ఉండేది. కార్తీక ఉత్సవాల కాలంలోనే మహర్షి జయంతి వస్తుంది కనుక, రమణ భక్తులకు అది మహోత్సవమే. మొదటిసారి రమణ మహర్షి జయంతి 1912లో జరపడానికి భక్తులు పూనుకున్నారు. మహర్షి వారించినా భక్తులు వినలేదు. ఆనాటి నుండి ఆ వేడుక సాగుతూ వస్తోంది. మహర్షి అభిషేకాలు, పూజలు అంగీకరించేవారు కాదు. తన ముందు కర్పూరం వెలిగించడానికి, కొబ్బరికాయలు కొట్టడానికి ఒప్పుకోలేదు. అయినా ఆయన మాట కాదని భక్తులు అష్టోత్తర నామావళి జపించడం, స్తుతి గీతా లాలపించడం, కర్పూరం వెలిగించడం లాంటి పనులు ఇళ్ల వద్ద చేసినట్లే ఆశ్రమంలోనూ చేసేవారు. పాద పూజ చేయడం,

పాదాలు కడిగి, ఆ జలాన్ని తలపై ప్రోక్షించుకోవడం, తీర్థంగా పుచ్చుకోవడం హైందవ సంప్రదాయం. వద్దని వారించినా వినేవారు కాదు. తర్వాత అవన్నీ రమణాశ్రమంలో సంప్రదాయాలైనాయి. గురువును భగవంతుని స్థానంలో నిలిపి ఆరాధిస్తే తప్ప ఆత్మోన్నతి కలగదని భక్తుల భావం.

శ్వేతాశ్వతర ఉపనిషత్ అదే చెబుతుంది.

**"యస్య దేవే పరాభక్తిః యధా దేవే తధా గురౌ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥**

*[ఈశ్వరుని పట్ల విశ్వాసం గలవారు, గురుదేవునిపట్ల అదే విశ్వాసం కలిగి ఉండాలి. గురువు ఈశ్వర సమానుడు. గురువే భగవంతుడు. గురువే బ్రహ్మం. జ్ఞానికి గురువు వేరు, భగవంతుడు వేరన్న విచక్షణ ఉండకూడదు].*

మహర్షి ఏదీ నోటితో చెప్పరు – చేసి చూపిస్తారు. ఆదర్శంగా నిలుస్తారు. ఏ విషయానికీ ఆత్రుత పడడం, కంగారు పడడం ఉండదు. ఉద్రేకపడడం అసలుండదు. **ఆధ్యాత్మికవేత్తకు హెచ్చు తగ్గు లుండకూడదు. మహారాజు పట్ల, బైరాగి పట్ల సమదృష్టి ఉండాలి. సమదూరం పాటించాలి. గొప్పవారిని ప్రత్యేకంగా గౌరవించడం, చిన్నవారిని చిన్నచూపు చూడడం – తగదు.** ఒక చెట్టియార్ ఆశ్రమానికి రెండు ఆవుల్ని బహూకరించాడు. మహర్షి వాటిని తిరస్కరించారు. ఆవులకోసం చిరుతలు వస్తాయి. జయంతికి ప్రత్యేక బందోబస్తు ఏర్పాటు చేయడానికి అంగీకరించేవారు కాదు. మహర్షికి సంగీతమంటే ఇష్టముండదు. ఒకామె మహర్షి సమక్షంలో అరంగేట్రం చేయాలని కోరుకుంది. ఆమె పాడినంత సేపు మహర్షి విగ్రహంలా నిగ్రహంతో కూర్చుండిపోయారు. కచేరి అయిన తర్వాత ఓ చిరునవ్వు చిందించి వెళ్లిపోయారు. అదే ఆశీస్సు. వారి చిరునవ్వే అభినందన.

నిత్యం తను సోఫాలో కూర్చుని దర్శనం ఇచ్చేవారు. రాత్రింబవళ్లు వచ్చేవారు వస్తుంటారు, పోయేవారు పోతుంటారు. మహర్షి సమక్షంలో కూర్చుంటే చాలు బాధలు తగ్గిపోయేవి. మహర్షిలో అతీంద్రియ శక్తులు, మహత్తులు ఆశించే వారికి నిరాశ ఎదురయ్యేది. అడిగిన వారందరికీ వరాలు అనుగ్రహించే స్వామి తను ఏమిటో తనకే తెలియదన్నట్లు ప్రవర్తించేవారు.

ఒకసారి ఒక సంఘటన జరిగింది. 'కులుమణి' నారాయణశాస్త్రి అనే పరమభక్తుడు మహర్షి దర్శనార్థం కొండపైకి వెళ్లాడు. ఆయన కొన్ని అరటిపళ్లు కొని, గుళ్లో అరుణాచలేశ్వరునికి సమర్పించాడు. మిగిలిన వాటిలో ఒకటి గణపతి విగ్రహం వద్ద నివేదన చేసి, 'ఆ గణపతి తినబోయాడా ఏమిటి?' అనుకుని, తిరిగి తీసుకున్నాడు. అరుణాచలేశ్వరునికి నైవేద్యం చేసిన పళ్లు అట్లాగే తిరిగి

తీసుకుని మూటకట్టుకుని కొండపైకి చేరాడు. వాటిని మహర్షి ముందుంచాడు. మామూలుగా ఒక శిష్యుడు వాటిని లోపలకు తీసుకు పోబోతుండగా మహర్షి ఆపి 'ఒకరికి నివేదన చేసిన పళ్లు మనకు వద్దు. తీసుకోవద్దు' అన్నారు తీవ్రంగా.

అలా జరిగిన సంఘటన గ్రహించడాన్ని 'చిత్తసంవిత' అంటారు పతంజలి. శాస్త్రిగారు తాను రాసిన రామాయణాన్ని మహర్షికి సమర్పించాలనుకున్నాడు. మహర్షి అతని మనసు చదివినట్లు "ఏదయ్యా! నీ రామాయణం చదివి వినిపించు" అన్నారు. మహర్షి తనను చూడవచ్చినవారు అడగకుండానే వారి మనస్సులోని మాట తనే చెప్పేవారు. మరెవరితోనో చెబుతున్నట్లు, వీరి సమస్య చెప్పేవారు. అలా వారి దృష్టిలో పడితే చాలు. అది పరిష్కరింపబడినట్లే. మహర్షి పాండిత్యం పరీక్షకు పెట్టాలని, వారిని ప్రశ్నలతో ఇబ్బంది పెట్టాలని ఎవరైనా వచ్చినప్పుడు అసలు నోరు విప్పరు. ఎంత అడిగినా మౌనమే.

బాహ్య ప్రపంచానికి సంబంధించిన విషయాలు ప్రశ్నిస్తే సమాధానాలు రావు. "అన్ని జవాబులకు కేంద్ర బిందువు ఆత్మ. ముందు ఆత్మను తెలుసుకో. అన్ని ఆనందాలు ఆత్మలోనే ఉన్నాయి" అనేవారు.

★ ★ ★

ఒకసారి మదురై నుండి ఒక వకీలు వచ్చాడు. ఆయన ప్రశ్నించాడు "దయ్యాలు, భూతాలు అంటారు. అవి నిజంగా ఉన్నాయా? ఉంటాయా?"

మహర్షి : నువ్వు ఉండగా లేంది అవి ఉండవా? వాటి మనుగడ వాటిది. నీలాగా అవీ బ్రతకాలిగా.

వకీలు : కుందేటి కొమ్ములాగా ఈశ్వరుడు, ఇతర దేవుళ్లు కల్పితాలంటాను!

మహర్షి : కల్పితాలు కావు. యదార్థాలు.

వకీలు : వారు మనలాగా ఉంటారా?

మహర్షి : మనుషులం మనకే ఇన్ని శక్తులుంటే, దేవతలు... వారికెన్ని ఉండాలి?

అమృతనాథ : ఇప్పుడు సిద్ధపురుషులు ఉన్నారా? సిద్ధుల లోకం ఒకటి ఉందా? వారి సిద్ధులు ఎలాంటివి?

మహర్షి : ఇప్పుడూ ఉన్నారు, ఎప్పటికీ ఉంటారు. మహేశ్వరానుగ్రహం ఉంటే సిద్ధులు లభిస్తాయి. అవి ఈశ్వర శక్తులు.



# 24. మహర్షి ధ్యాన వేదం

**"ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే**

**అప్రమత్తేన వేద్ధావ్యం శరవ త్తన్మయో భవేత్"**

*ధ్యానికి ప్రణవం విల్లు వంటిది. అంబు వంటిది ఆత్మ. లక్ష్యం బ్రహ్మం. దృష్టిని లక్ష్యంపై నిలిపి భేదనం చేయాలి. చూపులో, దృష్టిలో, విలుకానివలె సాధకుడు లీనం కావాలి. గమ్యం తప్ప దేనినీ చూడరాదు.*

**ఇది** రమణ మహర్షి ధ్యాన సూత్రం. ఉత్కృష్టమైన విధానం. ఉన్నత నినాదం. అదే 'మౌన' నాదం, మౌన వేదం. రమణ మహర్షి ధ్యాన శిఖరం. ఏది అడిగినా ఆయన సమాధానం మౌనం. ఆత్మ వైపు చూడమనేవారు. హృదయంలోకి చూచుకోమనేవారు. చెప్పినా స్వల్పంగానే. 'మౌనమే నీ భాష ఓ జ్ఞాన సింధూ!' వారి మాటల్లో అంతరార్థాలుంటాయి. వాచ్యాలకు నానార్థాలుంటాయి. రచనలు బహుళార్థ సాధకాలు. వాటిలో లౌక్యం ఉంటుంది, ఆధ్యాత్మికం ఉంటుంది, అలౌకిక భావన ఉంటుంది. అవి ముప్పేటలా పెనవేసుకుని ఉంటాయి – అర్థాలు, జ్ఞానాలు, తత్వాలు. శాక్తులకు ఆయన శాక్తుడు, శైవులకు శైవుడు, వైష్ణవులకు విశిష్టాద్వైతి. అందరికీ పుంభావ సరస్వతి. బృహస్పతి.

ఒకసారి అమృతనాథయతి రమణ మహర్షిని దర్శించాడు. ఆయన ప్రశ్నించాడు: "భగవాన్, తమరు హైందవ దైవతాలలో ఎవరి అంశ? తమరు విష్ణ్వాంశ సంభవులా? శివ గురు కార్తికేయులా? యతివరుడైన పరమశివుని అంశలో జన్మించారా?"

మహర్షి : రమణ ఏ ఒక్కరి అవతారం కాదు. ఎవరిదీ కాకుండా పోడు.

అయితే రమణ ఎవరు? ముస్లిములు, క్రైస్తవులు మహర్షి బోధల్లో వారి వారి సత్వాలు దర్శిస్తారు. ఆయన అందరివాడు.

"ధ్యానం – మౌనం – ఆత్మ" ఈ మూడు మాటల్లో రమణ మహర్షిని నిర్వచించవచ్చు. ఆయన ధ్యానానికి మరొక పేరు 'ఆత్మ విచారణ'. ఆయన మౌనానికి మరొక పేరు – గమనిక. అదే అన్వేషణ. 1901 – 02 శ్రీరమణుల యోగారంభ సమయం. అప్పుడు యోగానికి ఆధారం అంతఃకరణ. అంటే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం – ఆ నాలుగు జత పరిస్తే మనస్సు. వాటిని జయించడం తపస్సు. అందుకు నిగ్రహం, నియంత్రణ అవసరం. ఆ నాలుగింటిలో ఒకటైన మనసును జయించడం యోగలక్ష్యం. అది అంత సులభం కాదు. **మనో నిగ్రహం కావాలి. బుద్ధిని నియంత్రించాలి. చిత్తాన్ని శూన్యానికి కట్టి వేయాలి. అహంకారాన్ని తరిమి కొట్టాలి. అప్పుడు మనస్సు సాధకుని అధీనంలోకి వస్తుంది.** ఆ పని ఒక్క రోజులో జరగదు. ఒక్క ప్రయత్నంతో కుదరదు. క్రమంగా సాధించాలి. సాధించాలంటే తీవ్రసాధన చేయాలి. **బాహ్య ప్రపంచానికి దూరం అయినప్పుడే సాధన తీవ్రమవుతుంది.** మనం ఉండేదే బాహ్య ప్రపంచంలో. మనం బ్రతికేది దేనికోసం? మరి దూరం కావటం ఎట్లా సాధ్యం? బాహ్యాన్ని, ప్రపంచాన్ని వదలి ఎక్కడికి పోగలం? బాహ్యం పొలిమేరలు దాటితే అంతర్ ప్రపంచం. అందుకు ఏకాంతవాసం, మౌనం అవసరం. వాటినే రమణులు ఆశ్రయించారు. తద్వారా ఆత్మను సమాశ్రయించారు.

సాధకునికి ఉండే ఇబ్బంది అంతా మనస్సుతోనే. మనస్సు ఒక పట్టాన లొంగదు. స్థిమిత పడదు. మనస్సును వంచడానికే సంవత్సరాలు పడుతుంది. **మనస్సు వంగితే ధ్యానం కుదిరినట్లే. అప్పుడు ధారణ సాధ్యపడుతుంది. సమాధి సహజంగా ఏర్పడుతుంది.** సాధకునికి తొలినాళ్లలో అనుకూల వాతావరణం అవసరం. మొదట కష్టం అయినా తర్వాత అదే సుఖం అనిపిస్తుంది. ధ్యానానికి ఎన్నుకునే చోటు ప్రశాంతంగా, ఏకాంతంగా ఉండాలి, శుచిగా ఉండాలి. అందుచేతనే తాపసులు అరణ్యాలు, పర్వతగుహలు, నదీతీరాలు, దేవాలయాలు ఎన్నుకుంటారు. నిజానికి మనం ఉండే ఇంట్లోనే ఒక గది చాలు. స్థిరాసనం ఏర్పడాలి. మరీ ఎత్తుగా, మరీ పల్లంగా ఉండని పీఠం – ఒక బల్ల, కుర్చీ, పీట ఏదో ఒకటి. అరుగైనా చాలు. ఒక చాప, తుండు గుడ్డ, జింకచర్మం, ఆసనం ఏదైనా ఫరవాలేదు. ధ్యానానికి అనుకూలంగా ఉంటే చాలు. వెన్ను నిటారుగా నిలిపి కూర్చోగలిగితే చాలు. మనస్సు నిశ్చలం అయిన కొద్దీ ఆలోచనలు దూరంగా పోతాయి. మనస్సు ధ్యానం వేపు తిరుగుతుంది. చిరాకు, అలసట, తొందర

ఉండకూదదు. **అంటే కోప తాపాలు లేని స్థితి ఏర్పడాలి. అప్పుడు ఆలోచనలు నెమ్మదిస్తాయి.** ఆలోచనలు అదుపు తప్పినంత కాలం ధ్యానం కుదరదు. ఎంతసేపు కళ్లు మూసుకుని కూర్చున్నా ఒరిగేది ఉండదు.

మనస్సు శూన్యం కావాలంటే ఆలోచనలు లేకుండా పోవాలి. అది అంత సులభం కాదు. కనుక ఆలోచనలను దారి మళ్లించాలి. కలవరపెట్టే విషయాలపై నుండి మనస్సును వేరే ప్రశాంత విషయాలపైకి మళ్లించాలి. అందుకే ఒక మంత్రం, నామం, గురువు లేదా ఒక దేవుని పేరు అవసరం. **మంత్రంపైకి, గురువుపైకి, ఉపదేశంపైకి మనసు తిప్పితే, లౌకిక విషయాల నుండి మనసు క్రమంగా నిష్క్రమిస్తుంది.** ధ్యాని సంపూర్ణంగా ధ్యానంలో లీనం కావాలి. శ్వాస క్రమబద్ధమై నెమ్మదిస్తుంది. అసలు శ్వాసించడం లేదేమో అన్నంత అనుమానం కలుగుతుంది. **శ్వాసపై ధ్యాస తగ్గితే ఆలోచనలు తగ్గిపోతాయి.** శ్వాసను గురించిన బెంగ అవసరం లేదు. ప్రాణాయామం అవసరం లేదు. ధ్యానం పైన దృష్టి ఏర్పడితే చాలు. మనస్సు నిర్మలం అయ్యే వరకు, ఆలోచనలు అదుపులోకి వచ్చే వరకు శ్వాసపై సాధన తప్పు కాదు, కాని అవసరం లేదు. బలవంతపు ప్రాణాయామం ప్రమాదకరం. ప్రాణాయామం ధ్యానానికి మొదటి మెట్టు మాత్రమే. అదే ధ్యానం కాదు, యోగం కాదు, తపస్సు కాదు. ప్రాణాయామంతో కాలం వృధా చేసుకోవద్దని మహర్షి అనేకసార్లు హెచ్చరించారు. ఆత్మ విచారణ ముఖ్యం – ప్రాణాయామం కాదు.

ఏ పద్ధతి ధ్యానానికి అలవాటు పడితే పూర్తి విశ్వాసంతో అదే పద్ధతి కొనసాగించండి. మార్చునవసరం లేదు. పూర్వానుభవం లేని వారు, కొత్త వారు వచ్చినప్పుడు తన పద్ధతి చెప్పేవారు. ఏది ఆ పద్ధతి? 'నేనెవరు?' అని ప్రశ్నించుకోవడం – జవాబు హృదయంలోతుల్లో వెతకటం, తద్వారా గమ్యం చేరాలి. ఆత్మ దర్శనం పొందాలి. 'ఎవరంతట వారు నేనెవరు?' అని ఆత్మ విచారణ చేసుకోవాలి. చాలామంది శరీరాన్ని, మనస్సును విస్మరించే ప్రయత్నం చేస్తారు. శరీరం అంటే అవయవాలు, ఇంద్రియాలు, క్రియలు అన్నీ కదా! మనస్సు అంటే జ్ఞాపకాలు, ఆలోచనలు, కోరికలు, ప్రణాళికలు, అనుభూతులు, అనుభవాలు అన్నీ.

పరిప్రశ్న : "ఈ శరీరమే నేనా? లేక ఇంద్రియాలు నేనా?"

"ఏ ఒక్కటీ నేను కాదు. కావడానికి వీలు లేదు. వీటిని ఒక్కొక్కటి విడివిడిగా చూస్తాం. వీటిలో ఏ ఒక్క భాగం లేకపోయినా 'నేను' అనే భావనకు వచ్చే నష్టం లేదు. నేను అన్నది లేకుండా పోయేది మృత్యువు తర్వాతనే. **నిజానికి మరణంతో 'నేను' అన్నదీ నశించదు. భావన పోతుంది. ఆపైన మిగిలేది నేను".**

"అయితే మరణించేది ఏది?"

ఏది మరణిస్తుంది? పెక్కుమంది సిద్ధాంతం మరణంతో శరీరం మారుతుందని, ఆత్మ ప్రస్థానం కొనసాగుతుందని. మనం నిద్రలో శరీరాన్ని వదిలిపోతుంటాం. మనలోంచి ఏదో వేరై ఎక్కడెక్కడికో పోతుంది. 'అది' ఏమిటి? శరీరం ఇక్కడే ఉంటుంది. 'అది' తిరిగివచ్చి స్పందన కలిగేవరకు శరీరంలో శరీర గతమైన 'ప్రజ్ఞ' మిగిలి ఉంటుంది. ఇంద్రియాలు పనిచేస్తున్నా కదలని పరిస్థితి. అప్పుడు ఏం జరుగుతుంది? మేల్కొనగానే కలను విశ్లేషించుకుంటాం. కొందరు హిప్నటిక్ గాను అలాంటి అనుభవం పొందవచ్చు. మొత్తంమీద శరీరం నుండి 'నేను' వేరు కావడం జరుగుతుంది. అంటే శరీరం, మనస్సు, శ్వాస, జీవం, ప్రజ్ఞ – ఇవి ఆత్మకాదని తెలుస్తుంది. అయినా 'నేను' ఫలానా, 'నేను వేరు' అన్న భావం స్థిరపడుతుంది.

శరీరం, జీవం రెండూ ఆత్మ కానప్పుడు, మనస్సు తానే ఆత్మ అనే భావం కలిగిస్తుంది. భ్రమ కలిగిస్తుంది. అలా భావించడం తప్పు కాదు కాని ఆత్మకు అది దగ్గర దారి. మనస్సు అంటే ఆలోచనల కూడలి. ఆత్మకు, ఆలోచనలకు ఏదో సంబంధం ఉంది. ప్రపంచానికి సంబంధించిన ఆలోచనల్ని వదలి ఆత్మకు సంబంధించిన ఆలోచనల్ని ఆహ్వానిస్తాం. అంటే 'నేను'తో సంబంధం లేని ఆలోచనల్ని తిరస్కరిస్తున్నామన్నమాట. మన వ్యక్తిత్వానికి గుర్తు మేధ. మేధ ఆత్మను గుర్తిస్తుంది. కొంతకాలం అలా సాగుతుంది. **'ఇది కాదు, ఇది కాదు' అని వదిలించుకుంటూ పోతే అయినదేదో ఒక్కటే మిగులుతుంది.** అందులో వివేకం పాత్ర ఉంటుంది. మంచికి, చెడుకి మనిషి వివేకం ముందుకొస్తుంది. **మనస్సును శుద్ధి చేసే కార్యక్రమం మొదలైతే చివరకు అసలైన 'ఆత్మ' సత్పదార్థం మిగులుతుంది.** చివరకు 'వివేకం' సైతం రంగం నుండి నిష్క్రమిస్తుంది. 'ఆత్మ' జాగృతమవగానే వివేకం నిష్క్రమిస్తుంది.

అయినా 'శుద్ధాత్మ' ఉనికిని వివేకం తెలుసుకోదు. తను ఆత్మను చూడదు. ఆత్మ అన్నింటినీ చూస్తుంది. బయటకు చూడడం మాని లోపలకు చూడడం అవసరం. దీనినే కఠోపనిషత్ **'అవృత్తచక్షువు'** అంటుంది. వాస్తవానికి లోపలకు చూచేది కన్ను కాదు, వివేకం కాదు – ఆత్మ. ఆత్మ మాత్రమే ఆత్మను గుర్తిస్తుంది, ఆత్మ ఉనికిని తెలుసుకుంటుంది. దానిని వర్ణించడం, వివరించడం సాధ్యం కాదు. **'యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ'** ఆత్మను వర్ణించడంలో మనస్సు, వాక్కు నిరుపయోగం అవుతాయని తైత్తిరీయోపనిషత్ కథనం. కనుక ధ్యాన క్రియను సైతం వర్ణించ లేము. ఎవరి అనుభవం వారిది. ఎవరికి వారు అనుభవించ వలసిందే కాని వర్ణించ వీలులేనిది.

మహర్షి మాట్లాడరని, మౌనం పాటిస్తారని అంటుంటారు. కాని అది నిజం కాదు. తొలినాళ్లలో మహర్షి మౌనస్వామి. రమణాశ్రమం ఏర్పడిన తర్వాత ఆయన ఫిలాసఫర్. వచ్చే వారిని గమనిస్తారు. వారిపైన తన ముద్ర పడుతుంది. లోపల వారి గురించిన ఆలోచన సాగుతుంది. వారి సమస్యలు ఆటోమాటిక్‌గా పరిష్కారం అవుతాయి. వారు నోరు విప్పి అడగనవసరం లేదు, వీరు చెప్పనవసరం ఉండదు. దానినే **'అనుగ్రహ వీక్షణం'** అంటారు. అదే అనుగ్రహ రహస్యం. చూపు నిశ్చలం, శ్వాస నిశ్వాసం, స్థితి సమాధి. వచ్చిన వారు నమస్కారం చేసి కూర్చోగానే వర్కింగ్ ఆరంభమవుతుంది. ఆలోచనలు చకచక మారిపోతాయి. మహర్షి మాట్లాడరు. కాని ఆత్మతో అనుగ్రహిస్తారు. ఆర్తుల్ని ఆదుకుంటారు. మహర్షి శ్వాసలో సమాధానాలుంటాయి. అంచేతే వారు చూస్తే చాలు – ఇవతలివారి కళ్లు మత్తుగా మూసుకుపోతాయి. అది **'కుంభక' క్రియ**. మన మనస్సు మహర్షి మనస్సుతో ట్యూన్ అవుతుంది. శ్వాసను బట్టి మనస్సు పని చేస్తుంది. అంటే కొద్దిసేపు సమస్యలు, బాధలు మరచిపోయి శూన్యం కావడం జరుగుతుంది. ఈ అనుభవం భక్తులైన వారందరికీ సహజమే. కొందరు కూర్చుని 'అంతర్ముఖ' దృష్టిని అనుభవిస్తారు.

భక్తులు ఎవరూ ప్రశ్నించడానికి, కబుర్లు చెప్పడానికి రారు. కేవలం దర్శనం కోసం వస్తారు. దర్శనం ఒక్కటి చాలు వరాలు పొందడానికి. అన్ని బాధల్ని అక్కడ వదలి ప్రశాంతంగా, ఆనందంగా వెళ్లిపోతారు. కొందరు ధ్యానంలో సమాధి స్థితిని పొందుతారు. అది 'ఆత్మవిచారణ'లో భాగం. ఒకసారి కపాలిశాస్త్రి మహర్షిని ప్రశ్నించారు :


కపాలిశాస్త్రి

"శిష్యులైన వారు అనేక మంది గురువును దర్శించడం వల్ల గురువు గారి అభివృద్ధికి ఆటంకం కలుగుతుందా?"

మహర్షి జవాబు : "గురువుపట్ల విముఖత లేనంతవరకు నష్టం లేదు".

కొందరు ప్రశ్నిస్తారు : "ధ్యానానికి నియమాలు ఏమిటి?'

మహర్షి : **"రూపాలు, దీపాలు, భావాలు– అన్నీ కళ్లు మూసుకోగానే మాయమై పోతాయి.** ఆ శూన్యంలోకి మరొకదాన్ని ఆహ్వానించడం దేనికి? కావలసింది శూన్యమే గదా! చీకటిని చూడడానికి లైటు అవసరం లేదు. శూన్యంలో నడవడానికి గైడు అవసరం లేదు. ఆత్మజ్యోతి ఒక్కటి చాలు. అదే దారి చూపుతుంది. **ఆత్మను చేరాలనుకునే వారు ఎన్ని ఆధారాలు తెచ్చుకున్నా ప్రయోజనం ఉండదు. ఆత్మలో జీవించే వారికి ఏ ఆధారం అవసరం లేదు.**

రాముడు, కృష్ణుడు, సుబ్రహ్మణ్య స్వామి, ఏ ఇతర శక్తి రూపాలు కనిపించినా అభివృద్ధి ఆగదు. ఆ రూపాలు ధ్యానసమయంలో కనిపించడం ప్రాథమిక లక్షణం. తర్వాత వేటి అవసరం ఉండదు. అవి లోతులలో నిలబడవు. వాటిని ప్రక్కలకుతోసి ముందుకు పోవాలి. ద్వైతభావం ఉండకూడదు.

రూపాలను ధ్యానించకపోతే కొందరికి తృప్తి ఉండదు. భక్తుడు భగవంతుని పట్ల చూపించే విశ్వాసమే సాధకుడు గురువుపట్ల ఏర్పరచుకోవాలి. శ్వేతోపనిషత్ చెబుతుంది **"యస్య దేవే పరాభక్తి".** అందుచేతనే ధ్యానులు గురువు రూపాన్ని ఆవాహన చేసుకుంటూ గురు భావనపై ధారణ చేస్తారు. అదే ధ్యానంగా మారుతుంది. గురుధ్యానం, గురురూపం శిష్యునికి అవసరం. రమణమహర్షి భక్తులు ఆయన ఫోటో ద్వారా ఆయన రూపాన్ని సంభావిస్తారు, ధ్యానిస్తారు. తర్వాత ఆయన రూపమే తేజస్సుగా రూపాంతరం చెందుతుంది.

ఎవరైనా "భగవాన్, మీ రూపం పైన భావన చేస్తున్నాం" అంటే మహర్షి అంటారు "రూపాలు దాటి పొండి. చూచేది ఏదీ నిలవదు. ఆత్మ కనిపించదు. కనిపించని ఆత్మను అనుభూతించండి".

ధ్యానానికి ఒక భౌతిక రూపం, రూపం పైన ఏకాగ్రత, ధారణ తొలినాళ్లలో అవసరమని మహర్షి అంగీకరిస్తారు. అందరూ మహర్షులు కాలేరు గదా! పైకి ఎక్కే వరకే నిచ్చెన. ఆ తర్వాత నిచ్చెన వదలిపెట్టాలి. చేరుకోవలసిన గమ్యం దృష్టిలో నిలవాలి. సాధారణంగా భక్తుల అనుభవాలు ఒక్కలా ఉండవు. రామస్వామి అయ్యర్ అంటారు: "మహర్షిని చూడగానే నాలో ఏదో కరెంట్ పాసైనట్లు అవుతుంది. మహర్షి స్పర్శ తగిలితే చాలు శరీరం పులకిస్తుంది. మహర్షి స్పందన ప్రతి ఒక్కరిలో తెలుస్తుంది. ఎవరెన్ని చెప్పినా, చేసినా, చదివినా, వ్యాఖ్యానించినా, అందరి గమ్యం నిర్గుణ ధ్యానమే. నిర్గుణ బ్రహ్మాన్ని ఉపాసించడం ఉత్తమ మార్గం. నిర్గుణ ధ్యానం అందరికీ సాధ్యం కాదు. ఎక్కువ మంది సగుణాన్ని అభిలషిస్తారు".

1925 డిసెంబరులో సేలం నుండి కొందరు భక్తులు మహర్షిని దర్శించారు. వారిలో తిరుప్పుహల్ స్వామి ఒకరు. ఆయన భగవాన్‌ని ప్రశ్నించారు –

"గాయత్రీ మంత్ర జపం వల్ల ఏమైనా ప్రయోజనం ఉంటుందా?"

"ఉంది. గాయత్రి వల్ల ఎవరికీ నష్టం కలగదు. 'సవిత' అని ప్రారంభిస్తారు. చివరకు **"నమస్సవిత్రే జగదేక చక్షుసే"** అని ముగిస్తారు. అది ధ్యానానికి మంచిదే. జగత్తును దర్శించేది కన్ను. సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, నారాయణ, శంకరులను ధ్యానించడం. అలా ధ్యానించడం వల్ల సగుణం నుండి నిర్గుణానికి మారటం సులభమవుతుంది."



# 25. సద్గురు రమణ

**"గుశబ్దత్వ్యంధకారఃస్యాత్ రుశబ్దస్తన్నిరోధకః**

**అంధకార నిరోధత్వాత్ గురురిత్యభిధీయతే ।"**

*గు – శబ్దం అంధకారానికి గురుతు. రు – శబ్దం అంధకార నిర్మూలనకు సంకేతం. అజ్ఞానం అనే అంధకారాన్ని నిర్మూలించే వాడే గురువు.*

**"గురో రంఘ్రి పక్షే మనశ్చేన్నలగ్నం**

**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్!"**

*మనస్సు గురువు పాదపద్మాలలో లీనం కాని పక్షంలో ఏం ప్రయోజనం? సాధించేది ఏముంటుంది?*

**1**

ఎక్కడో పర్వతగుహల్లో, మారుమూల ఆశ్రమాలలో కూర్చుని తపస్సు చేసుకునే వారివల్ల దేశానికి ఏం ఉపయోగం? అనుకుంటారు సామాన్యజనం. వారికి తపస్సు విలువ, యోగం ప్రభావం, ధ్యాన మహిమ బొత్తిగా తెలియదనే చెప్పాలి. **లక్షల మైళ్ల దూరాన ఉన్న సూర్యుని వేడి, వెలుగు దగ్గరగా ఉంటే తట్టుకోగలమా? మహర్షులు దూరంగా ఉన్నా చాలు. వారి తపః కిరణాలు ప్రపంచం అంతటా వ్యాపిస్తాయి. కాలావధుల్ని దాటి ప్రసరిస్తాయి. యోగశక్తికి కాలం, దూరం అడ్డు కావు, అవరోధం అంతకన్న కావు.** సమాజాన్ని సక్రమ మార్గంలో పెట్టగలిగిందే మహర్షుల తపోశక్తి.

సద్గురు రమణ తపోశక్తి తిరువణ్ణామలైకే పరిమితం కాదు. అది రమణా శ్రమానికే పరిమితం కాదు. అది విశ్వవ్యాపితం. సద్గురునామం ఒక్కసారి స్మరించినా చాలు దాని ప్రభావం మనపైన ఉంటుంది. మన మనస్సు చలివేంద్రం అవుతుంది. సదాలోచన కలుగుతుంది. ఒక మహర్షిని విశ్లేషించడం అసాధ్యం. కొన్ని వందల వేల సంవత్సరాల వరకు ఒక్కొక్కరి ప్రతిభ ప్రసరిస్తుంది. వారి భౌతిక రూపాలకన్నా ఆత్మ శరీరాలు అద్భుతశక్తి వంతాలు. రూపాల కన్నా అరూప శక్తులు మరీ శక్తిపుంజాలు. మరణాన్ని జయించినవారు మహర్షులు, మహాత్ములు. మన మనస్సులు, భావాలు శరీరాలకు, రూపాలకు పరిమితాలు. ఆ వెనుక నున్న ఆత్మజ్యోతిని తెలుసుకునే శక్తి కలవారికి మహర్షులు అమరులు. ఇక్కడ మహర్షి భౌతికంగా లేకపోతే ఆయన లేనట్లు కాదు. అంతకు మించిన చైతన్యం అక్కడ ఘనీభవించినట్లు. 'మహర్షి లేడు కదా' అన్న భావం ఉన్నవారిపైన మహర్షి ప్రభావం పడదు. అందుకే శరీరాలు వదలిపోయిన మహర్షుల, మహాయోగుల ప్రజ్ఞను విశ్వాసంగల కొందరు మాత్రమే అందిపుచ్చుకోగలుగుతుంటారు.

రమణ మహర్షి వివాదాలకు ఎప్పుడూ అతీతంగా ఉండేవారు. ఏ విషయాలపైన అనవసరంగా చర్చించడం వారికిష్టం ఉండదు. మత, సామాజిక, రాజకీయాల గురించి అసలు చర్చించేవారు కారు. మనం అలా కాదు, మనం నమ్మినదాని కొమ్ము కాస్తాం. మనకు నచ్చని వాటిని విమర్శిస్తాం. అది ఆరోగ్యప్రదం కాదు. ప్రతి ఒక్కరికి తనకు హితవైన మార్గాన్ని అనుసరించే స్వేచ్ఛ ఉంది.

మహర్షి జీవన సూత్రం 'అహింస – సమత్వం – సర్వహితత్వం'. అహింస సరే. ఆశ్రమంలో సమానత్వం పాటించేవారా? కులాధిక్యత చూపిస్తూ 'బ్రాహ్మణస్వామి' అనడంలోనే తేడా కనిపిస్తుంది కదా! 'స్వామి' అంటే సరిపోదా? మహర్షికి పరిచర్యలు చేసిన వారిలో దళితులున్నారు, ముస్లిములున్నారు. అన్ని వర్ణాల వారున్నారు. మహర్షి అందరినీ సమంగానే చూచేవారు. 1917లో ఈ ప్రశ్న ప్రధానంగా చర్చకు వచ్చింది. కారణం అక్కడ పెత్తనం బ్రాహ్మలది. వచ్చేవారు ఎక్కువ మంది అయ్యర్‌లు. వారే ఆశ్రమాన్ని అతుక్కుని ఉండేవారు. స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు ధ్యానార్హత లేదనే వర్గం ఒకటి తయారైంది. వారిని రాకుండా చేసేవారు. కొందరిని నిరుత్సాహ పరచేవారు. మహర్షి తలచెడిన స్త్రీలను ఆదరించి కనికరించేవారు. అన్ని వర్ణాల వారికి ధ్యానార్హత కలిగించారు. సన్యాసం గొప్ప అని, సంసారాన్ని త్యజించి వచ్చేవారిని మహర్షి ప్రోత్సహించేవారు కారు. ధ్యానానికి గృహస్థ జీవితం ఆటంకం కానే కాదు. సన్యాసం అభిలషణీయమూ కాదు. సన్యాసులు తాము గొప్పవారమని, లోకాన్ని తమ ఆధ్యాత్మికతతో ఏదో

ఉద్ధరిస్తున్నామని అహంకరిస్తారు. అహంకారం గృహస్థులకు, సన్యాసులకూ మంచిది కాదు. ధ్యానంలో లోతులకు వెళ్లినకొద్దీ సన్యాసికి అహంకారం పెరుగుతుంది. అంచేత మహర్షి సమాజసేవకు ప్రాధాన్యం యిచ్చేవారు. అహంకారం తగ్గటానికి భిక్షాటన ఒక ఉపాయం.

★ ★ ★

ఒకసారి యోగనాథ అనే ఆయన మహర్షిని ప్రశ్నించాడు :

"మనిషికి ప్రశాంతి అవసరమా? లోకహితం అవసరమా? సమాజసేవ చేయని పక్షంలో ఆత్మశాంతి లభిస్తుందా?"

మహర్షి సమాధానం : ప్రజాసేవలోనూ మనశ్శాంతి లభిస్తుంది. తన శక్తిని, ధనాన్ని సాటివారికి ఉపయోగిస్తుండాలి. తర్వాత ఆత్మ జాగృతి విషయం చూసుకోవచ్చు.

అందుకు మహర్షి జీవన విధానమే చక్కని ఉదాహరణ. ఏ పనీ చేయకుండా ధ్యానంలో గడిపేవారు కాదు. రమణాశ్రమం ఏర్పడిన తర్వాత మహర్షి జీవన విధానం పూర్తిగా మారిపోయింది. 'జనహితం' ఎక్కువగా కోరేవారు. తాను ఒక మూలకూర్చుని ధ్యానం చేసుకునే సమయం తక్కువ. అందరితో కలిసి జీవించేవారు. ఆశ్రమంలో అన్ని పనులు చేసేవారు. భోజనాలకు విస్తళ్లు కుట్టడం, కూరలు తరగడం, పుస్తకాల ప్రూఫులు దిద్దడం, తోటపని, పక్షులకు, జంతువులకు మేత పెట్టడం. అంత చిన్న పనులు మహర్షి స్వయంగా చేయాలా? ఆ పనులు చేసేవారు ఉన్నారు గదా? ఆయన దృష్టిలో అన్నిపనులు విలువైనవే. వంట చేయడం కూడా ఆధ్యాత్మికమే అన్న స్థాయికి జనాన్ని తీసుకువెళ్లారు.

ఒక టీచర్ తరచు మహర్షిని కలుస్తుండేవాడు. ఆయనకు తాను 'భగవాన్' అనిపించుకోవాలని కోరిక. ఎన్నిసార్లు మహర్షిని దర్శించినా, ఆశ్రమంలో ఎంత కాలం ఉన్నా ఆయనకు వైరాగ్యం కలగ లేదు. మహర్షి వల్ల తనకు ప్రయోజనం లేదని ఆశ్రమానికి వెళ్లడం మానుకున్నాడు. పూర్తిగా తనకు వైరాగ్యం కలిగిన తర్వాత మహర్షిని దర్శించాలనుకున్నాడు. అతనికి ప్రాపంచిక వ్యవహారాలు పెరిగాయి తప్ప తగ్గు ముఖం పట్టలేదు. ఉన్న జిజ్ఞాస కాస్తా పోయింది. అప్పుడు దిగులుపడి మహర్షి వద్దకు పరిగెత్తాడు. మహర్షి ఆయన్ని చూడగానే ఫక్కున నవ్వారు –

"రెక్కలు రాని పక్షులు ఎగరాలని ఉబలాట పడుతుంటాయి. క్రింద పడుతుంటాయి. **ఆధ్యాత్మిక దృష్టి అలవడకపోతే లంపటాలు పోవు. పైగా పంతాలు పెరుగుతాయి**".

మహర్షి ఎందుకు నవ్వినట్లు? టీచర్‌కు అర్థం కాలేదు. **సంసారం నుండి తప్పించుకోడానికి చేసే ప్రయత్నం నిష్ప్రయోజనం. మనస్సు పరిణతి చెందడం ముఖ్యం. తర్వాత కొంతకాలానికి 'జీవితం' పట్ల సమగ్ర అవగాహన ఏర్పడుతుంది. ఏది ఎంత అవసరమో తెలుస్తుంది. ఏది త్యజించాలో తెలుస్తుంది. అది ఆధ్యాత్మికతకు సరైన సమయం.**

తర్వాత కొంత కాలానికి అతనికి బ్రతుకుమీద విరక్తి కలిగింది. అప్పుడు వెళ్లి తను సన్యసించడానికి అనుమతి కోరాడు. ఆ సమయంలో మహర్షి ఆనందంగా విస్తళ్లు కుడుతున్నారు.

"చూడు బాబూ? ఈ ఆకులు కుట్టడం అంత సులభమైన పని కాదు. చాలా జాగ్రత్త, శ్రద్ధ కావాలి. ఇందులో చిరిగిన ఆకులు, చిల్లులు పడ్డ ఆకులు ఉంటాయి. వాటిని ఏరి వేయాలి. విస్తరికి పనికిరావు గదా! ఇంత శ్రద్ధగా కుట్టిన విస్తరిని భోజనం తర్వాత అవతల పారేస్తాం. అవునా? మన శరీరాలూ అంతేనయ్యా! ఆత్మదర్శనం అయ్యే వరకే శరీరం అవసరం. అంతవరకు శరీరాన్ని కాపాడుకోవాలి తప్పదు. తర్వాత అంటావు ఎందుకీ శరీరం భోజనం తర్వాత పారేసే విస్తరిలాంటిదే గదా!"

అతనికి బుద్ధి వచ్చింది. ఉద్యోగం వదలాలని, సంసారం త్యజించాలనే ఆలోచన విరమించుకున్నాడు. **శరీరం అన్న తర్వాత దాని ధర్మాలు దానికుంటాయి. వాటిని గౌరవించాలి, పోషించాలి.**

"ఆధ్యాత్మికతకు, కుటుంబానికి, సమాజానికి ఏమి సంబంధం?" అని అడిగాడు.

"ఏవయ్యా, శ్రీరామునికి ఆధ్యాత్మికత ఉన్నట్లా, లేనట్లా! ఆయన గృహస్త జీవితం గడపలేదా! గృహస్తు అయినంత మాత్రాన ఆధ్యాత్మికత లోపిస్తుందా?"

★ ★ ★

రాఘవాచారి అనే సూపర్‌వైజర్ తరచుగా మహర్షిని దర్శిస్తుండేవాడు. అతని తల్లికి, భార్యకు బెంగ పట్టుకుంది ... అతను ఎక్కడ సన్యాసుల్లో కలిసి పోతాడోనని. వచ్చి రమణుని వద్ద మొరపెట్టుకున్నారు. మహర్షి అన్నారు :

"సరైన అవగాహన లేకుండా ఎవరూ సన్యసించకూడదు. అందుకు చాలా శిక్షణ కావాలి. మానసిక పరిపక్వత అవసరం."

మహర్షిని చూచి సన్యసించాలనిపిస్తుందిగానీ మహర్షిలా జీవించగల వారెందరు? ఇల్లు వదలి రమణాశ్రమం చేరినంత మాత్రాన అంతా రమణులై పోగలరా? ఏవో కుటుంబ బాధలు పడలేక మనశ్శాంతి కోసం వస్తారు. మహర్షి ఆశ్రమంలో రెండు రోజులు గడిపిన తర్వాత మనశ్శాంతి పొంది వెళ్లిపోతారు.

కొందరు మొండి వారుంటారు. ఎంత కష్టపడి అయినా సరే తపస్సు సాధించాలని అనుకుంటారు. అలాంటి వారు ఆశ్రమానికి అతుక్కుపోతారు. వారు నిజమైన మానసిక సన్యాసులు!

మహర్షికి తెలుసు వచ్చేవారు ఎవరు, ఎందుకు వచ్చేదీ!

## 2

## నటనానంద



**నటేశ** మొదలియార్ అనే ఆయన ఎలిమెంటరీ స్కూలు టీచరు. స్వామి వివేకానంద సాహిత్యం బాగా చదివాడు. సంసారంపైన విరక్తి పెంచుకున్నాడు. సన్యాసి కావాలన్న గట్టి సంకల్పంతో గురువుకోసం అన్వేషణ సాగించాడు. వివేకానందకు రామకృష్ణ పరమహంస దొరికినట్లు తనకూ ఓ పరమహంస దొరకాలని అభిలాష. ఆయన పరమహంస అంతటివాడై ఉండాలి. వారిని, వీరిని విచారించగా మిత్రులు చెప్పారు తిరువణ్ణామలైలో అటువంటి మహర్షి ఉన్నారని. ఆయన పేరు రమణమహర్షి అని తెలుసుకుని ఆయన వద్ద ఉపదేశం పొందాలని బయలుదేరాడు.

1918లో మొదలియార్ స్కందాశ్రమం వెళ్లి మహర్షిని దర్శించాడు. ఆయనకు ఎదురుగా కూర్చున్నాడు. ఆయన మౌనం వదలడు, మాట్లాడడు, తన వైపు చూడడు. తనకు ఆయన్ని పలకరించే ధైర్యం లేదు. ప్రశ్నించే ధైర్యం అసలు లేదు. 'ఎవరు నువ్వు? నీకేం కావాలి?' అని అడుగుతాడేమోనని చాలాసేపు నిరీక్షించాడు. స్నేహితులు చెప్పనే చెప్పారు. మహర్షి నుండి ఉపదేశం పొందడం కష్టసాధ్యం అని. విసుగుపుట్టి లేచి వెళ్లిపోయాడు. అయితే రమణ దర్శనం వృధా కాలేదు. ఎంత కష్టమైనా సాధించాలన్న పట్టుదల అతనిలో పెరిగింది.

తనకు ఒక సద్గురువు కావాలి! ఈ రమణ మహర్షి తనకు అందేలా లేడు. దేశంలో సద్గురువులే లేరా? ఉండరా? అని మరికొందరు గురువుల్ని చూచాడు. ఎవరూ తనకు నచ్చలేదు. వారెవరి నుండి ఉపదేశం పొందాలనిపించలేదు. మనస్సు నుండి మహర్షి రూపం తొలగిపోవడం లేదు. ఆయన అనుగ్రహం సంపాదించడం ఎలా? ఒక ఉత్తరం రాసి మహర్షికి పంపాడు "మీరు అనుమతిస్తే వస్తాను. నన్ను నిరాశ పరచవద్దు".

నెల రోజులు జరిగినా మహర్షి నుండి సమాధానం లేదు. తనంత

గొప్పవాడు ఉత్తరం రాస్తే జవాబు రాయరా? ఎంత పొగరు? ఎంత అహంకారం! ఈయన మాట మహర్షి విని తీరాలా? అడిగిందే తడవు ఉపదేశం ఇవ్వాలా?

మరొక ఉత్తరం రిజిష్టరు పోస్టులో పంపాడు.

"ఎన్ని జన్మలైనా నిరీక్షిస్తాను. మీ నుండి ఉపదేశం పొందాలన్నది నా ఏకైక వాంఛ. ఈ జన్మలో నాకు ఉపదేశం నిరాకరిస్తే, నా కోసం మీరు మరొక జన్మ ఎత్తవలసి వస్తుంది. నేను మిమ్మల్ని వదలను".

తర్వాత కొన్ని రోజులకు మహర్షి అతనికి స్వప్న దర్శనం ఇచ్చారు :

"సదా నా గురించే ఆలోచించకు. ముందు మహేశ్వరుని అనుమతి పొందు. మహేశ్వరుని గూర్చి ధ్యానించు. ఆయన అనుమతి ముఖ్యం. ఆయన అనుగ్రహం అవసరం. ఆ తర్వాత నా వద్దకు రా".

తర్వాత మొదలియార్ మహేశ్వరోపాసన ప్రారంభించాడు. తీవ్రంగా జపసాధన చేశాడు. కొన్నాళ్లకు వాసుదేవశాస్త్రి సంతకంతో ఒక ఉత్తరం వచ్చింది. "నీ రెండు ఉత్తరాలు అందాయి. మహర్షి ఎవరికీ జవాబులు రాయరు. వచ్చి నేరుగా కలుసుకో".

మధ్యన ఈ శాస్త్రి ఎవరు? మహర్షి గారి సెక్రటరీనా? మహర్షి ఆదేశం మేరకు రాసి ఉంటాడా? లేక ఈయనగారి స్వంత నిర్ణయమా?

తిరువణ్ణామలై చేరుకున్నాడు. ఒకరాత్రి అరుణాచలేశ్వరాలయంలో శయనించాడు. ఈశ్వరుని దర్శించాడు. ఆ రాత్రి ఒకరు వచ్చి అతని ప్రయత్నం వారించారు. "అయ్యా! నేను పదహారు సంవత్సరాలుగా మహర్షితో ఉంటున్నాను. ఆయన అనుగ్రహం ఇప్పటికీ నాకు లభించలేదు. ఆయన చాలా మొండి మనిషి. నువ్వు తల పగలకొట్టుకున్నా నీవైపు చూడడు. అనుగ్రహం పొందడం అసంభవం. దయచేసి నీ ప్రయత్నం విరమించి తిరిగి వెళ్లిపో" అని సలహా ఇచ్చాడు.

అయినా నటేశ మొదలియార్ చలించలేదు. మనస్సు మార్చుకోలేదు. "పోతే పోవయ్యా, నీ యిష్టం. ఉపదేశం పొందగలిగితే, అదృష్టవంతుడివి. లేదంటే ఆ పక్కన మరొకస్వామి ఉంటాడు, శేషాద్రిస్వామి. ఆయన దగ్గరకు పో. జాగ్రత్త. తన దగ్గరకు వచ్చే వారిని ఆయన చావకొడతాడు. శేషాద్రిగారి దయ సంపాదించావంటే రమణమహర్షి అనుగ్రహం పొందవీలవుతుంది."

మరునాటి ఉదయం నటేశ మొదలియార్ మరొక టీచర్ సుబ్రహ్మణ్య అయ్యర్‌ను తోడు తీసుకుని శేషాద్రిస్వామి అన్వేషణకు బయలుదేరాడు. ఫలితం లేక పోయింది. ఆయన జాడ తెలియలేదు. శేషాద్రిస్వామి ఎంత వెతికినా ఎవరికీ కనిపించడు. అవసరమనుకుంటే తనే ఎదురుగా ప్రత్యక్షమవుతాడు.

“మిత్రుడు హితవు పలికాడు. ఎందుకంత తొందర? కంగారు? అసలు జ్ఞానం అంటే ఏమిటి? వెతుకు ... ఏది అసత్యమో, అనవసరమో, అలా ఒక్కొక్క దానిని ఏరివేస్తూ పో. చివరికి మిగిలేది జ్ఞానం అవుతుంది. అదే భగవంతుడు. అదే ఈశ్వరుడు. అదే చివరికి మిగిలే సత్యం. అక్కడకు, ఇక్కడకు పరిగెత్తడం అవివేకం, అజ్ఞానం. ఒక పర్వతం పైన, ఒక గుహలోనే జ్ఞానం ఉంటుందా? భయం వదిలితే జ్ఞానం అబ్బినట్లే నయ్యా”.,

అది శుభారంభం. నటేశ మొదలియార్ ఆనందంతో కొండపైకి పరుగెత్తాడు. వెళ్లి, మహర్షికి ఎదురుగా కూర్చున్నాడు. అయిదారు గంటలు మౌనం. మాటా పలుకూ లేదు ఇద్దరి మధ్య. మహర్షి భోజనానికి లేవబోతుండగా నటేశ మొదలియార్‌ను చూపిస్తూ సుబ్రహ్మణ్య అయ్యర్ అన్నాడు, “ఇతనే మీ పేరున ఉత్తరం రాసింది స్వామీ”. మహర్షి అతనివైపు రెండు మార్లు నిశితంగా చూచి వెళ్లిపోయాడు. తర్వాత ప్రతి నెల మొదలియార్ ఆశ్రమానికి వచ్చేవాడు. పెదవి విప్పి మాట్లాడేవాడు కాదు.

అలా సంవత్సరం గడిచింది. అప్పుడు నటేశ మొదలియార్ మొదటిసారి మహర్షిని అడిగాడు : “స్వామీ, మీ అనుగ్రహం చవిచూడాలని కోరిక. జనం అనేక రకాలుగా చెబుతున్నారు. నాకు ప్రత్యక్షానుభవం కావాలి”.

మహర్షి : నా అనుగ్రహం అనుక్షణం లభిస్తూనే వుంది. నీవు గ్రహించలేకపోతే నేనేం చేయగలను.

ఆయన నిశ్చల సమాధినే అనుగ్రహంగా ఆకళింపు చేసుకున్నాడు మొదలియార్. అందరూ ఆశించేది అదే. ఆయన మౌనానికి అర్థం అనుగ్రహమే!

మిత్రులు సలహా ఇచ్చారు “ఏదైనా ఒక రూపం పైన, ఒక విగ్రహం పైన, మనసు నిలిపి ధ్యానం చేయమని”. అది తనకు ఇష్టం లేదు. తనకు అసలైన ధ్యానం కావాలి. కొన్ని రోజులకు మహర్షి కలలో దర్శనమిచ్చి అన్నారు **“నీ దృష్టిని బాహ్య, అంతర్ జగత్తుల నుండి నిష్క్రమింపచేయి. ధ్యానం కుదురుతుంది”.**

అంటే కంటితో చూచే లోకాల్ని విస్మరించడం అని అర్థం చేసుకున్నాడు.

“మీ వంటి మహాత్ములే సరైన మార్గం చూపకపోతే ఎవరు మాకు గతి” అర్థించాడు.

“అదే సరైన పద్ధతి. నీ అనుమానం తప్పు అనను. కాని నేను చెప్పినట్లు సాధన చేయి. కొద్ది రోజుల్లో ‘ఆత్మస్థితి’ తెలుస్తుంది!”

మొదట కలల్లో చెప్పిన మాటలు నమ్మలేకపోయాడు మొదలియార్.

"స్వప్నసందేశమే మహర్షి ఉపదేశంగా భావించి సాధన చేయసాగాను. మరొకసారి మహర్షి నాకు స్వప్నంలో కనిపించారు. ఆయన ప్రక్కన మా తండ్రిగారు ఉన్నారు. మా నాయన గారిని చూపిస్తూ "ఎవరీయన గుర్తించావా?" అడిగారు మహర్షి.

"మా నాన్నగారు" అన్నాను.

మహర్షి నవ్వారు. ఆ నవ్వులో వేదాంతం ఉంది. తత్వం ఉంది.

మహర్షి నన్ను దగ్గరగా పిలిచి, తన అరచేతిని నా తలపైన ఉంచారు. తర్వాత నాగుండెపైన నొక్కారు. చాలా బాధ అనిపించింది. అయినా అది వారి అనుగ్రహంగా భావించి భరించాను. రొమ్ము కుడివైపున ఎందుకు నొక్కారో అర్థం కాలేదు. అంతలో కల కరిగిపోయింది.

తర్వాత తెలిసింది **సాధకునికి 'దేహాత్మ బుద్ధి' ఉండదు అని.** దానిని వదలాలన్నది మహర్షి ఆదేశం. వారు **తలపైన స్పృశించడమే హస్తదీక్ష.** శిష్యుని **హృదయ స్థానంలో స్పృశించడం గురు అనుగ్రహం.** అప్పుడే గురుశక్తి శిష్యునిలోకి ప్రవహిస్తుంది.

కొన్నాళ్ల తర్వాత నటేశ మొదలియార్ మహర్షి దర్శనానికి వచ్చాడు. ఆయన వచ్చే సమయానికి కొందరు సన్యాసులు తమ తమ అనుభవాలు మహర్షికి నివేదిస్తున్నారు. వారంతా 'ఆత్మ' గురించి చెబుతున్నారు. అందరూ అనుభవజ్ఞులే. మొదలియార్‌కు వారి సంభాషణ వింటుంటే సిగ్గు వేసింది. తను ఎన్ని జన్మలెత్తితే వారికున్నంత జ్ఞానం తనకు లభిస్తుంది? అంతటి అనుభవం కలుగుతుంది! "వచ్చే జన్మలోనైనా నేను ఆ పరిస్థితికి చేరగలనా?" అనుకున్నాడు.

అతని నిర్వేదం మహర్షి గ్రహించారు. వారంతా వెళ్లిపోయిన తర్వాత మొదలియార్‌ను దగ్గరగా పిలిచి, "నీకెందుకయ్యా అంత దిగులు. మరొకరితో నిన్నెందుకు పోల్చుకుంటావు. నీకు కావలసింది నీకు అందింది గదా! ఇంకా తొందరపాటు ఏల? నీకు లభించలేదని ఎందుకనుకుంటున్నావ్? తర్వాత్తర్వాత నీకే తెలుస్తుందిలే. నీకు అర్హత లేకపోతే ఇంతదూరం వచ్చేవాడివే కాదు".

ఆ మాటలకు నటేశ మొదలియార్ మనస్సు ప్రశాంతమైంది.

నటేశ మొదలియార్‌కు, అతని కుటుంబ సభ్యులకు మహర్షి కలలో కనిపిస్తారు. అందరూ తిరువణ్ణామలై వెళ్లి భగవాన్‌ను దర్శిస్తుంటారు. వచ్చిన ప్రతిసారీ గొప్ప తృప్తిని పొందుతారు. అడిగిన వాటిని వెంటనే అనుగ్రహించరు మహర్షి. పరీక్ష పెడుతుంటారు.

1926లో నటేశ మొదలియార్ మహర్షిని కలిసి తనకింక సన్యసించాలని ఉందన్నాడు. "కుటుంబ జీవితంలో సుఖం లేదు. అలసిపోయాను. సమస్యలు ఎక్కువవుతున్నాయి. మనశ్శాంతి ఉండడం లేదు. ధ్యానానికి, సంసారానికి సయోధ్య కుదరడం లేదు" అని వాపోయాడు.

మహర్షి అతనిని ఊరడించారు : "చూడు మొదలీ, ఒక కష్టం వచ్చిందని పారిపోతే రేపు పది రకాల కష్టాలు రావని ఏముంది? సమస్యలు, కష్టాలు పరీక్షలు అనుకుంటే పోలా! మీ రెందుకు సన్యసించారని నన్ను అడగకు. అప్పటి నా పరిస్థితి, మనఃస్థితి వేరు. ఏదో వచ్చి పడ్డాను. అది అంతే. ఇక్కడినుండి దక్షిణంగా ప్రయాణంచేస్తే గంగానదికి చేరగలవా? అలానే ఇంట్లో ఎంతకాలం ఉన్నా వైరాగ్యం కుదరదు. సన్యాసం రాదు. ఇక్కడ ఉన్నప్పుడు నీకు సంసార బాధ్యతలు ఉండవు. **ఇంటివద్ద ఉన్నా ఆశ్రమంలో ఉన్నట్లే భావించు. సమస్య తీరిపోతుంది".**

అతను ఎప్పుడు సన్యాసం ప్రసక్తి తెచ్చినా మహర్షి అంగీకరించేవారు కాదు. ఒకసారి అతను కాషాయబట్టలు కట్టుకుని వచ్చాడు. మహర్షి నవ్వుకున్నాడు. కొన్నాళ్ల తర్వాత అతను సన్యాసం వదలి ఇంటికి వెళ్లిపోయాడు. మరలా ఉద్యోగంలో చేరాడు. అతను సన్యాసి వేషంలో ఉన్నన్ని రోజులు మహర్షిని అనేక ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టేవాడు. అవన్నీ కలిపి 'జ్ఞాన వాహిక'ను చేశాడు. తనకోసం రికార్డు చేసుకున్న విషయాలు జిజ్ఞాసులందరికీ జ్ఞానగుళికలైనాయి. మొదలియార్ అవసర సన్యాసం కొంతవరకు మంచిదే అయింది.

మహర్షి అనుగ్రహం మొదలియార్ కుటుంబానికి ఎప్పుడూ ఉండేదనడానికి ఒక ఉదాహరణ : అతని అన్నగారు మహర్షి వద్దకు వచ్చి, ఎదురుగా కూర్చుని లోపల అనుకున్నాడు "మహర్షిలో ఈశ్వరాంశ ఉందంటారు. అయినప్పుడు నా మనస్సు గ్రహించి నాకు ఆత్మస్వరూపం బోధించవచ్చు గదా!"

ఆరోజు మహర్షి అడగకుండానే శిష్యులందరికీ 'ఆత్మస్వరూపం' గురించి వివరణ యిచ్చారు. భక్తుల హృదయాలు గ్రహించడంలో మహర్షికి సాటి మహర్షి ఒక్కరే.

## 3

## రామనాథయ్యర్



**రమణ** మహర్షిని ఆరాధించేవారు రెండు రకాలు – శిష్యులు, భక్తులు. సంసారాలు వదలి సన్యసించి ఆశ్రమంలో చేరిన వారు కొందరు. కేవలం భక్తి పెంచుకుని సంసార పక్షంగా జీవించేవారు కొందరు. అప్పట్లో అలాంటి

వారిలో వైరాగ్యం పెరిగినా, సంసారం వదలని వ్యక్తి రామనాథయ్యర్. ఆయనలో వైరాగ్యానికి వైరాగ్యం, భక్తికి భక్తి, సంసార పక్షంగా జీవితం గడిపేవాడు. అయినా ఆయన యోగి. **"యోగి సంసారాన్ని త్యజించడు. సన్యాసం స్వీకరించడు. తపస్సు కొనసాగిస్తాడు ...విరాగి కాడు, సరాగీ కాడు– అన్నిటా సంయమనం పాటిస్తాడు."**

తంజావూరు జిల్లాలో ఒక పల్లెటూర్లో టీచర్ రామనాథయ్యర్. సెలవుల్లో విహారయాత్రకు వచ్చినట్లు రమణాశ్రమం వచ్చాడు. రమణ మహర్షి జీవితం చదివాడు. రామకృష్ణ పరమహంస జీవితం చదివాడు! మహాత్ముల జీవిత చరిత్రలు చదివితే మనస్సు ఊరుకుంటుందా? వద్దన్నా అటువైపు మొగ్గుతుంది. భార్యా బిడ్డల పోషణ బాధ్యత తప్పదు సంసారికి. అయినా లెక్కచేయకుండా తీర్థ యాత్రలు చేస్తుండేవాడు. ఎక్కడ మహాత్ములున్నారని తెలిసినా వెళ్లి దర్శనం చేసుకునేవాడు. అలాంటి యాత్రలలో తిరువణ్ణామలై ఒకటి. ఉద్యోగానికి రాజీనామా చేసి రమణాశ్రమం చేరాడు. ఎవరితో మాట్లాడేవాడు కాదు. చివరికి మహర్షి దగ్గర కూడా ముభావంగా ఉండేవాడు.

నగ్నంగా దేవాలయంలో కూర్చుని ధ్యానం చేసుకునేవాడు. కట్టు, బొట్టు, కులం, గోత్రం అన్నీ వదులుకున్నా 'గోచీ' వదలలేదు. అర్ధరాత్రివేళ పాలీ తీర్థంలో పీకల వరకు మునిగి ధ్యానం చేస్తుండేవాడు. ఎక్కడ నీటిలో మునిగి చస్తాడోనని ఆశ్రమవాసులు అతన్ని బలవంతంగా ఒడ్డుకు లాక్కొచ్చేవారు. ఆశ్రమం చుట్టూ చిరుతలు తిరుగుతుండేవి. అతను రాత్రనక పగలనక తిరుగుతుండేవాడు. అతని పిచ్చిచేష్టలు భరించలేక చివరికి ఒక గదిలో బంధించారు. అతనికి ఒకరు కాపలా ఉండాలి. అంత శ్రమ పడలేక ఒక శిష్యుని తోడిచ్చి ఊరికి పంపేశారు.

కొద్ది రోజుల తర్వాత మరల వచ్చి, పాండవ తీర్థంలో నగ్నంగా తపస్సు ప్రారంభించాడు. అతని భార్యా బిడ్డలు వచ్చి ఇంటికి రమ్మని వేడుకున్నారు. చివరికి రమణ మహర్షిని ఆశ్రయించారు. వెళ్లమని మహర్షి సలహా ఇచ్చినా అతను వినలేదు. భిక్ష చేస్తూ సన్యాసిగానే ఉండిపోయాడు.

## 4

## యోగిరామయ్య



**పళనిస్వామి** తర్వాత చెప్పుకోదగిన భక్త వరేణ్యుడు యోగిరామయ్య. ఈయన ముమ్మూర్తులా యోగి. రమణమహర్షి ప్రేమానురాగాలు పూర్తిగా పొందినవాడు. నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెం దగ్గర అన్నారెడ్డిపాలెం నివాసి. లెక్కకు మించిన ఆస్తిపాస్తులున్న

వాడు. 18వ ఏట కబీరు జీవితచరిత్ర చదువుతుండగా మనస్సు మారింది. వైరాగ్యం ప్రవేశించింది. ఒక గురువు రామతారక మంత్రం ఉపదేశించి రోజుకు అయిదువేల సార్లు జపించమన్నాడు.

"ఎక్కువసార్లు జపిస్తే ఏమవుతుంది?" రామయ్య ప్రశ్నించాడు.

"ఎంత ఎక్కువ జపిస్తే అంత మంచిది".

"సదా జపం చేస్తే?"

"అలాగే కానివ్వు" అన్నాడు గురువు.

రామయ్య రాత్రింబవళ్లు జపసాధన చేయసాగాడు. ఏపని చేస్తున్నా జప తత్పరుడై ఉండేవాడు. శ్వాసను స్తంభింప చేసేవాడు. వైరాగ్యం మరీ ముదిరి ఇంట్లో చెప్పకుండా కాశీకి బయలుదేరాడు. మధ్యలో గురువు కలిసి, యాత్రకు అమ్మగారి అనుమతి తీసుకున్నావా? అని అడిగాడు. లేదన్నాడు. ఆయన రామయ్యను ఇంటికి పంపాడు. "వెళ్లి, మీ తోటలో ఏకాంతంగా తపస్సు చేసుకో. నీవు కాశీ వెళ్లనవసరం లేదు" అని సలహా ఇచ్చాడు.

ఇంటికి వెళ్లి తోటలో కుటీరం వేసుకుని తపస్సు ప్రారంభించాడు. రామయ్యకు ఎవరి సాయం లేదు. మనసు నిశ్చలం అయింది. ఆనందంగా వుంది. మితాహారం. అహోరాత్రులు జపం. సత్వరం సమాధిస్థితి ఏర్పడేది. భ్రూమధ్యలో సూర్యచంద్రుల్ని, రాముని దర్శించాడు. రూపాలు అదృశ్యమయ్యేవి. తనూ అదృశ్యమయ్యేవాడు. తన అనుభవాలు పెద్దలకు చెప్పాడు. వారి వ్యాఖ్యలు ఆయనకు రుచించలేదు. తిరువణ్ణామలై వచ్చి, రమణుని సన్నిధిలో గణపతిమునిని ప్రశ్నించాడు.

"చూచింది వేరు – చూడవలసింది వేరు" అన్నారు గణపతిముని.

రామయ్య దిగులుగా మహర్షి వైపు చూచాడు. మహర్షి వెంటనే గణపతి ముని వ్యాఖ్యను సవరించారు. "భౌతిక లోకంలో, లౌకిక దృష్టికి అవి వేరుగా ఉంటాయి. సమాధిలో రెండూ ఒక్కటవుతాయి. చూచే నీవు – చూడబడే బ్రహ్మంలో లీనం కావడం జరుగుతుంది".

రామయ్యకు పరమానందమైంది. అది మహర్షి అనుభవంతో చెప్పినమాట. ఆనాటి నుండి రామయ్య మహర్షిని తన గురువుగా భావించసాగాడు. అయినా తన యోగం కొనసాగిస్తూనే వున్నాడు. మౌన తపస్సు. వాసన క్షయం జరిగే వరకు తపస్సు చేయాలన్న పట్టుదల. అతి స్వల్పంగా ఆహారం తీసుకునేవాడు. శ్వాసను గంటల తరబడి బంధించేవాడు.

సంవత్సరంలో కొన్ని మాసాలు రమణాశ్రమంలో ఉంటాడు. ఆశ్రమానికి యోగిరామయ్య చాలా సహాయం చేశాడు. పాలి తీర్థం బాగు చేయించాడు. ఆశ్రమ భవనాల నిర్మాణంలో చాలా ఆర్థిక సహాయం చేశాడు. డబ్బున్నవాడే కాదు మనసున్నవాడు యోగిరామయ్య.



## 5

## శుద్ధానంద భారతి

**రమణ** మహర్షి శిష్యవర్గంలో వరిష్ఠుడు, స్మరణీయుడు శుద్ధానంద భారతి. ఈయన పూర్వాశ్రమంలో సాహితీ పరుడు, జర్నలిస్టు. గురుకుల విద్యార్థి. అనేక వ్యవహారాలలో తలమునకలై ఉండేవాడు. ఎంతగా ప్రజాహిత కార్యాలలో పాల్గొన్నా, సమాజసేవ చేస్తున్నా దైవభక్తిని వదిలేవాడు కాదు. ప్రాణాయామం, తపస్సు ద్వారా నాద, కళా, బిందు, లయలు సాధించవచ్చునని నమ్మిన వ్యక్తి. నమ్మకం ప్రక్కనే అపనమ్మకం పొంచి ఉంటుంది. ఆశించిన ఫలితం కనిపించకపోతే చప్పున అవిశ్వాసం చొరబడుతుంది. అన్ని రకాల మత గ్రంథాలు చదివాడు. శ్రవణ బెళగొలాలో జైనమతం గురించి అధ్యయనం చేస్తున్నప్పుడు ఆయనకు రమణవాణి వినిపించింది. లేడికి లేచిందే పరుగు అన్నట్లు వెంటనే తిరువణ్ణామలై రైలెక్కాడు.

తిరువణ్ణామలై వెళ్లి శ్రీరమణుని చూడగానే ఆయనకు భగవాన్ ఒక విబూది ముద్దలాగా, మానవాకృతి ధరించిన విభూతిలాగా ద్యోతకమైనాడు. ఆ తర్వాత భగవానులే ఒక 'అగ్నిస్తంభం' అనిపించింది. తర్వాత 'శివలింగ' రూపంలో దర్శనమిచ్చాడు. మొదటగా మహర్షి ఆయనను పలకరించారు. అల్లంత దూరంలో ఉన్న గణపతిమునికి ముందుగా నమస్కరిస్తుండగా మహర్షి అన్నారు :

"భారతీ, భారతశక్తి, భారత భారతి" మహర్షి వివరణకు పరవశించాడు శుద్ధానంద. మహర్షి శుద్ధానందను తనతో భోజనానికి ఆహ్వానించాడు. ఆశ్రమంలో భగవాన్ ప్రక్కన భోజనం చేయడం గొప్ప అదృష్టంగా భావిస్తారు ఎవరైనా. భారతి మహర్షిని ఏ ప్రశ్నలూ వేయలేదు. మహర్షి వైపు తనవితీరా చూచాడు. మహర్షి దర్శనంతో, పరిచయస్పర్శతోనే శుద్ధానంద అంతర్ముఖుడైనాడు. అతనిలో అహంకారం పూర్తిగా నశించింది. తనను తాను మూడవ వ్యక్తిగా పరిచయం చేసుకున్నాడు. తను వేరు, శుద్ధానంద భారతి వేరు. 1929లో శ్రీ రమణాశ్రమంలో కొంతకాలం గడిపి, తర్వాత పుదుచ్చేరి శ్రీ అరవిందాశ్రమం చేరుకున్నాడు. అక్కడ భారతికి 'శక్తిపాతం' జరిగింది. ఆయన దృష్టిలో శ్రీఅరవింద, రమణమహర్షి ఇరువురూ రెండు జ్ఞాననేత్రాలు. ఇరువురూ సమానులే.



# 26. మలుపు తిరిగిన మహర్షి కథ : 'పాల్ బ్రంటన్' పాత్ర

**రమణ** మహర్షి ధ్యాన రోచిస్సులను సముద్రాలు దాటించి మహర్షిని విశ్వర్షిగా మలిచిన తొలి పాశ్చాత్య భక్త వరేణ్యుడు పాల్ బ్రంటన్.

పాల్ బ్రంటన్ ఇంగ్లండులో ప్రముఖ జర్నలిస్టు. శుద్ధానంద భారతి వలె మంచి రచయిత, సాహితీపరుడు. ఆంత్రోపాలజీ, ధర్మాలు, ఆధ్యాత్మికతం, మతం, వశీకరణంలాంటి అలౌకిక విషయాల పట్ల ఆసక్తి కలవాడు. చేస్తున్న ఉద్యోగం వదలి 1930లో ఇండియా వచ్చాడు. మాడం బ్లవట్‌స్కీ వలె భారతదేశంలోని యోగులు, మహర్షులపైన పరిశోధన చేయాలన్నది అతని సంకల్పం. భారతదేశం వేదభూమి, కర్మభూమి, తపోభూమి. ఇక్కడ అడుగడుగునా యోగులుంటారని, ఇది అంతా కీకారణ్యమని పాశ్చాత్యుల భావన.

పాల్ బ్రంటన్ తన తత్వజిజ్ఞాసలో భాగంగా చాలా దేశాలు పర్యటించాడు. ఈజిప్టులో రహస్య స్థావరాలలో ఉండే మాంత్రికుల్ని, తాంత్రికుల్ని కలిశాడు. బొంబాయిలో మహమూద్ బే అనే సూఫీ యోగిని చూచాడు. నాసిక్‌లో మెహర్ బాబాను, ఆయన గురువును దర్శించాడు. పూనేలో బాబా జాన్‌ని పరిచయం చేసుకున్నాడు. సుఖానంద రాజగోపాలస్వామిని, కాంచీపురంలో శంకరాచార్యను కలుసుకున్నాడు. కంచి శంకరాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర స్వామిని సేవించి తనకు జ్ఞానమార్గం చూపమని అర్థించాడు. ఆయనే పాల్ బ్రంటన్‌ను రమణ మహర్షి వద్దకు వెళ్లమని సలహా చెప్పాడు. తన శిష్యుడు వెంకటరమణిని బ్రంటన్‌కు

తోడుగా పంపాడు. తాను దేశ పర్యటనలో ఉన్నానని, తర్వాత వచ్చి దర్శనం చేసుకుంటానని చెప్పమని మరీ చెప్పి పంపాడు. కంచి శంకరాచార్య రమణ మహర్షిని తన హృదయస్థ గురువుగా భావించేవాడు.

పాల్ బ్రంటన్ మద్రాసు నుండి తిరువణ్ణామలై చేరుకున్నాడు. ఆశ్రమం చేరి మహర్షికి నమస్కారం చేసి ఎదురుగా కూర్చున్నాడు. మహర్షి సన్నిధిలో చాలా మంది భక్తులున్నారు. అందరూ నిశ్శబ్దంగా, ధ్యానంలో ఉన్నారు. మహర్షి ఎంతో నిర్మలంగా, ప్రశాంతంగా ఉన్నారు. భక్తుల తృప్తికోసం అలా కూర్చున్నాడేమో అనిపించింది. అంత నిబ్బరంగా, ప్రపంచం, పరిసరాలు ఏవీ పట్టనట్లు ఉండడం ఎలా సాధ్యం! అలా అనుకున్న మరుక్షణంలో అతని మనస్సు శూన్యమైంది. నిరామయమైంది. లోపల ఒక్క భావం కదలడం లేదు. తనలో చకచక వస్తున్న మార్పులకు ఉద్దుకుడుచుకున్నాడు, ఉక్కిరి బిక్కిరైనాడు. తన చుట్టూ కాంతి ప్రవాహాలు, తనలో శాంతి తరంగాలు. ఆలోచనలతో కలవరపడే మనస్సు క్షణంలో నిర్మలమైంది. ఇది ఎలా సాధ్యం? ఆ క్షణంలో అనిపించింది 'మనిషి వివేకమే సమస్యల్ని సృష్టిస్తుందని'. ఆ వివేకమే తను సృష్టించుకున్న సమస్యలకు పరిష్కారం వెదుకుతుంది. రెండింటికీ మనసే మూలం, ఆధారం. తనలో అంతటి శాంతికి, ప్రశాంతికి కారణం మహర్షి దర్శనం, మహర్షి వీక్షణం. ఆ విషయం తెలుసుకోడానికి క్షణకాలం పట్టలేదు బ్రంటన్‌కు.

"పూవు నుండి పరిమళం వెలువడినట్లు ఈ మహర్షి నుండి శాంతి జాలు వారుతోంది" అనుకున్న మరుక్షణంలో మనస్సు శూన్యం అయింది. అసలు ఆలోచించలేకపోయాడు. ఎంతటి నిర్వీర్యత. ఒక్క క్షణం శూన్యం రుచి తెలిసింది. శూన్యం ఎంత అద్భుతంగా వుంది! అనుకున్నాడు. అనుకోగానే తిరిగి తన పూర్వమేధ పనిచేయసాగింది యథా ప్రకారంగా. తర్వాత స్థిమితంగా మహర్షిని ప్రశ్నించాడు.

"మనిషి భౌతిక సంపదలు మించి ఆశించేది ఏదైనా ఉందా? అస్తిత్వాన్ని మించింది ఏది? దానిని తెలుసుకోవడం ఎలా?"

చాలా విజ్ఞతతో కూడిన ప్రశ్న. లోతుల్ని స్పృశించే ప్రశ్న అది. బ్రంటన్ ఆశించింది ఏమిటి? జీవితంకాక తద్భిన్నమైన సత్యం మరేదైనా ఉందా? అని. అది తెలుసుకోడానికి అనుభవం కావాలి. అతనికి మహర్షి సమాధానం చెప్పాలి.

కొంతసేపు అతనివైపు నిదానంగా చూచి మహర్షి అన్నారు.

"నేను, అనే మాట వాడారు. నేను తెలుసుకోవాలని అన్నారు. 'నేను' అంటే ఎవరు?"

పా.బ్ర. : మీ ప్రశ్న నాకు అర్థం కాలేదు భగవాన్.



పాల్ బ్రంటన్

మహర్షి : అర్థం కాలేదా? కాస్త లోతుగా ఆలోచించి చూడండి.

పాల్ బ్రంటన్ తన వైపు వేలు చూపిస్తూ "ఇది నేను, 'This is I' అన్నాడు.

మహర్షి : అతను నీకు తెలుసా?

పా.బ్ర. : జీవితం మొదటినుండి నేను పాల్ బ్రంటన్ నని నాకు తెలుసు.

మహర్షి : నీవు పాల్ బ్రంటన్ అంటున్నది ఈ శరీరాన్ని కదూ! మళ్లీ ప్రశ్నిస్తున్నాను. నీవెవరు? జరగవలసిన పని ఒక్కటే. నీలోపలకు చూడు. సరిగా, సవ్యంగా, లోతుగా చూడు. నీ సమస్యలన్నింటికీ సమాధానం దొరుకుతుంది. నీ ప్రశ్నలన్నింటికీ అక్కడ జవాబు దొరుకుతుంది.

పా.బ్ర. : ఏం చేయాలంటారు? ఎలా చేయాలంటారు? లోపలకు చూడడం ఏమిటి? ఎలా?

మహర్షి : అది నీ నేచర్. నీ నేటివిటి. స్వస్వభావం. ధ్యానం చేస్తే తెలుస్తుంది. ఆ వెలుగులో అన్నీ కనిపిస్తాయి.

పా.బ్ర. : చాలా సార్లు ధ్యానం చేశాను. సత్యంపైన మనస్సు పెట్టాను. ఫలితం లేదు.

మహర్షి : ఫలితం లేదని ఎలా చెప్పగలవు? ఆధ్యాత్మికంగా అభివృద్ధిని గుర్తించడం అంత సులభం కాదు.

పా.బ్ర : గురువు సహాయం అవసరమంటారా?

మహర్షి : అవసరం కావచ్చు గదా!

పా.బ్ర : మీ పద్ధతిలో మనిషి తన ఆత్మను తెలుసుకోగలడా! అందుకు గురువు సహాయం చేస్తాడా!

మహర్షి : గురువు నీ అన్వేషణకు అవసరమైన సరంజామా సిద్ధం చేస్తాడు. మీ అంతట మీరు అనుభవంతో, జ్ఞానంతో అందుకు సిద్ధం కావచ్చు.

పా.బ్ర. : గురువు సాయంతో ఎంత కాలంలో జ్ఞానం పొందగలను?

మహర్షి : నీ సాధన బట్టి, సంస్కారం బట్టి సమయం మారుతుంది. తుపాకి

గొట్టంలోని మందు భగ్గు మనడానికి క్షణం చాలు. బొగ్గు రగలడానికి చాలా టైం పడుతుంది గద!

పాల్ బ్రంటన్‌కు మహర్షి మనోగతం అర్థం కాలేదు. అతని అవగాహన పరిధి వేరు, మహర్షి ఆలోకనం వేరు. వాటికి ఆత్మ విచారణకు సంబంధం లేదు. పాల్ బ్రంటన్ విషయం మార్చాడు.

'ప్రపంచ భవిష్యత్తు ఎలా ఉంటుంది? ప్రపంచం క్లిష్ట సమయంలో ఉంది. దీనికి పరిష్కారం సూచించండి'.

మహర్షి : భవిష్యత్తు గురించి ఇప్పుడెందుకు ఆలోచన. ప్రపంచం గురించి మీరు ఎందుకు విచారిస్తారు? మీకు ప్రస్తుతం తెలియదు. వర్తమానం తెలియదు. వర్తమానం గురించి తెలియనివారు భవిష్యత్తును ఏం బాగు చేస్తారు! మీరు ప్రస్తుతాన్ని చక్కదిద్దుకోండి. భవిష్యత్తు తన పని తను చూచుకుంటుంది.

పాల్ బ్రంటన్ తన జర్నలిస్టు బుద్ధి పోనిచ్చుకున్నాడు కాదు. ప్రపంచం చెడిపోతోందని తాను ఏదో ఉద్ధరించాలని తపన, పాపం.

పా.బ్ర. : మాస్టర్! ప్రపంచ దేశాల మధ్య ఇకనైనా మైత్రి నెలకొంటుందా? లేక ఇలాగే వినాశం వైపు పరుగులు తీస్తుందా?

మహర్షి : పాల్! లోకాన్ని పాలించే వాడొకడున్నాడు. తను చూచుకుంటాడు ప్రపంచం సంగతి. ఈ ప్రపంచం బాధ్యత ఆయనది, ఆ పని నీది కాదు.

పా.బ్ర : ఏమిటో మాస్టర్! చుట్టూ చూస్తుంటే అంతా అయోమయం. ఎక్కడ సహాయానుభూతి కనిపించదు.

మహర్షి : నీవు ఎంతో ప్రపంచమూ అంతే. నిన్ను నీవు అర్థం చేసుకోకుండా ప్రపంచాన్ని ఏం అర్థం చేసుకుంటావు! అయినా అది సత్యాన్వేషుల పని కాదు. అలాంటి ప్రశ్నలతో కాలాన్ని, శక్తిని వృథా చేసుకోవద్దు. ముందుగా నీ వరకు సత్యాన్ని అన్వేషించు. సత్యాన్ని తెలుసుకో. తర్వాత నీచుట్టూ ఉన్న ప్రపంచాన్ని, ప్రాపంచిక సత్యాన్ని అవగాహన చేసుకోవచ్చు. ప్రపంచంలో ఉన్నది నీవు ఒక్కడివే కాదు. ప్రపంచం నీ వొక్కడితో లేదు. అసలు ప్రపంచానికి నీవు భిన్నం అని ఎందు కనుకుంటున్నావు?

మహర్షి కొంచెంసేపు మౌనం వహించి, నెమ్మదిగా ధ్యానంలోకి నిష్క్రమించారు. ఆ సమయంలో పాల్ బ్రంటన్‌ను లోతుగా పరిశీలించారు. పాల్ బ్రంటన్ కలో నిజమో తెలియని స్థితిలో పసివాడుగా మారిపోయాడు. అదొక చిత్రం. ఒక దృశ్యమాలిక. మహర్షి తనను చేయిపట్టుకుని అరుణాచలంపైకి నడిపిస్తున్నారు. మహర్షి తన మొహం వైపు నిశితంగా చూచారు. తను భగవాన్

కళ్లలోకి చూచాడు. ఆ చూపుల కలయికలో ఒక శక్తి విస్ఫోటన. తన మనస్సు, హృదయం క్షణంలో ఎన్నో మార్పులకు లోనైనాయి. ఇంతవరకు తన తలకు చుట్టుకున్న ప్రశ్నలు, సమస్యలు, భావాలు అన్నీ అంతరించిపోయిన అనుభూతి కలిగింది.

మహర్షి ఆదేశించారు కొండ క్రిందకి చూడమని. తను చూచాడు. ప్రపంచం మొత్తం ఒకగోళంగా కనిపించసాగింది. పశ్చిమార్థ గోళం కొండ దిగువన ఒకవైపున పరుచుకొని వుంది. దాన్నిండా కోట్లాది మనుషులు కిటకిటలాడుతున్నారు. వారి రూపాలు గడ్డకట్టి ఘనీభవించాయి. వారంతా అంధకారం వేపు సాగుతున్నారు.

మహర్షి ప్రశ్నించాడు –

“నీవు తిరిగి నీ లోకంలోకి వెళ్లినా ఇప్పటి ప్రశాంత మనఃస్థితి ఉంటుంది. ‘ఈ శరీరం నాది, ఈ మనస్సు నాది’ అని అనుకోవడం మానుకో. అప్పుడు నీకు ఆత్మ విలువ తెలుస్తుంది. ఆ సంయమనం, ప్రశాంతి ఎక్కడనుండి వచ్చిందీ గమనించు. అప్పుడు నీ స్వంత ఆలోచన ఉండదు. మూలం వరకు వెళ్లిపో.. గమనిస్తూ ముందుకు సాగిపో.”

మహర్షి ఒక వెలుగు కిరణాన్ని తనకు అందించారు. అది వెండిలా మెరుస్తోంది. ఆ స్థితిలో పాల్ బ్రంటన్ స్వప్నం చెదిరింది. వాస్తవంలోకి తిరిగి వచ్చాడు.

మెలకువ రాగానే పాల్ బ్రంటన్ తన ఆలోచనల తుట్టె కదిలించాడు. మరల మనసు నిండా సమస్యలు, ఆలోచనలు. పరిష్కారం కోసం ఆరాటం, పోరాటం.

మహర్షి ఎవరినీ తన పంథాలోకి బలవంతాన రప్పించరు, అందుకు ప్రయత్నించరు. తనకు అభిమానులు, అనుయాయులు, శిష్యులు కావాలని కోరరు. అసలు ఎవరినీ పట్టించుకునే స్వభావం కాదు ఆయనది. ప్రపంచంలో ఏదీ ముఖ్యం అనుకోరు.

స్వప్నానుభవం తర్వాత పాల్ బ్రంటన్ మహర్షిని చూచినప్పుడల్లా తనలో ఏదో స్పందన అనుభవించసాగాడు. తనకు తనే కొత్త అనిపించసాగింది. తన లోగడ ప్రవర్తనకు నేటి ప్రవర్తనకు సంబంధం లేదు. ఆలోచనలు, భావాలు ఘర్షణ పడుతున్నాయి. నిన్నటికి నేటికి పొంతనలేదు. ఎంతలో ఎంత మార్పు! ఎంత పరిణామం! పరిణతి! మహర్షి సమక్షంలో ఉన్నంతసేపు అసలు ఆలోచనలే ఉండడం లేదు. మనస్సు బ్లాంక్ అవుతోంది చిత్రంగా.

మహర్షి అంత పట్టనట్లు ఎలా ఉండగలుగుతున్నారు? దేనికీ చలించని తనమే స్థిర సంకల్పమా! స్థిత ప్రజ్ఞత్వమా? ఆయనకు సమస్యలే ఉండవా?

ఉన్నా పట్టించుకోరా? ఏ దిగులు ఉండదా! తన జీవితం తనది. సన్యాసి జీవితం ఎంత కష్టం? అందులో ఏం ఆనందం ఉందో? అదే మహర్షిని ప్రశ్నించాడు.

పా.బ్ర : మాస్టర్! సత్యాన్ని అన్వేషించే వారు అరణ్యాలకు, కొండగుహలకు వెళతారు, జనాలకు దూరంగా ఉంటారు. పాశ్చాత్య దేశాల వారికి అలాంటి జీవితం సరిపడదు. మా ఊహకు సైతం అందనిదది. మీరు నా అభిప్రాయంతో ఏకీభవిస్తారా?

మహర్షి : ఎవరూ నిత్య నైమిత్తికాల నుండి పారిపోరు. పోలేరు. సత్యాన్వేషణ కోసం ఎవరూ వేటినీ వదులుకోనవసరం లేదు. రోజుకు ఒకటి రెండు గంటలు ధ్యానం చేసుకుంటూ మిగిలిన పనులన్నీ యదావిధిగా కొనసాగించ వచ్చు. ఏ పనుల్ని వదలనవసరం లేదు. **అన్ని పనులు చేస్తూ మనస్సును ధ్యానమగ్నం చేస్తే చాలు. అప్పుడు మనో నిశ్చలత కోల్పోవడం జరగదు. అందుకు రెండు మార్గాలున్నాయి. నీవు ధ్యానంలో అనుసరించే పద్ధతులను నిత్య కృత్యాలతో జతపరచవచ్చు.**

పా.బ్ర : అలా పార్ట్ టైంగా ధ్యానం చేస్తే ఫలితం ఉంటుందా?

మహర్షి : ఉంటుంది. **కాలం గడుస్తున్న కొద్దీ సాటి మనుషుల పట్ల, సంఘటనల పట్ల, వ్యవహారాల పట్ల అవగాహన, ఆలోచన మారుతుంది.** నీ ధ్యానానికి అనుగుణంగానే సంఘటనలు, స్థలాలు ఏర్పడుతుంటాయి. అయితే మనిషి **తనను ప్రపంచంతో గట్టిగా కట్టివేసే స్వార్థాన్ని పూర్తిగా వదులుకోవాలి. తన కృత్రిమత్వాన్ని వదులుకోవడమే నిజమైన వైరాగ్యం.**

పా.బ్ర. : ప్రాపంచిక వ్యవహారాలలో తలమునకలవుతూ స్వార్థ రహితంగా బ్రతకడం ఎలా సాధ్యం?

మహర్షి : చేసే పనికి, బుద్ధికి సమతుల్యత సాధిస్తే సరి. వైరుధ్యం ఉండదు.

పా.బ్ర : అంటే పాతజీవితపు అలవాట్లు మారకుండానే జ్ఞానం పొందగలమా?

మహర్షి : తప్పు లేదు. కాదంటే తన పూర్వ వ్యక్తిత్వ భావనను పైకి తీసుకు రాకూడదు. పూర్వం మనిషి ఈ పనులు చేస్తున్నట్లు భావించకూడదు. అప్పుడు పరిణామం సాధ్యం. అనూహ్యంగా మార్పు వస్తుంది. అప్పుడు ఏ స్వార్థం మిగలదు.

పా.బ్ర : పనుల్లో పూర్తిగా లీనం అయితే ధ్యానానికి టైం ఎక్కడుంటుంది?

మహర్షి : కొత్తగా ధ్యానం మొదలుపెట్టే వారికి ఒక సమయంలో ధ్యానం చేయాలి అనే నియమం ఉంటుంది. అది అవసరం కూడా. **కాలం సాగినకొద్దీ ఏ పని**

**చేస్తున్నా ధ్యానం సాగుతూనే ఉంటుంది.** సమాజంలో ఉంటూ అన్నిపనులు చేస్తూ, మనసులో ధ్యానం కొనసాగించవచ్చు.

పా.బ్ర. : అంటే ప్రత్యేకించి యోగం చేయవలసిన అవసరం లేదంటారా?

మహర్షి : యోగి చేసే పని ఏమిటి? మనసును యోగ క్రియవైపు మళ్లించడమే గదా! పశువుల కాపరి కర్రతో పశువుల్ని త్రోవలోకి మళ్లిస్తాడు! సత్యాన్వేషికి కర్ర అవసరం లేదు. కాస్త పచ్చగడ్డి పట్టుకొని ముందు నడుస్తుంటే చాలు. పశువులన్నీ అటు దిశగానే నడుస్తాయి.

పా.బ్ర. : అదెట్లా సాధ్యం?

మహర్షి : ఎట్లా అంటే? ఆ ప్రశ్న నిన్ను నీవు వేసుకో! 'నేనెవరు?' అని ప్రశ్నించుకో. జవాబు కోసం నీలోపల వెతుకు. మనస్సుకు ఆవల జవాబు దొరుకుతుంది. ఆ ఒక్క సమస్యను నీవు పరిష్కరిస్తే మిగిలిన సమస్యలన్నీ పరిష్కారమయినట్లే. పోనీ, ఇలా ఆలోచించి చూడు. మనుషులందరి ధ్యేయం ఒక్కటే కదా! సుఖపడడం, విచారాలు, బాధలు లేకుండా హాయిగా జీవించడం, ఆ సుఖం కూడా తరుగు లేకుండా ఉండాలి, దేనికీ అంతం ఉండకూడదు ... అదీ అసలు భావన. అనంతమైన ఆనందాన్ని పొందడం ముఖ్యం. ఆనందాన్ని అనంతంగా పొందగలగాలి. అయినా తమని తాము ప్రేమించుకుంటున్నారా? ఇష్టపడుతున్నారా? ఏదో విధంగా సుఖపడాలి. ఆ సుఖం తమకు సంతోషం కలిగించేదై ఉండాలి. మతం, మద్యం, వ్యసనం, కళలు ఎందుకు? ఆనందం కలిగించడానికే గదా! వాటిలో మానవనైజం తెలుస్తుంది. మనిషి స్వభావం బయట పడుతుంది. అంటే ఏమటి? స్వభావతః మనిషి ఆనందాన్ని ఆశిస్తున్నాడు. మానవ నైజంలోనే ఆనందాకాంక్ష ఉంది. అదిగో ఆ చిదానందం కోసమే మనిషి తనలో అన్వేషించాలి. అందుకే ఆత్మాన్వేషణ, ఆత్మవిచారణ. ఆత్మకు నాశం లేదు. ఆత్మ అవినాశి. అంటే ఏమిటి? మనిషి ఒకసారి ఆనందం రుచి మరిగితే వదలడం జరగదు. ఆనందమూ అతనిని వదలదు.

పా.బ్ర : లోకంలో అంత ఆనందం ఎక్కడుంది స్వామీజీ! లోకం ఆనందంగా లేదు. లోకంలో ఆనందం లేనే లేదు.

మహర్షి : ఆనందం ఉన్నదని గుర్తించని అజ్ఞానంలో లోకం ఉన్నది. కనుక ఆనందం కనిపించడం లేదు. అజ్ఞానం వదిలితే ఆనందమే కదా. మనుషులు తెలిసీ తెలియని ఆనందాన్ని మాత్రమే వాంఛిస్తుంటారు. కాంక్షిస్తుంటారు. కాని దాని కోసం ప్రయత్నించరు. అన్వేషించరు. పాపపు పనులు చేస్తో ఆ పాప కృత్యాలలోనే ఆనందం పొందుతున్నామన్న భ్రమలో ఉంటారు. మీకు

కావలసింది ఆనందం కాదు, సుఖం. సుఖాన్ని కాంక్షిస్తారు. ఆనందం అన్వేషిస్తే గానీ లభించదు. అది ఆత్మవంచన అనిపించదు. ఆనందం బయట లభించదు. లోపలకు వెళ్లవలసిందే. 'చెడు' మార్గాలలో లభించేది ఆనందం కాదు. ఇంద్రియ తృప్తి. దానినే ఆనందం అని పొరపడుతుంటారు.

పా.బ్ర : మీరు చెప్పే ఆత్మానందంలో ఆత్మ వేరు, ఆనందం వేరు గదా స్వామీ! ఆనందం పొందే ఆత్మ వేరు. అవునా! మనిషిలో 'ఆత్మ' వేరనిపిస్తోంది.

మహర్షి : మనిషికి రెండు ఆత్మలుంటాయా? ఆలోచించు. ఆత్మకు రెండు పార్శ్వాలుంటాయి. ఎవరికి వారు విశ్లేషించుకోవాలి. మనిషి స్వతంత్రంగా ఆలోచించడు. ఇతరులవలె తనూ ఆలోచిస్తాడు. 'నేను' అన్నది వివేచించుకోగలగాలి. తాను అంటే శరీరం, బుద్ధి అనే భావన పోవాలి. అందుకే 'నేనంటాను' 'నేనెవరు?' అని దీర్ఘంగా విశ్లేషిస్తూ అన్వేషించమని.

పా.బ్ర. : నేనెవరు అంటే నిజాత్మ అనే కదా స్వామీ?

మహర్షి : నిజాత్మ గురించి ఏం చెప్పను! ఎట్లా వివరించను? 'అది' నేను అనే భావన ఉత్పత్తి అయ్యేచోటు. నేను అనే భావం లీనం అయ్యేదీ అందులోనే. అది నిజాత్మ.

పా.బ్ర. : లీనం కావడం అంటే అంతర్ధానం కావడమా? అంతరించి పోవడమా? అసలు లేకుండా పోవడమా? అలా జరిగితే వ్యక్తిత్వం మిగలదేమో?

మహర్షి : అసలు ఆలోచనలకు మూలం ఏది? మూలమైంది ఏది? మనిషి మనస్సు ఒక తెర లాంటిది. 'నేను' అన్నది ఆ తెర మీది బొమ్మ. కనిపించని బొమ్మ. ఉన్నదనిపించే భావ చిత్రం అది. మనిషి మొదటి ఆలోచనే నేను. దాని తర్వాత మిగిలిన ఆలోచనలు పుట్టుకొచ్చాయి. అంటే మనస్సు తొలిచూలు 'నేను' అన్న అహంకారం. మలిచూలు 'నీవు' అన్న దృశ్యం. ఇప్పుడు నీవు చేయవలసిన పని నేను అనే దారం పట్టుకొని దాని ఉద్గమస్థానం, అంటే మూలానికి చేరాలి. అది మూలస్థానం. అదే భావమూలం. అంటే ఏమిటి? ఎక్కడి నుండి 'నేను' అనే భావం ఉదయించిందో తిరిగి అక్కడకు చేరి అందులోనే లయిస్తుంది. ఇది అనుభవంలోకాని అర్థంకాని విషయం. వివరించడం, వర్ణించడం కుదరదు.

పా.బ్ర : మన లోపలికి విశ్లేషిస్తూ మనస్సు లోపలికి చొచ్చుకుపోవడం సాధ్యమా? అని నా అనుమానం.

మహర్షి : మనస్సులోకి కాదు. హృదయంలోకి చొచ్చుకుపోవడం సాధ్యమే. లోపలకు

నిష్క్రమించడం కష్టం కాదు. 'నేను' అనే భావం ఎక్కడ పుట్టిందో దాని జన్మ స్థావరం చేరడమూ సాధ్యమే.

పా.బ్ర : అప్పుడు మిగిలేది ఏముంటుంది? మరీ అవివేకం చుట్టుకోదా. నేను 'బుద్ధి' లేనివాణ్ణి అవుతానేమో! 'వివేకం' భ్రష్టుపట్టి పోతుంది గదా? అప్పుడు చైతన్యం మాత్రం మిగిలి ఉంటుందంటారా?

మహర్షి : అది చైతన్యం లేని జడత్వం కాదు. చైతన్య పూర్ణ జడతత్వం. మహా చైతన్యం నీదవుతుంది. 'నేను' అనే భావం వ్యక్తిగతం. శరీరాన్ని, మనస్సును 'నాది' అనుకుంటావు తప్ప మహాచైతన్యం నాది అనుకోవు. చైతన్యం నిన్ను పూర్తిగా ఆక్రమించి నీ మనస్సుకు పనిలేకుండా చేస్తుంది. ఆలోచించే అవసరం ఉండదు. అసలు ఆలోచనల అవసరమే ఉండదు. **చైతన్యంలో నీవు ఒక అణుమాత్రం. మనసువెనక ఆలోచనలకు అందని తీరాన ఆచైతన్యం అనంతంగా ఉంటుంది. అది దివ్యం. అది ఆత్మికం.** అది ఈశ్వరీయత. అక్కడ అప్పుడు అంతా స్వేచ్ఛ. ఏ పేరు పెట్టినా, ఆ స్థితిని పొందిన వారు తన్మయులవుతారు. 'తన్మయత్వం' అంటే విశ్వ చైతన్యంలో విలీనం కావడం.

మనిషి ఆత్మశోధన చేసేవరకు, ఆత్మ విచారణ జరిపే వరకు సంశయాలు తీరవు. అనుమానాలు వదలవు. మహా చక్రవర్తులు దేశాధినేతలు ఉన్నారు. వారు ఎవరిని పాలించారు? మనిషి హృదయాన్ని చక్రవర్తులు జయించలేరు. తమ హృదయాల్ని పాలించే సమర్థులు కారు వారు ఎవరూ. తన లోపలి సామ్రాజ్యాన్ని జయించిన వాడే నిజమైన విజేత, నిజమైన జేత. ప్రపంచంలో చాలామంది మహా మహా మేధావు లుంటారు. వారు చేస్తున్న పని ఏమిటి? సమాచారాన్ని సమీకరించడం, పోగుచేయడం. అదంతా జ్ఞానం అనుకుంటారు. తాము పోగుచేసిన జ్ఞానం తమ స్వంతమని భ్రమిస్తూ జ్ఞానులమనుకుంటారు. **ఆత్మ జ్ఞానం కావాలి. తనను తాను జయించడం గొప్ప. ప్రపంచాన్ని జయించడం గొప్ప కాదు.** నీవు ఎవరవో నీవు తెలుసుకోకుండా, ప్రపంచం అంతా నీకు తెలుసు ననుకుంటే ఏం లాభం? ఏం ఉపయోగం? ప్రతివారికి అంతరంగ శోధన ముఖ్యం, బాహ్య పరిశోధనలు కావు.

పా.బ్ర : అది సాధ్యమా భగవాన్? అసంభవం కదా!

మహర్షి : ఆలోచించినంత కాలం అసంభవమే అనిపిస్తుంది. రంగంలోకి దిగితే ఏదీ అసాధ్యం కాదు. సత్యాన్ని తెలుసుకోవడంలో భారతీయులు, పాశ్చాత్యులు అన్న తేడా ఉండదు. భౌతిక సుఖాలు, సంపదలకు ప్రాముఖ్యం యిచ్చే వారికి ఆ పని కష్టం. అయినా సాధించవీలుంది. **ధ్యానంలో ఉత్పత్తి అయ్యేశక్తిని**

**సాధనతో జతపరచుకోగలగాలి. నిత్యం ధ్యానసాధన వల్ల శక్తి పెరుగుతుంది. ఆత్మశక్తిని అన్ని పనులకు ఉపయోగించుకోవచ్చు. అన్ని పనులు విజయవంతంగా చేయవచ్చు. ఆ శక్తి అవిచ్ఛిన్నంగా, నిరాటంకంగా అందుతుంది. అప్పుడు ధ్యానానికి, నిత్యకార్యక్రమ నిర్వహణకు తేడా కనిపించదు.** 'నేనెవరు?' అని జపం చేస్తే చాలదు. అది విచారణ సూత్రం, జప మంత్రం కాదు. ఈ శరీరం నేను కాదు – ఈ మనస్సు నేను కాదు, నాది కాదు అనుకోవాలి. మనస్సు కలిగించే కోరికలు నీవి కావు. అవి మనః కల్పనలు, కోరికలు. అప్పుడు ఆత్మ విచారణలో లోతులకు వెళ్లగలవు. అన్ని ప్రశ్నలకు జవాబులు ఆ లోతుల్లోనే లభిస్తాయి. వాటంతట అవే పైకుబికి వస్తాయి అప్రయత్నంగా.

ఆత్మ తెలిసిన తర్వాత సత్యం ప్రకాశిస్తుంది. హృదయం నిండా సత్యం వెలుగు నింపుతుంది. మనస్సు జోక్యం పెట్టుకోదు. పేచీ పడదు. ఆలోచన బాధించదు. నిజమైన ఆనందం అప్పుడు లభిస్తుంది. ఆ ఆనందమే సత్యరోచిస్సు, సత్యదీప్తి. ఆత్మ జాగృతమైన తర్వాత ఎవరికి ఎలాంటి సందేహాలూ ఉండవు.

## అంతర్మథనం

పాల్ బ్రంటన్ పాశ్చాత్యుడు గదా! విషయలాలస జాస్తి. పైగా మేధావి, జర్నలిస్టు, రచయిత. విషయ సేకరణ మేధావుల వ్యసనం. ఉత్తినే ఆత్మ విచారణ చేసుకోవయ్యా అంటే మనసొప్పదు. పాల్ బ్రంటన్ తిరువణ్ణామలై వదలి దేశాటన చేశాడు. అనేకచోట్ల తిరిగాడు. అనేకమంది గురువుల్ని, మహాత్ముల్ని, పేరెన్నికగన్న వారిని కలిసి చర్చించాడు. భారతదేశంలోని ఆధ్యాత్మిక సంపదనంతా సొంతం చేసుకోవాలన్న తపన. మన జ్యోతిషం, తంత్రం, మంత్రం, ధ్యానం, తపస్సు, అతీంద్రియ శక్తులు, సిద్ధులు అన్నీ వారికి ఆశ్చర్యకరంగా ఉంటాయి. పాల్ బ్రంటన్ దయాల్‌బాగ్ వెళ్లి రాధాస్వామిని కలిశాడు. తిరిగి తిరిగి, చివరకు మళ్లీ తిరువణ్ణామలై చేరుకున్నాడు. మహర్షి మార్గాన్ని అనుసరించడం తప్ప ఆధ్యాత్మికంగా మరొక మార్గం లేదనుకున్నాడు. ఆత్మ విచారణకు పూనుకున్నాడు.

అతనిలో అంతర్మథనం మొదలైంది. ఈ గురువులేమిటి? శిష్యులేమిటి? గురుశిష్య సంబంధం ఎందుకు? ఎంతవరకు అవసరం? అసలీ పరంపర అవసరమా? శిష్యులను బట్టి గురువుల గొప్పతనం తెలుస్తుందా? లేక గురువును బట్టి శిష్యుల అభివృద్ధా? అతనిలో సవాలక్ష ప్రశ్నలు. ఆత్మదర్శనం పొందిన వారికి, ఆత్మజ్ఞానం అలవడిన వారికి గురువుతో పనేమిటి? సద్గురువుకు శిష్యుల అవసరం ఏముంటుంది? అవసరం ఉండదు. అందరినీ ఒకేలా చూస్తాడు. స్వ-పర భేదాలుండవు.

మహర్షి అంటారు: "నీలోనే నీ గురువును చూచుకోవాలి. నీ ఆత్మ గురువు నీలోనే ఉంటాడు. శరీరం 'నిజాత్మ' కాదు. గురువు తన శరీరాన్ని ఎలా భావిస్తాడో నీవూ నీ శరీరాన్ని అలానే భావించాలి".

ఇదంతా అవసరమా? ఆత్మ విచారణ అంత ముఖ్యమా? ప్రయోజనం ఏమిటి? ఆత్మను అన్వేషించడంవల్ల, గురుసేవ వల్ల ఏం వొరుగుతుంది? ఏ విధంగా లాభిస్తుంది? అయినా, తను ఆశ్రమంలోనే ఉండి పోవాలని నిర్ణయించుకున్నాడు. కొంతకాలం ప్రయత్నిస్తే తప్పులేదు. ఏ ప్రయోజనం ఉన్నా లేకపోయినా, తనకు ఆశ్రమ వాతావరణం, నిరాడంబర జీవనం నచ్చింది. ఇక్కడి స్థలంలో ఏదో మహత్తు వుంది. ఆశ్రమానికి ఒక ఆకర్షణ వుంది. ఏదో శక్తి తనను వశ పరచుకుంటోంది. రోజు రోజుకు తనలో ఆసక్తి పెరుగుతోందని తెలుస్తోంది. వదలిపో బుద్ధికావడంలేదు. మహర్షి తిరిగిన ప్రదేశాలలో తిరగడంవల్ల గొప్ప స్పందన కలుగుతోంది. తృప్తి కలుగుతోంది. ఆత్మ జాగృతమవుతోంది. అది మహర్షి ప్రభావమా? ఆశ్రమం ప్రభావమా? ఏమో! మహర్షి సమక్షంలో కూర్చోవడమే గొప్ప అనుభవం. అది ఏమిటో, ఎందుకో తెలియదుగానీ తనలో చిత్ర విచిత్రమైన మార్పులు చోటుచేసుకోసాగాయి.

తనలో ప్రశ్నలు సముద్ర తరంగాల వలె ఎగిరెగిరిపడుతున్నాయి. తరంగాల వలె నీటిలో కలిసిపోతున్నాయి. తనలో శూన్యం మిగులుతోంది. అవి ఎక్కడి నుండి వస్తున్నాయి? ఎక్కడకు పోతున్నాయి? దిక్కు తోచడం లేదు. సముద్రంలో కెరటాలు ఎక్కడి నుండి పుడుతున్నాయి? ఆలోచనలూ అంతే. తనలో ఏదో సత్యం వుంది. తనలోనే సత్య సాగరాలున్నాయి. అవసరమైనమేర ప్రశ్నలు తల ఎత్తకుండా చేస్తే తనలోని ఆధ్యాత్మికత కొంతైనా బయటపడే అవకాశం వుంది. అలాంటి నిర్ణయం చేయగానే మనస్సు నిర్మలమైంది. ఆలోచనలు ఆగిపోయాయి. అంతా ప్రశాంతి. ఎట్లా సాధ్యమైంది? అది మహర్షి సంకల్పమా? మహర్షి అనుగ్రహమా? ఆయన లోంచి వెలువడే శక్తి కిరణ ప్రసారమా? చలన చాలనమా? నిజమేనని అంతరాత్మ ఆమోదిస్తోంది. బుద్ధి కాదంటుంది. బుద్ధికి అహంకారం ఎక్కువ. వివేకానికి ప్రతిఘటన ఎక్కువ. వెరసి శరీరం నీరసిస్తోంది. మనిషి అలవాట్లు అంత వేగం మారవేమో! ఒకరోజున మహర్షిని నిగ్గదీసి ప్రశ్నించాడు.

పా.బ్ర.: మీ మార్గం చాలా కష్టమనిపిస్తోంది మాస్టర్. నా బలహీనతలు నన్ను ముందుకు పోనివ్వడం లేదు.

మహర్షి: మనిషికి మనిషే శత్రువు. మనిషి ప్రగతికి అతని మనస్సే అవరోధం. నిరోధం. అపజయం అనే భయం మనిషిని ముందుకు కదలనివ్వదు. అపజయ

భావన మనస్సు కల్పించేదే గదా! మనిషికి పెద్ద అవరోధం తనకంత శక్తి లేదనుకోవడం, తనకు అర్హత లేదనుకోవడం, తను చేసిన పాపాలను జ్ఞాపకం చేసుకోవడం, భయపడడం. ప్రతి మనిషిలోను దైవత్వం ఉంటుంది. ప్రతిమనిషి సమర్థుడే. బలహీనతలు, చెడులు అతని అలవాట్లవల్ల వచ్చినవి. అతని కోరికలు, ఆలోచనలు పురోగతికి అడ్డు నిలుస్తాయి తప్ప నైజం చెడ్డది కాదు. ఎవరి స్వభావంలో కల్మషం ఉండదు.

పా.బ్ర.: మాస్టర్! ఈ ఏకాంతంలో, అరణ్య ప్రాంతంలో మీ వంటివారు ఆధ్యాత్మికతను సాధించగలరేమోగానీ నగరాలలో, పట్టణాలలో, కలుషిత వాతావరణంలో బ్రతికే మావంటి వారికి ఆధ్యాత్మికత అలభ్యం.

మహర్షి: పాల్! గమ్యం నిర్దేశించుకుంటే, లక్ష్యశుద్ధి ఉంటే, నీవు లండన్‌లో ఉన్నా, అరణ్య మధ్యలో ఉన్నా తేడా ఉండదు.

పాల్ బ్రంటన్ గమనించింది ... మహర్షి ఇతరులకు సహాయం చేయడంలో రకరకాల పద్ధతులు అనుసరిస్తారని. చాలా నెమ్మదిగా, సౌమ్యంగా వారి వారి సంస్కారానికి, పరిస్థితులకు అనుగుణంగా, అనురూపంగా సలహాలిస్తారు. నెమ్మదిగా తన భావాన్ని వారి మనస్సుల్లోకి ప్రవేశపెడతారు. సరాసరి హృదయాన్ని తాకి, ఆత్మను స్పృశించే విధంగా మాట్లాడతారు. ఎలాంటి వారికైనా వారి మాటలు ఊరట కలిగిస్తాయి. ఉపశమనం కలిగిస్తాయి. ఆయనలో గొప్ప వశీకరణ శక్తి వుంది.

## స్వానుభవం

“మహర్షి సమక్షంలో ధ్యానం చేయడం వల్ల నాలో ఎంతో మార్పు వచ్చింది. వారి సమక్షంలోనే కాదు ఆ చుట్టు పక్కల అడవిలో ఎక్కడ ధ్యానం చేసినా అదే అనుభూతి. నా ఆలోచనల్ని అంతర్ముఖం చేయగలిగాను. ఎంతో లోతుల్లోకి ఆలోచనలు నిష్క్రమించేవి. హృదయంలో జ్యోతి వెలగనిదే మహర్షిని అర్థం చేసుకోలేము. ఆయన కాంతివలయం నుండి ఒక కిరణం వచ్చి నాలో ప్రవేశించింది. నన్ను తేజోపూర్ణం చేసింది. నేను పూర్తిగా మారిపోయాను. నాలో మానసికంగా వెలుగులు నిండాయి. మహర్షి నన్ను అలవోకగా తన వేపు, తనలోకి లాక్కున్నారు. కళ్లు మూసుకుని ధ్యానం ప్రారంభించగానే మనస్సు మహర్షి వైపు పరుగుతీస్తుంది. ప్రతిరోజూ నాకు ఆశ్చర్యమే. మహర్షి మాటల కన్న మౌనం ఎందుకంత బలంగా లాగుతోందని, ఆకర్షిస్తోందని! ఆ నిదానం, నిశ్చలం, నిర్మలం శక్తివంతం. అది పూర్ణం. మాటా పలుకు లేకుండానే చూపుతో మనుషుల్ని గాలం వేసి తనలోకి లాక్కుంటారు మహర్షి. ఆయన కఠిన శాసనాల్ని నేను మౌనంగా

ఆమోదిస్తుంటాను. ఎవరినీ, ఏ విషయంలోనూ ఇలా చెయ్యమని చెప్పని వ్యక్తి ప్రపంచంలో ఆయన ఒక్కరే. నేను ఇండియాలో చూచిన యోగులు అందరికంటే ఆయన ప్రత్యేకం. గురువు లందరికీ ఆయన భిన్నుడు. ఎవరినీ మహర్షితో పోల్చడానికి వీల్లేదు.

"నేను మొదటిసారి భగవాన్‌ని కలిసినపుడు వారు చెప్పిన మాటలతో నా ధ్యానం ఆరంభమైంది. నా ప్రశ్నలు ఎంత చెత్తగా ఉన్నా వారు భరించి సమాధానం చెప్పారు. ఉత్తినే వారివైపు చూస్తూ కూర్చునేవాడిని. ఇప్పుడు నాలోకి చూచుకోవడం మొదలైంది. మహర్షి చెప్పిన మాటలు, నాకు అర్థమైనంత మేర సారాంశం ఇది :

"నేనెవరు" అనే జిజ్ఞాసను వదలకు. సదా అదే దిదృక్షతో ఉండు. నిన్ను నీవు సంపూర్ణంగా విశ్లేషించుకో. **'నేను' అన్న భావం ఎక్కడ మొదలైందో గమనించు. అలా గమనిస్తూ, ధ్యానంలో లీనం అవు. నీ దృష్టిని అంతర్ముఖం చేసి లోపలకు పంపు. కొంతకాలానికి, ఆలోచనా చక్రం తిరగడం మందగిస్తుంది. నీలోంచి అతీంద్రియత బయటకొస్తుంది.** అంతరాత్మ చెప్పినట్లు విను – అలా సాగిపో. ఆలోచనలు నిలిచిపోతాయి. అదే నిన్ను గమ్యానికి చేర్చుతుంది.

"భగవాన్ అనుగ్రహంతో నా ధ్యానం ఎలాంటి అవరోధాలు లేకుండా సాగుతోంది. కష్టం అనిపించకపోగా – ధ్యానం చేయడం అంటే ఉత్సాహం కలుగుతోంది. అంతా మంచిగా అనిపిస్తోంది. ఏదో గొప్ప ప్రయోజనం కలుగుతుందన్న ఆశ లోపల. మహర్షి సహకారం ఎప్పుడూ ఉంటుంది. ఆ విశ్వాసమే నన్ను ముందుకు నడిపిస్తోంది. మహర్షి శక్తి తరంగాలు నాలో ప్రవేశించి ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. మనస్సును బంధించి, మరింత లోతులకు వెళ్లగలిగాను. కనిపించని దారాలతో నన్ను కట్టివేసి, అన్ని దారాలను మహర్షి తన చేతిలోకి తీసుకున్నారు. వారే నన్ను నడిపిస్తున్నారు. ఆ విశ్వాసం లేకుంటే నేను ఇక్కడ ఆశ్రమంలో ఒక్కరోజు ఉండగలిగేవాడిని కాను.

"నాకు భగవాన్ అంటే ఎంతో ఇష్టం. ఇష్టాన్ని మించిన ఆరాధన. ఎందుకో అంత ఇష్టం! వారు ఎంత నిరాడంబరులు, ఎంత అణకువ, నిగర్వి, నిరహంకారి. ఆయన తిరిగిన ప్రదేశాలలో ఆయన ప్రభావం ఉంది. ఆశ్రమంలో అడుగు పెట్టగానే నన్ను ఏదో పవిత్రభావం కమ్మేస్తుంది. నేను నేను కాకుండా పోతాను. ఆయన తనలో ఎలాంటి శక్తులు, మహత్తులు ఉన్నవని చెప్పరు. అసలు ఎవరికీ ఆ భావన కలగనీయరు. తాను ఒక యోగినని, మహర్షినని అనుకోరు. ఎవరికీ ఏమీ కానట్లే ఉంటారు. అంతటి తపశ్శక్తిని తనకోసం మిగుల్చుకోరు.

"నాకనిపిస్తుంది ఇటువంటి మహాపురుషులు ఎప్పుడోగానీ జన్మించరని. వారు గొప్ప జ్ఞానం అందించడానికే అవతరిస్తారు. మనతో తర్కించడానికి, చర్చించడానికి ఇష్టపడరు. జ్ఞానం పంచడమే వారి ఏకైక కర్తవ్యం. మహర్షి బోధనలు నన్ను బలంగా కట్టివేశాయి. ఆశ్రమానికి అతుక్కుపోయాను. అనుభవాలు ఎంతో ఉపయుక్తాలు. మహర్షి ఆత్మతత్వం అరుణాచలానికి ప్రతీక. ఆ దేవాలయమంత విశాలం మహర్షి హృదయం. ఆ ప్రాకారంలోని నిశ్శబ్దమే మహర్షి మౌనం. మహర్షి నోటి వెంట ఎప్పుడూ దేవుని ప్రస్తావన రాదు. ఆయన గుడికి వెళ్లడం, పూజ చేయడం నేను చూడలేదు. ఆయనది కేవలం ఆత్మవిచారణ. ఆత్మవిశ్లేషణ. ఎవరి నమ్మకాలు వారివి. ఎవరి మత విశ్వాసాలు వారివి. మహర్షి ఏమతాన్ని గురించి ఉటంకించరు. ఎవరినీ విమర్శించరు. అందరూ చివరకు 'ఆత్మ'ను ఆశ్రయించ వలసిందే నంటారు.

"నేను అలా మహర్షి బాట పట్టాను. నన్ను నేను తెలుసుకునే ప్రయత్నం చేశాను. ఎప్పటికప్పుడు మహర్షి మౌనంగా ఏదో బోధిస్తున్నట్లే అనిపిస్తుంది. మా ఇద్దరి మధ్య సంభాషణ ఉండదు. మాటలు దొర్లవు. ఒకరోజు అరుణాచలేశ్వ రాలయానికి వెళ్లాను. ఆ శిల్ప సౌందర్యం చూస్తూ ముగ్ధుడనై ఆశ్రమానికి ఆలస్యంగా వచ్చాను. వేళకు ధ్యానానికి అందుకోలేకపోయాను. అరగంట ఆలస్యమైంది. హాలులోకి నెమ్మదిగా చొరబడి, ఓ మూలన కళ్లు మూసుకుని కూర్చున్నాను. మరుక్షణంలో ఆలోచనల్ని మనో కేంద్రానికి చేర్చగలిగాను. అసలు కళ్లు మూతపడగానే ఈ ప్రపంచం నుండి నిష్క్రమించి ఎక్కడికో వెళ్లిపోయాను.

"మహర్షి కూర్చున్న తీరు నా మనో నేత్రానికి కనిపించింది. వారు చెప్పినట్లు 'అరూపధ్యానం' కోసం ప్రయత్నించాను. మహర్షి తన 'రూపం' ముఖ్యం కాదంటారు. ఆత్మపై ధ్యానం చేయమంటారు. ప్రతిసారీ ధ్యానం ప్రారంభించగానే అదే జరుగుతుంది. భగవాన్ రూపం 'అరూపం' అవుతుంది. నాలోపల ఏదో భావన తళుక్కుమని మెరుస్తుంది. మొదట ధ్యానానికి కూర్చోగానే రకరకాల ప్రశ్నలు తలెత్తేవి. ఆలోచనలు ఉక్కిరిబిక్కిరి చేసేవి. ఇప్పుడు క్రమంగా అవన్నీ సమసిపోయాయి. మొదట్లో భౌతిక, మానసిక ఉద్రేకాలు బాధిస్తూ నన్ను ఆటంక పరిచేవి. క్రమంగా అన్నీ సమసిపోయాయి. క్షణంలో కేంద్రానికి చేరగలుగు తున్నాను. మూలంవైపు పురోగమించ గలుగుతున్నాను. అది ఆనంద స్థితి. మనస్సు నిశ్చలత్వంలోకి జారి తన ఉనికిని కోల్పోతుంది. ఈ పరిచయ ప్రపంచం కరిగిపోయి శూన్యత ఏర్పడుతుంది.

"ఈ రోజూ ఎప్పటిలా కేంద్రానికి చేరడానికి ప్రయత్నిస్తున్నాను. ఆలోచనలు అల్లరిచేశాయి. మరోశక్తి ఏదో నాలో చొరబడి ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. దానిని ప్రతిఘటించే శక్తి నాకు లేదు. హోరాహోరి యుద్ధం సాగింది. ఆపైన ప్రశాంతి. తర్వాతి మెట్టుపైన నా వివేకం, ఆలోచన, ప్రతిభ అన్నీ అంతరించి పోసాగాయి. అంతర్వాణి వినిపించసాగింది. లోపలిశక్తి ఏదో నాకు దారి చూపిస్తున్నది. ఆలోచనలతో నేను కలవలేకపోతున్నాను. **లోగడ ఆలోచించడమే ఘనకార్యంగా, మేధావితనంగా భావించే వాడిని. ఇప్పుడు ఆలోచించడం అసహ్యం అనిపిస్తోంది.** ఎందుకు ఆలోచించాలి? ఏమి ఆలోచించాలి? ఇప్పుడు ఆలోచనలు లేకపోవటం ఆనందంగా, తృప్తిగా ఉంటోంది. అదే ఆధ్యాత్మిక ప్రగతి. మేధ సరిహద్దులు దాటి సదా శూన్యంలో ఉండిపోవాలన్న ఆరాటం, తపన. నేనుగా మనస్సుకు బానిసను కాదలచలేదు. నాకు స్వతంత్రం కావాలి. స్వతంత్ర ప్రజ్ఞ నాకు కావాలి.

"ఏదో జరుగుతోంది నాలో. ఏం జరుగుతోంది? భావనలు క్రమంగా క్షీణించాయి. శరీర స్పందన తెలియని స్థితి. ఆలోచన ఆరిపోయిన దీపంలా మారింది. మనస్సు భావాతీతం అయింది. అందుకు మన ప్రయత్నం, సంకల్పం సైతం అవసరం లేదంటారు భగవాన్. ఈ ప్రపంచాన్ని గురించిన స్పృహ పోగానే నాకాళ్ల క్రింద భూమి కరిగిపోయింది. ఒక దివ్యకాంతిసాగరం మధ్య నేను నిలిచినట్లయింది. ఆ వెలుగులోంచి లోకాలు, గోళాలు పుట్టుకొస్తున్నాయి. సృష్టి జరిగిపోతున్నది. ఆ శూన్యం నుండే సృష్టి జరిగినట్లు తెలుస్తోంది. నాకు సృష్టి రహస్యం, విశ్వ విన్నాణం అవగతమైంది. క్రమంగా స్వస్థితికి చేరుకున్నాను. నేను సంపూర్ణంగా దివ్యత్వం ఒడిలో ఒదిగిపోయాను ఆక్షణంలో. భౌతికంగా మానసికంగా నేను లేను. నా అస్తిత్వం లేదు. స్థితి అంతకన్న లేదు. సర్వత్రా ఆత్మ మిగిలింది. అనుభూతి పరచుకున్నది. నిన్నటి జ్ఞాపకాలు లేవు. రేపటి కోర్కెలు లేవు. వస్తుతః అంతా దివ్యత్వమే. నేను మొత్తం సృష్టిని ఆలింగనం చేసుకున్నాను. నా బిగి కౌగిలిలో విశ్వం ఒదిగిపోయింది. అంతా ప్రేమమయం. జగమంతా ప్రేమమయం.

"చీకటి ముసురుకున్నది. చీకటిలో భగవాన్ నేత్రాలు జ్యోతుల్లా ప్రకాశిస్తున్నాయి. అంతటి గొప్ప కాంతి, తేజస్సు మానవ మాత్రుల నేత్రాలలో కనిపించదు.

"గురు – శిష్యుల మధ్య మాటలు అవసరం లేదంటారు మహర్షి. నిజమే! మౌనాన్ని మించినభాష ఎక్కడుంది? అంచేతనే భగవాన్ చూపులతో సందేశాలిస్తారు. మౌనంగా ఉపదేశాలిస్తారు. అది మహర్షికే సాధ్యం."



# 27. సుమ సౌరభాలు

**రమణాశ్రమ** ఉద్యానవనాలలో పూచిన పూలు ఎన్నో? ఎన్నని లెక్కించ గలం! రంగు రంగుల పూలు, రక రకాల పూలు ... సుగంధాలు వెదజల్లినవి కొన్ని, పరిమళాలు పంచినవి మరికొన్ని... వాడనివి కొన్ని, వసివాడనివి మరిన్ని... నాటికీ నేటికీ గుబాళిస్తున్నవి కొన్ని. సమర్థుడైన గురువు వద్దకు యోగ్యులైన శిష్యులు చేరుతుంటారు. సద్గురువు సాహచర్యంలో శిష్యుడు గురువంత వాడవుతాడు. గురుశక్తి శిష్యునిభక్తి కలిస్తే ఆధ్యాత్మికంగా సంపూర్ణత కలుగుతుంది. ప్రతి శిష్యునిలో గురువు ప్రతిబింబం కనిపిస్తుంది. గురుప్రజ్ఞ ప్రతిశిష్యునిలో కదలాడుతుంది. సాధారణంగా మనవారు ప్రశ్నిస్తుంటారు "నీ గురువు ఎవరు?" అని. ఆ గురువును బట్టి శిష్యుని ఆంతర్యాన్ని అంచనా వేయవచ్చు. శిష్యుని చూచి గురువు సమర్థతను తెలుసుకోవచ్చు.

రమణ మహర్షి వంటి సద్గురువు లభించడం నాటి జిజ్ఞాసుల అదృష్టం. భగవాన్ విరూపాక్ష గుహలో ఉండే రోజుల్లో కొందరు ప్రాణంపెట్టే శిష్యులుండేవారు. తర్వాత వచ్చిన వారు తక్కువ వారని కాదు. కాని ప్రాచుర్యం పొందిన తర్వాత ఆకర్షితులైన వారు. మొదటితరం వారు మౌలిక శిష్యులు. ఆ తరం వారిలో భక్తి అధికం. తర్వాతితరం వారిలో జ్ఞానార్తి ఎక్కువ, జిజ్ఞాస అధికం.

## 1. రామనాథ బ్రహ్మచారి

భగవాన్ విరూపాక్ష గుహలో ఉండే దినాలలో స్వామిని సేవించిన వారిలో రామనాథ బ్రహ్మచారిని చెప్పుకోవాలి. ఆయన రూపం విచిత్రంగా ఉండేది. అసలే

పొట్టివాడు. ఆ పైన శరీరం నిండా విబూది పట్టించుకునే వాడు. భక్తి ప్రపత్తుల విషయంలో ఎవరికీ తీసిపోడు. తన ప్రేమతో, భక్తితో రమణుని హృదయంలో స్థానం పొందాడు. ఆయనకు దగ్గర వాడైనాడు. శిష్యునికి గురువుపట్ల అచంచలమైన ప్రేమ ఉండాలన్న విషయం రామనాథ బ్రహ్మచారిని చూస్తే తెలుస్తుంది. ఒకసారి రమణ మహర్షి జోక్‌గా అన్నారు "నాకు ఇద్దరు భక్తులంటే భయం. ఒకరు రామనాథ బ్రహ్మచారి. రెండవ వాడు మొదలియార్ పట్టి."


రామనాథ
బ్రహ్మచారి

వారిద్దరు తమ అచంచలప్రేమతో శ్రీరమణ హృదయం గెలుచుకున్నారు. మనసు దోచుకున్న దొంగలు, వీరభక్తులు. ప్రేమించే భక్తుల్ని ఏ గురువూ అలక్ష్యం చేయడు. అడగకనే అన్ని వరాలు అనుగ్రహిస్తాడు.

రామనాథ బ్రహ్మచారి విషయంలో ఒక కథ ప్రచారంలో వుంది. ఆయన రోజూ తిరువణ్ణామలై వీధుల్లో భిక్ష చేసేవాడు. లభించిన భిక్షాన్నం సరాసరి విరూపాక్ష గుహకు తెచ్చి గురువు గారికి సమర్పించేవాడు. అక్కడ ఎందరు భక్తులుంటే అందరూ కలిసి పంచుకుని భుజించే అలవాటు. ఒకనాడు బ్రహ్మచారి అలా భిక్ష తీసుకుని కొండపైకి వస్తుండగా అతని తండ్రిగారు ఎదురుపడ్డాడు. అతను తండ్రిని చూచి కంగారు పడలేదు. భిక్ష చేయడం – యాచించడం కాదు. అది విరాగులైన వారి నిత్యకృత్యం.

"ఒరేయ్, రామనాథం. నాకు చాలా ఆకలిగా వుంది. కాస్త ప్రసాదం పెట్టరా" అని కొడుకును అడిగాడు. తెచ్చిన ప్రసాదం గురువు గారికి నివేదన చేయకుండా తినడం, పంచడం పాపం. కన్న తండ్రి అయినా సరే తను నియమోల్లంఘన చేయదలచలేదు. "ముందు గురువుగారికి పెట్టాకనే మిగిలిన వారు తినాలి. నాతో రండి" అన్నాడు.

ఆ విషయం భగవాన్‌కు తెలిసింది. బ్రహ్మచారితో అన్నాడు :

"రామనాథం! గురువుకన్న తండ్రి గొప్పవాడయ్యా! ముందు మీనాన్న గారికి పెట్టు. పాపం ఆకలి మీదున్నాడు."

బ్రహ్మచారి తన పట్టు సడలించలేదు. భగవాన్ రామనాథం ప్రవర్తనకు కినిసి 'నేను భోజనమే చేయను' పొమ్మన్నారు.

బ్రహ్మచారి తన పట్టువదలి, ముందు తండ్రికి భోజనం పెట్టిన తర్వాత భగవాన్ శిష్యులతో భోజనానికి కూర్చున్నారు.

బ్రహ్మచారి గురుభక్తికి మరొక ఉదాహరణ –

1912లో రమణ మహర్షి శిష్యులంతా అరుణాచలంపైన సమావేశమైనారు. 'గురుభక్తి' పైన అందరు వారి వారి అభిప్రాయాలు వెలువరించాలి. మొదటి అవకాశం రామనాథ బ్రహ్మచారికి వచ్చింది. పాపం, రామనాథం పెద్దగా చదువుకున్నవాడు కాదు. భాషా జ్ఞానం తక్కువ. వక్త కాదు. అయినా మాట్లాడక తప్పలేదు. ఆయనది పిచ్చిభక్తి. ఏం జరిగింది? మనసులోనే సద్గురువును స్మరించు కుని, నమస్కరించి మాట్లాడడం మొదలు పెట్టాడు. క్షణంలో రమణుని శక్తి అతన్ని ఆవహించింది. మహా పండితుని వలె, అనర్గళంగా ప్రసంగించాడు. తనకిచ్చిన టైం పూర్తయినా ఆపలేదు. గంటల తరబడి ప్రసంగించాడు. భక్తులకు దిమ్మ తిరిగి పోయింది. ఈ పిచ్చోడు ఎంత గొప్పగా మాట్లాడాడు! అని ఆశ్చర్య పోయారు. మర్నాడు తన ప్రసంగం జ్ఞాపకం చేసుకొని "తిరుచ్చుళి నాథనై కండేనె" (నేను తిరుచ్చుళి స్వామిని దర్శించాను) అనే మకుటంతో చాంతాడంత భక్తి గీతం రాశాడు.

బ్రహ్మచారి చాలా సంవత్సరాలు రమణాశ్రమం దాపుల 'పలకొట్టు'లో ఒక చిన్న పర్ణశాల వేసుకుని నివశించాడు. పలకొట్టులోనే రమణ శిష్యులంతా ఇండ్లు కట్టుకొని ఉండేవారు. బ్రహ్మచారి ఎవరికి ఏ సహాయం అవసరమైనా పూని చేసిపెట్టేవాడు. తన వల్ల కాదనే వాడు కాదు. ఆయన నమ్మకం శ్రీరమణ మహర్షి భక్తులకు సేవచేస్తే సద్గురువు సేవ చేసినట్లేనని.

రమణ మహర్షికి నీడలా నలభై సంవత్సరాలు అంటిపెట్టుకుని జీవించాడు. రమణుని మహానిర్యాణానికి కొద్దిరోజులు ముందుగా ఆయన కాలధర్మం చెందాడు.

## 2. అఖిలాండమ్మ



**తొలినాళ్లలో** భగవాన్ అనుగ్రహం పొందిన వారిలో అఖిలాండమ్మ ఒకరు. ఆమె మహర్షికి చాలా ఇష్టమైన వ్యక్తి. అఖిలాండమ్మ శ్రీరమణుని విచిత్రంగా కలిసింది. అరుణాచలం పైన ఆమె పూలు కోసుకుంటుండగా కొందరు మనుషులు మర్రిమాను గుహ వైపు వెళ్లడం గమనించి "ఎక్కడికి బాబూ వెళుతున్నారు?" అని అడిగింది. వారు 'బ్రాహ్మణస్వామి' అని సమాధానం చెప్పారు. ఎవరో బ్రాహ్మణస్వామి! తను ఏ ప్రసాదం తీసుకు వెళితే బావుంటుంది? పైగా బ్రాహ్మణ స్వామిట, తన ప్రసాదం ముట్టకపోతే! వండిన పదార్థాలు కాక పటికబెల్లం కొని తీసుకువెళ్లింది. తీరా

వెళ్లి చూస్తే ఏముంది? ఆ స్వామి మట్టికొట్టుకుని మనలోకంలో లేడు, మన స్పృహలో లేడు. శరీరం మట్టి కొట్టుకున్నా బంగారు రంగులో మెరుస్తోంది. మట్టిలో మాణిక్యం అనుకున్నది. అగ్నిలో కాలిన మేలిమి బంగారం ఆయన మేనిఛాయ.

తర్వాత అఖిలాండమ్మ అప్పుడప్పుడు విరూపాక్ష గుహకు వెళ్లేది. వెళ్లిన ప్రతిసారి స్వామికి, ఆయన భక్తులకు ఏవేవో చిరుతిండ్లు తీసుకు పోతుండేది. అంతవరకు పళని స్వామి భగవాన్ సేవలో ఉండేవాడు. ఆయన పోవడానికి కొద్ది రోజులు ముందుగనే ఈమె రమణుని సన్నిధికి చేరింది. అప్పటికే భగవాన్ విరూపాక్షగుహ వదలి స్కందాశ్రమం చేరుకున్నారు. మహర్షి రోజూ పళని వద్దకు వెళ్లేవారు. పళని ఆరోగ్యం బాగులేదు. మహర్షి పరామర్శకు వస్తారని తెలిసి అక్కడకు రమణుని కోసం అన్నం, రసం తీసుకు వెళ్లేది.

అఖిలాండమ్మ తెచ్చిన భోజనం శ్రీరమణ, పళని స్వామి కలిసి తినేవారు. తర్వాత పళని స్వామి అఖిలాండమ్మను పక్కకు పిలిచి “భగవాన్‌కు అన్నం, చట్నీ, రసం తెచ్చి పెడుతుండు. నీవు ఉన్నంతకాలం ఈ పని చెయ్యి” అని చెప్పాడు. పళనికి తన ఆరోగ్యంకన్న భగవాన్ మనుగడ ముఖ్యం. తను చనిపోతానని తెలిసీ మహర్షికై తపించేవాడు.

ఒకసారి అఖిలాండమ్మ రకరకాల వంటకాలు చేసి స్కందాశ్రమం తీసుకు వెళ్లింది. రమణకు, భక్తులకు విస్తళ్లు పరిచి వడ్డించింది. రమణ విస్తరి పక్క విస్తరి వద్ద ఎవరూ కూర్చోలేదు. అదేమిటని అడిగితే అది ‘నొండి’ కోసం ప్రత్యేకం అన్నారు. నొండి అంటే ఓ ముసలి కుంటి కోతి. భగవాన్‌కి వడ్డించి ప్రక్క వారికి వడ్డించేలోగా కుంటికోతి వచ్చి భగవాన్ విస్తరిలోని పదార్థాలు తీసుకుని తినసాగింది. అఖిలాండమ్మ మనసు విలవిల్లాడింది. కోతిని అదిలించబోగా అది గుర్ – గుర్ మన్నది. మహర్షి కోతిని మందలిస్తూ “అలా కోప్పడకు, అఖిలాండమ్మ మన మనిషిరా” అన్నారు. కోతికి కోపం తగ్గింది. అఖిలాండమ్మకు కోపం ఎక్కువైంది.

స్కందాశ్రమంలో అప్పటికింకా వంటా వార్పూ ప్రారంభం కాలేదు. అఖిలాండమ్మ రోజూ రమణల కోసం భోజనం తెచ్చేది. ధనికభక్తులు చాలా ఖరీదైన భోజనాలు, స్వీట్లు అవీ తెచ్చేవారు. వారు స్వామికి వడ్డిస్తుంటే అఖిలాండమ్మ తన పేదరికానికి ఖిన్నురాలయ్యేది. ఆమె మనస్సు గ్రహించిన స్వామి “అఖిలా, నీవు ఏం తెచ్చావ్. అందరికీ వడ్డించు” అని వడ్డన చేయించుకుని ముందుగా అదే తినేవారు. పేదల ప్రేమ విలువ భగవాన్‌కి తెలుసు.

1924లో రమణాశ్రమంలో దొంగలు పడ్డారు. మహర్షిని దొంగలు దుడ్డుకర్రతో బాదారు. మర్నాడు ఎందరో పరామర్శకు వచ్చారు. వారిలో అఖిలాండమ్మ ఒకరు. "గడచిన సంఘటనలకు దిగులు పడరాదు. బాధపడి, సానుభూతి చూపించి ప్రయోజనం లేదు. ఎవరూ గతాన్ని తలచుకుని బాధ పడకూడదు. మనసులో గతం నిలబడకూడదు. గతం నీడ కూడా మనసులో ఉండకూడదు." అనేవారు.

ఒక సందర్భంలో అఖిలాండమ్మ తెల్లవారకముందే వంటచేసి ఆశ్రమానికి పట్టుకొచ్చింది. మహర్షి ప్రేమగా "ఏవమ్మా... రాత్రి నిద్రపోయే పనిలేదా నీకు. మా కోసం నిద్రను త్యాగం చేస్తున్నావా?" అన్నారు.

రమణ సన్నిధి ఆమెకు పెన్నిధి. ఆయన్ని చూడడంలో, చూస్తూ కూర్చోడంలో ఆనందం, తృప్తి అనుభవిస్తుంది. ఆయన గొంతు విని పరవశిస్తుంది.

స్వామి ప్రతి ఒక్కరిని పలకరిస్తారు. అందరిపైన అమృతం వర్షిస్తారు. కరుణ ఒలికిస్తారు. ధనికులని, పేదవారని తేడా చూపరు. రాణులైనా రంగసానులైనా వారి దృష్టిలో ఒక్కటే. పండితుల్ని, నిరక్షర కుక్షుల్ని సమంగా ఆదరిస్తారు. ప్రేమతో ఎవరు భోజనం తెచ్చినా స్వీకరిస్తారు. రుచి, పచి ఎన్నడూ చూడరు. వంకలు పెట్టరు. మనుషులే కాదు, సృష్టిలోని ప్రతి జీవిని అంతగా ప్రేమించడం వారికే సాధ్యం.

భగవాన్ మహానిర్యాణం వరకు వెంట వున్న వ్యక్తి అఖిలాండమ్మ. చివరి దినాలలో క్యూలో నిలిచి, భగవాన్‌ని దర్శించి ఆయన దురవస్థకు గుండెలు అవిసేలా ఏడ్చింది.

"ఎందుకు భగవాన్ ఇంత నిర్దయ. ఇంత తొందరగా వెళ్లిపోవాలని ఎందుకు నిర్ణయించుకున్నావు? ఎందుకా తొందర? మేం ఏమై పోవాలి? మమ్మల్ని ఏం చేస్తారు?"

ఒక మూలన నిలబడి ఏడుస్తున్న అఖిలాండమ్మ వద్దకు ఒకతను వచ్చి భగవాన్ అంతిమ సందేశం అందించాడు.

"ఈ భౌతిక శరీరం కోసం దుఃఖిస్తున్నావా, అఖిలా."

మరుక్షణంలో ఆమె కన్నీరు ఆగిపోయింది!

## 3. రమణదాస సదానంద

ఈయన పూర్వనామం శేషగిరి అయ్యర్. మద్రాసులో ఒక హైస్కూలు టీచర్. తన బావమరది ప్రోద్బలంతో 1915లో విరూపాక్ష గుహకు వెళ్లి రమణుని

దర్శించుకున్నాడు. తొలిచూపుతోనే తనను సమర్పించుకున్నాడు. రమణను చూడగానే ఆయన నోట మాట రాలేదు. సర్వం మరచి బ్రహ్మానందం అనుభవించాడు. నాటినుండి 'రమణదాస సదానంద' అయినాడు. మరునాడు మరల భగవాన్‌ను దర్శించి కొన్ని సందేహాలు నివృత్తి చేసుకున్నాడు.

ప్రశ్న : నేను అంటే ఏమిటో, ఎవరో ఎట్లా తెలుసుకోవడం స్వామీ?

మహర్షి : అనవరతం కాకపోయినా, తరచు 'నేనెవరు' అనే జిజ్ఞాసతో హృదయం లోపల అన్వేషిస్తే సమాధానం లభిస్తుంది.

ప్రశ్న : అన్వేషణకు మనసు సహకరించకపోతే ... మనసు అడ్డుపడుతుంది గదా!

మహర్షి : మనసంటే ఏమిటి? ఆలోచనలు... ఆలోచనకు మూలం ఏది? నేను. అంటే ఏమిటి? అహంకారం. నేనెవరు అనే జిజ్ఞాస బలంగా కలిగితే మిగతా ఆలోచనలు అన్నీ సమసిపోతాయి. అన్నీ పోగా మిగిలేది 'నేను'.

ప్రశ్న : అహం నశించాక ఏం మిగులుతుంది?

మహర్షి : అహం నశిస్తే.. దానితో 'నేను' చుట్టూ అల్లుకున్న గుణాలు నశిస్తాయి. నిర్గుణం మిగులుతుంది.

1916లో తనకు స్మాల్‌పాక్స్ పోసినప్పుడు తాను చనిపోతానని అందరూ అనుకున్నారు. మృత్యువు సమీపించింది. తాను 'రమణ' జపం చేయసాగాడు. మృత్యువు తన దగ్గరకు రాకుండా పారిపోయిందట.

## 4. దండపాణి స్వామి

అప్పట్లో దండపాణి స్వామి అనే ఆయన ఆశ్రమంలో మేనేజరుగా ఉండేవాడు. ఆయనకు పుణ్యక్షేత్రాల పిచ్చి. హరిద్వార్ యాత్రకు వెళ్లాడు. తిరిగి రావడానికి డబ్బు లేకుండా పోయింది. హరిద్వార్‌లో ఈయనకి డబ్బెవరిస్తారు? రమణ స్మరణ చేయసాగాడు. అంతలో కాశ్మీర్ స్త్రీలు ఓ ముప్ఫయి మంది వచ్చి ఆయన చుట్టూ మూగారు. దేవతల్లాంటి కాశ్మీర్ వనితలు తలకొక రూపాయి ఆయనకు దక్షిణ ఇచ్చి వెళ్లిపోయారు. ఆ డబ్బుతో తిరిగి తిరువణ్ణామలై వచ్చి చేరుకున్నాడు.

తన అనుభవం ఇతరులకు చెప్పడం మంచిదా, కాదా? అని అతని అనుమానం. భగవాన్‌కి ప్రచారం గిట్టదు. తనను పొగడడం అసలు ఇష్టం ఉండదు.

**“ఎవరో పొగడడం వల్ల, కీర్తించడం వల్ల ఎవరూ గొప్పవారు కారు.** ఆత్మ సంస్కారం కలవారు, ఆత్మదర్శనం పొందినవారు సహజంగా మహాత్ము లవుతారు. పొగడ్తలవల్ల ఔన్నత్యం వెలుగులోకి రాదు” అంటారు భగవాన్.

## 5. మస్తాన్

రమణ మహర్షి భక్తులలో పరమ సాత్వికుడు మస్తాన్. అతనిది చేనేత వృత్తి. తరచు విరూపాక్ష గుహకు వస్తుండేవాడు. 1914 తర్వాత వచ్చిన ప్రతిసారీ చాలా రోజులు అక్కడ ఉండిపోయేవాడు. ఒక రోజున అమాయకంగా తనకు మంచి మార్గం చూపమని అర్థించాడు.

మహర్షి : ఏం కావాలి నీకు? సగుణోపాసనా? నిర్గుణోపాసనా?

మస్తాన్ : నాకు నిర్గుణోపాసన ఇష్టం.

మహర్షి : ఆలోచనలు ఎక్కడి నుండి వస్తున్నాయో గమనించి హృదయ కుహరంలో వాటిని లయించి పోనివ్వు. అప్పుడు మిగిలేది నిర్గుణం. అందులో కరిగిపోవడమే నిర్గుణోపాసన.

మస్తాన్ ధ్యానం చేస్తుంటే ఏవేవో శబ్దాలు వినపడేవి. వాటిని నిరోధించలేక రమణుని అడిగాడు. శ్రీరమణుల సలహా.

“శబ్దాలు విని కంగారుపడకు. ఆ నాదం ఎక్కడి నుండి వస్తుందో గమనించు. నాద మూలాన్ని చేరు. నాదం ‘ఆత్మ’ నుండి ఉద్భవిస్తున్నట్లు తెలుస్తుంది. అంటే ఏమిటి? శబ్దం, నాదం, భావం మూడు ఆత్మలో లయిస్తాయి. ఆత్మ నుండి వెలువడతాయి. అదే ఆత్మ తత్వం.

## 6. థెల్మా రపోల్డ్

థెల్మా రపోల్డ్ గురువు కోసం ఇండియా వచ్చింది. శ్రీ అరవిందాశ్రమంలో ఉండగా ఎవరో రమణ మహర్షి గురించి ఆమెకు చెప్పారు. పోనీ రమణాశ్రమంలో కొంతకాలం ఉందామని పాండిచ్చేరి నుండి బయలుదేరింది. 1947లో ఆమె బస్సులో ప్రయాణిస్తుండగా ఆకాశంలో శ్రీరమణుల తేజోనేత్రాలు కనిపించాయి. కలలో రమణ మహర్షి దర్శనం అయింది. రమణాశ్రమం చేరిన తర్వాత భగవాన్‌ని చూచి ‘అవే కళ్లు ... అవే కళ్లు’ అనుకున్నది. ఆనాటినుండి రమణ మహర్షి నిర్యాణం వరకు ఆమె రమణాశ్రమంలోనే ఉండిపోయింది.

ఆమె ఇలా రాస్తారు : “రమణ మహర్షిని వర్ణించడానికి మాటలు చాలవు. రమణ తత్వం ఎలా చెప్పను! రమణ హృదయం ఎలా ఆవిష్కరించను? ఆశ్రమంలో

మహర్షి అడుగుపెట్టగానే ఒక కాంతి గది అంతా నిండేది. భగవాన్ బయటకు వెళ్లగానే ఆ వెలుగు ఆయన వెంట వెళ్లినట్లయ్యేది. గదిలో శూన్యం మిగిలేది. మహర్షి ముఖంలో అద్భుత తేజస్సు. వారి కళ్లు కాంతి గోళాలు. ఆయన సమక్షంలో ఏ దిగులు ఉండదు. ఆయన ప్రేమను మన గుండెల నిండా నింపుకోవడమే మన పని. నా హృదయ కవాటాలు తెరచిన మొదటి వ్యక్తి, చివరి వ్యక్తి మహర్షి."

## 7. స్వామి చిన్మయానంద



రమణ మహర్షి ప్రభావం ఎవరిపైన ఎట్లా పని చేస్తుందో ఎవరూ చెప్పలేరు. పరుసవేదికి ఇనుమును బంగారంగా మార్చే గుణం ఉంటుంది. మహాత్ములు, తాపసులు తమ అనుగ్రహంతో పామరుల్ని సైతం పండితులుగా మార్చగలరు. ఎలాంటి వారైనా మహర్షిని ఒకసారి దర్శిస్తే చాలు మారిపోతారు. వారిపట్ల ఏర్పడే అభిమానం పూజ్య భావంగా మారుతుంది.

చిన్మయానందపై రమణ మహర్షి ప్రభావం అలాంటిదే. వారిని భౌతికంగా దర్శించిన వారి విషయం చెప్పేదేముంది! వారి ఫోటో చూస్తేనే మనసు మారుతుంది. ఎవరికైనా ఒకసారి రమణాశ్రమం దర్శిస్తే మరచిపోవడం ఉండదు. అక్కడి మధురానుభూతుల్ని విస్మరించడం జరగనిపని. రమణ మహర్షి అంటేనే మౌనం. శూన్యంలో వెతకటం మహర్షి తత్వం.

చిన్మయానంద విద్యార్థిగా ఉన్నప్పుడే రమణ మహర్షిని గురించి విన్నాడు. బైరాగి టికెట్‌తో దేశపర్యటనకు బయలుదేరి, రమణాశ్రమం రావడం జరిగింది. అక్కడ పరిస్థితులు, పద్ధతులు తెలియవు. వచ్చి రమణుని ఎదురుగా కూర్చున్నాడు. మహర్షి ధ్యానం నుండి లేచి కళ్లు విప్పగానే దృష్టి చిన్మయానందపైన ప్రసరించింది. ఒక్క నిమిషం లోతుగా, గాఢంగా చిన్మయ కళ్లలోకి చూచాడు. అయిపోయింది. చిన్మయానందలో జ్ఞానజ్యోతి వెలిగింది. లోపల అపూర్వ సంచలనం. ఆధ్యాత్మికత నిలువెల్లా విద్యుత్‌లా పాకింది.

తర్వాత చిన్మయానంద ఉత్తర కాశీ వెళ్లి తన గురువు తపోవన మహారాజ్ వద్ద కొన్ని సంవత్సరాలుండి,శుశ్రూష చేశాడు. అన్ని సంవత్సరాలు గంగాతీరంలో గురుసేవలో పొందింది ఒక్క నిమిషం రమణ సన్నిధిలో పొందిన అనుభూతికి సాటి రాలేదని అంటారు.

## 8. దయానంద సరస్వతి



రమణ మహర్షి ప్రియశిష్యుడు యోగిరామయ్య. స్వామి దయానంద సరస్వతికి రమణ మహర్షిని గురించి చెప్పింది యోగిరామయ్య. దయానందకు రమణుని పేరు చెవిని పడగానే మహాశూన్యంలో తలమునక లైనట్లయింది. ఆయన అంటారు "రమణ మహర్షి రూపం, రమణ నామం నిశ్చలత్వానికి సూటిబాట. వినిర్మలతకు రహదారి. శాంతికి కడపటిమెట్టు. శ్రీరమణ గవాక్షం గుండా పయనించి వందల సంవత్సరాలు కాదు, యుగాంతం వరకు, అనంతం వరకు సత్యాన్ని దర్శించవచ్చు".

## 9. సోమర్‌సెట్ మామ్



పాల్ బ్రంటన్ తర్వాత మహర్షి కీర్తికి అద్దం పట్టిన విదేశీ రచయిత సోమర్ సెట్ మామ్. మామ్ ప్రఖ్యాత నవలా రచయిత. 1938లో ఆయన రమణాశ్రమం రావడం జరిగింది. ఆశ్రమంలో గడిపింది మూడుగంటలే అయినా, మూడు జన్మల అనుభవం పొందాడు. తర్వాత మామ్ తను రాసిన నవల 'రేజర్స్ ఎడ్జ్'లో రమణ మహర్షిని వర్ణించాడు. ఆ నవల 1944లో అచ్చయి విశేషాదరణ పొందింది. ఆ నవల ద్వారా మహర్షి ప్రతిభ అన్నిదేశాలకు పరిచయమైంది. తర్వాత చాలా సంవత్సరాలకు మామ్ 'ది సెయింట్' అనే పేరున మరొక రచన చేశారు. అది మహర్షి గురించి. ఇరవై ఏళ్ళ తర్వాత 'ది సెయింట్' అచ్చయింది. 'మామ్' రమణాశ్రమం నుండి మద్రాసు చేరిన వెంటనే తన పరిచయాన్ని రాసుకున్నాడు. దానిని మేజర్ చాడ్విక్ ఖండించడం జరిగింది. చాడ్విక్ ఇలా రాస్తాడు –

సోమర్‌సెట్ మామ్ అనే బ్రిటిష్ రచయిత మహర్షి దర్శనానికి వచ్చాడు. ఆయన మేజర్ చాడ్విక్‌ను వెళ్లి ఆయన గదిలో కలిశాడు. అక్కడ మామ్ స్పృహ తప్పి పడిపోయాడు. చాడ్విక్ వెళ్లి భగవాన్‌ను అర్థించాడు. భగవాన్ స్వయంగా చాడ్విక్ గదికి వచ్చి కూర్చుని, మామ్ వైపు తన దృష్టిని సారించారు. చాలాసేపటికి మామ్‌కు స్పృహ వచ్చింది. భగవాన్‌కు కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించాడు. ఆయనలో ఏం మార్పు వచ్చిందోకాని, భగవాన్, మామ్ ఒకరి కెదురుగా ఒకరు కూర్చున్నారు. ఒక గంట కాలం అలా చూడడంతోనే సరిపోయింది. మామ్

ఏదో ప్రశ్నించాలని ప్రయత్నించాడు, అడగలేక పోయాడు. 'అడుగు' అని చాడ్విక్ వత్తిడి చేశాడు. భగవాన్ అన్నారు! "అంతా అయిందిలే. హృదయాలు మాట్లాడుకున్నాయి చాలు. అంతా నిశ్శబ్దంగా జరిగిపోయింది." వారిద్దరూ నవ్వుకున్నారు. భగవాన్ ఆ గది వదలి వెళ్లిపోయారు.

మామ్ తన అనుభూతిని ఇలా రికార్డు చేసుకున్నాడు –

"అది విభ్రాంతో, ధ్యానమో నాకు తెలియదు. నాకు ఎంతో హాయిగా వుంది. తర్వాత హాలులోకి వెళ్లాను. ఆ హాలు 50 అడుగుల పొడవు. పాతిక అడుగుల వెడల్పు. అక్కడే భగవాన్ దర్శనం యిస్తారు. భగవాన్ ఒక బల్లపైన, పులిచర్మం మీద కూర్చుని ఉన్నారు. ఎదురుగా అగరొత్తులు కాలుతున్నాయి. వాసన బావుంది. శిష్యులు భక్తిగా ఒదిగి కూర్చుని ఉన్నారు. కొందరు ధ్యానం చేసుకుంటున్నారు. కొందరు ఏదో చదువుకుంటున్నారు. ఎవరో బుట్టలతో పళ్లు తెచ్చి సమర్పించారు. వచ్చినవాళ్లు వెళ్లిపోయారు. భగవాన్ మళ్లీ ధ్యానంలో మునిగిపోయారు. హాలులో కూర్చున్న వారిలో ఏదో స్పందన కలిగింది. వణికిపోయారు. చాలా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దంలో అందరికీ శక్తిపాతం ఏదో జరిగింది. తర్వాత నేను బయటకు వచ్చాను."

## 10. మెర్సిడెజ్ డి. అకోస్టా

1938 నవంబరులో రమణాశ్రమం వచ్చిన స్పానిష్ అమెరికన్ వనిత మెర్సిడెజ్ డి. అకోస్టా. ఆమె ప్రచ్ఛన్న రమణ భక్తురాలు. హాలీవుడ్ సినిమాలకు స్క్రిప్టు రాస్తుంది. 24 సంవత్సరాల తర్వాత ఆమె ఒక పుస్తకం రాసింది. "Here lies the Heart" ఆ పుస్తకం పేరు. అందులో ఆమె పాతికేళ్ల భక్తి నిక్షిప్తం చేసింది. ఆమె మొదట పాల్ బ్రంటన్ "Search in secret India" చదివి ప్రభావితురాలైంది. ఆమె అంటారు "ఆ పుస్తకం చదివిన తర్వాత నాలుగు రోజుల పాటు నేను వేరొక విషయం ఆలోచించలేకపోయాను. నా మనసంతా శూన్యమైంది. నన్ను రమణ మహర్షి ఆత్మ పూనినట్లయింది. ఎవరితో మాట్లాడబుద్ధి అయ్యేదికాదు. నేను మహర్షిని కలుసుకోగలనని గట్టిగా నమ్మకం కలిగింది."

ఆమె రమణ సన్నిధికి వచ్చి వాలిపోయింది. ఏ ప్రశ్నలు అడగవలసిన అవసరం కనిపించలేదు. ఆమెకు అనుమానాలన్నీ ఆటోమాటిక్‌గా తీరిపోయాయి. ఎన్నో ప్రశ్నలు తయారు చేసుకుని వచ్చి, చివరికి రెండే ప్రశ్నలు అడిగింది భగవాన్‌ని.

ప్రశ్న : నా అంతరాత్మను ఫాలో అయిపోమంటారా?

రమణ : నీ అంతరాత్మ గురించి నాకేం తెలుసు. **నీ ఆత్మ చెప్పినట్లు చేయి. ఆత్మ నడిపించినట్లు నడువు. ఎవరు ఎవరినీ అనుసరించవలసిన పనిలేదు.**

ప్రశ్న : మతాలు, గురువుల్ని గురించి?

రమణ : **హృదయంలోకి చొచ్చుకుపోతే మతాలుండవు. గురువులుండరు. ఆత్మ దర్శనమవుతుంది. అది చాలు.**

మహర్షి తన చేతిని హృదయం వేపు చూపిస్తూ అన్నారు "ఇక్కడ ఉంటుంది హృదయం. అది శక్తివంతమైన ఆధ్యాత్మ కేంద్రం. దానినే హృదయం అంటారు. ఆధ్యాత్మికంగా ఎదిగిన సాధకుని అంతర్నేత్రానికి అది స్పష్టంగా తెలుస్తుంది. ధ్యానం చేస్తుంటే హృదయ కుహరంలోని ఆత్మను నీవు స్వయంగా తెలుసుకో గలవు."

మొదటిసారిగా డి.అకోస్తా మహర్షిని కలిసినప్పుడు ఆయన పాదాల చెంత ఎదురుగా కూర్చుని ఆయన కళ్లలోకి చూచింది. మహర్షి ఆమె కళ్లలోకి ప్రేమగా చూడసాగారు.

"ఆ క్షణంలో నన్ను నేను మరచిపోయినాను. ఏమని వర్ణించను? నాలోని ఆత్మ ఉన్నత శిఖరాన్ని చేరినట్లు అనిపించింది. అప్పుడు భగవాన్ మందహాసం చేశారు. అప్పటి ఆనందం నేను జన్మలో మరచిపోలేను. ఆ ఒక్క క్షణం చాలు. అప్పుడు వచ్చిన మార్పు జీవితాంతం సరిపోతుంది."

అమెరికా తిరిగి వెళ్లిన తర్వాత ఆమె కొన్ని ప్రశ్నలు భగవాన్‌కి పంపింది. మరొక అమెరికన్ భక్తుడు తెచ్చి భగవాన్ కిచ్చాడు. ఆయన పేరు గేహర్గ్స్.

గేహర్గ్స్ కొంతకాలంగా ఆశ్రమ అంతేవాసి. ఆమె పంపిన ప్రశ్నలు పునర్జన్మలు, గతం, భవిష్యత్తుకు సంబంధించినవి.

ప్రశ్న : పునర్జన్మ వాస్తవమా ! నిజంగానే పునర్జన్మ ఉంటుందా?

మహర్షి : ఇప్పటి జన్మ వాస్తవం అయితే, పునర్జన్మ వాస్తవమే. ఇంతకుముందు జన్మించి ఉండడం నిజమైతే, మళ్లీ జన్మించడమూ నిజమే అవుతుంది.

ప్రశ్న : మరణం అంటే ఏమిటి? పుట్టడం అంటే ఏమిటి? ఎందుకు?

జవాబు : శరీరానికి పుట్టడం, చావడం రెండూ తప్పనిసరి పనులు.

ప్రశ్న : మరణానికి, మరొక జన్మకు రావడానికి మధ్య విరామం ఎంత?

జవాబు : ఒక్కొక్కరు ఒక ఏడాదిలోపే జన్మిస్తారు లేదా మూడు సంవత్సరాలు

పట్టవచ్చు. లేదు, వేల సంవత్సరాలు పట్టవచ్చు. అయినా కాలాన్ని కొలవడం ఎలా? శూన్యానికి విరామం ఏమిటి? అసలు కాలం అంటేనే శూన్యం కదా.

ప్రశ్న : మనిషికి గత జన్మల జ్ఞానం ఉండదు. ఎందుచేత?

జవాబు : గతించిన వన్నీ భ్రమలు. కరిగిపోయిన కలలు. వాటి జ్ఞాపకాలతో ఏంపని? నీవు ఒకసారి ఆత్మలోకి ప్రస్థానిస్తే గతంతో పనిలేదు. భవిష్యత్తు అవసరం ఉండదు. నిజానికి వర్తమానం సైతం శూన్యమై పోతుంది. ఏమీ మిగలదు. **ఆత్మ కాలాతీతం. కాలరహితం.**

ప్రశ్న : ఈ శరీరాన్ని వదిలిన ఆత్మ వెంటనే మరొక శరీరాన్ని ఆశ్రయిస్తుందా?

జవాబు : శరీరం ఆధారం లేకుండా 'జీవి' ఉండదు.

ప్రశ్న : ఎటువంటి శరీరాన్ని కోరుకుంటుంది?

జవాబు : అది ఈథర్ శరీరం కావచ్చు. సూక్ష్మ శరీరం కావచ్చు. స్థూల శరీరం కావచ్చు. ఆత్మకు ఏదో ఒక శరీరం ఆధారంగా ఉండాలి.

ప్రశ్న : స్థూలం అంటే భౌతిక శరీరం అనే కదా! అదే మనకు తెలుస్తుంది?

జవాబు : ఆ తేడా నీకు అర్థం కావడానికి మాత్రమే. జ్ఞానికి శరీరాల తేడా ఉండదు.

ప్రశ్న : మరల జన్మించడానికి కారణం ఏమిటి?

జవాబు : తీరని కోరికలు, నెరవేరని ఆశయాలు. కోరికలు తీర్చుకోవాలన్న తపనతో మళ్లీ జన్మిస్తారు. ప్రతి శరీరానికి ప్రతి జన్మలో తీరని కోరికలు కొన్ని మిగిలి ఉంటాయి. కొన్ని కొత్తగా ఏర్పడుతుంటాయి. అందుచేతనే మనిషి మళ్లీ మళ్లీ జన్మించడం జరుగుతోంది.

ఈ జవాబుల చివర 'కొసమెరుపు' లాగా భగవాన్ ఒక సందేశం యిచ్చారు.

"నీ ప్రశ్నలు మంచివే. బావున్నాయి. డి.అకోస్తాతో చెప్పు. అతిగా, స్వంత తెలివి తేటలతో ఆలోచించవద్దని. ధ్యానం చేసుకుంటూ ఆలోచనల్ని దూరం చేసుకోమను. చాలు. మనస్సు 'ఆత్మ'లో లయిస్తే ప్రశాంతి లభిస్తుంది. **ఆధ్యాత్మపరులు హృదయ గుహలో విశ్రమించడం నేర్చుకోవాలి. ఆ పని సహజంగా జరుగుతుంది. జరగాలి.** అప్పుడు ఈ ప్రశ్నలేవీ మిగలవు. ప్రశ్నించే అవసరం ఉండదు. అలా స్థిమితంగా ఉండడం 'అకర్మణత్వం' కాదు. మౌనంగా, నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉండడం ఒక్కటే నిజమైన పని.

## 11. ఉమాదేవి



పోలండ్ దేశానికి చెందిన రమణ భక్తురాలు ఉమాదేవి. తన అసలు పేరు మార్చుకుని 'ఉమాదేవి' అయింది. రమణ మహర్షి శిష్యవర్గంలో ఎన్న దగిన మహిళ ఆమె. హిందూమతం స్వీకరించి రమణ శిష్యురాలైంది. "రమణ మహర్షి బోధలు" అనే పుస్తకం రాసి పోలండ్ ప్రజకు మహర్షిని పరిచయం చేసింది. అనేక మంది పోల్స్ రమణాశ్రమం రావడానికి ఆమె పుస్తకమే బాట వేసింది. పైగా భగవద్గీతను ఆమె పోలిష్ భాషలోకి అనువదించింది. యుద్ధ సమయంలో అయిదువేలమంది పోల్స్ మహారాష్ట్రలోని కొల్హాపూర్‌లో ప్రవాస శిబిరాల్లో ఉండేవారు. 1946 అక్టోబరులో ఉమాదేవి ఆ శిబిరంలోని 25 మంది మహిళల్ని రమణాశ్రమానికి తీసుకువచ్చింది. వారంతా పాటలు పాడి, నృత్యాలు చేసి ఆశ్రమవాసుల్ని రంజింపచేశారు.

దేవరాజ మొదలియార్ ఆ బృందానికి తోడుండి, గిరి ప్రదక్షిణ చేయించాడు. అన్ని దేవాలయాలు చూస్తూ గిరి ప్రదక్షిణ ముగించేసరికి వారికి మూర్ఛ వచ్చినంత పనైంది. 'అమ్మ బాబోయ్ సో మెనీ గాడ్స్ హియర్' అని ఆశ్చర్యపోయారు. మొదలియార్ రెట్టించిన ఉత్సాహంతో అందరు దేవుళ్ళ గురించి, పురాణ కథలు వల్లించి చెప్పాడు. చివరకు "అందరూ ఒక్కటే" అనే పుస్తకం యిచ్చాడు చదవమని. ఆ పుస్తకం ఇంగ్లీషులో ఉంది. "All in One" సర్వం జగన్నాథం. ఆ పుస్తకం ప్రతులు ఒకటి ఉమాదేవికి, రెండవది బృందానికి బహూకరించాడు. విదేశాల నుండి వచ్చే వారి విషయం భగవాన్ శ్రద్ధ తీసుకునేవారు. పాపం ఎంతయినా విదేశీయులు గదా.

ఉమాదేవి తరచు రమణాశ్రమం వస్తుండేది. 1938 ఫిబ్రవరిలో వచ్చినపుడు ఆమె కొన్ని ప్రశ్నలు వేసింది. అవి చైతన్య ప్రబోధాలు. ఆమె తనకు 'సదాశివ దర్శనం' అనుగ్రహించమని అర్థించింది. ఆమెకు శివుడంటే ఇష్టం. మహర్షి అన్నారు "ఆత్మ విచారణ ద్వారా అనుభూతి చెందడం ముఖ్యం. దృశ్యం ఏదైనా మనస్సు కల్పించిందే అవుతుంది. కల్పన శాశ్వతం కాదు. కల్పన కరిగిపోతుంది. నశిస్తుంది. దర్శనం ముఖ్యం. నిదర్శనం అంతరించిపోయి దర్శనం మిగలాలి. నేనెవరు? అన్న విచారణ చాలు. హృదయం లోతుల్లోకి వెళ్లి, అక్కడ స్థిరపడడం ప్రధానం.

ప్రశ్న : ఆ పని త్వరగా జరగాలంటే ఏం చేయాలి?

జవాబు : ఆ తొందరే పనికి రాదు. అదే అవరోధం. ఏదీ త్వరగా జరగాలనుకోవడం తప్పు. 'ఆత్మ' కార్యానికి కాలనియమం ఉండదు. కాల నిబంధన ఉండకూడదు. 'సమర్పణ' చేసుకోవడం ముఖ్యం. ఈశ్వరానుగ్రహం ఎప్పుడు కలుగుతుందో, ఈశ్వరుడు ఎప్పుడు దర్శనమిస్తాడో ఎవరూ చెప్పలేరు. ఎవరికీ తెలియదు. నిరీక్షించవలసిందే. ఇది కావాలని అడగకూడదు. నీ ఇష్టం వచ్చినట్లు అర్థిస్తే, అడిగితే అది 'సమర్పణ' అవదు. శాసించడం అవుతుంది. భగవంతుడు నీవు చెప్పినట్లు చేయాలా? నీవు శాసించినట్లు చేయాలా?

నేను సమర్పణ చేసుకున్నాను కనుక నేను చెప్పినట్లు భగవంతుడు చేయాలని అనుకుంటావు. ఆయనకు తెలుసు నీకు ఏది కావాలో, ఏది మంచిదో. అంతా ఈశ్వరలీల. సర్వం ఆయన ఇష్టానికి వదలడమే మంచిపని. మన బరువులు మోసే వాడే భగవంతుడు. నీ బాధ్యతలన్నీ భగవంతునికి వదిలి పెట్టు. ఆయన చూచుకుంటాడు. అదీ సమర్పణ అంటే.

కాదంటే, నీ ప్రశ్నలు ఎక్కడ నుండి, ఎందుకు ఉద్భవిస్తున్నాయో యోచించు, పరిశీలించు, అన్వేషించు. నీ హృదయంలోకి నెమ్మదిగా జొరబడు. అక్కడ స్థిరపడు. బట్ట కొనాలంటే నాణ్యత, రంగు, హంగు చూడాలి తప్ప దారాలు, పోగులు లెక్క పెట్టకూడదు. సినిమా చూస్తావు. బొమ్మల కదలిక, కథ చూడాలి తప్ప దాని వెనుక ఉన్న తెరచూడవు. ఒక పుస్తకం చదివితే అక్షరాలు ముఖ్యం. కాగితం నాణ్యత చూడవు. ఒకే చైతన్యానికి బహురూపాలు. మనిషి రూపాలను చూస్తాడు తప్ప చైతన్యం పట్టించుకోడు.

## 12. ఆర్థర్ ఆస్బార్న్



ఆస్బార్న్ మనిషిని చూచినా, ఫోటో చూచినా, ఒక పొడవాటి సన్నటి 'రుషి' కనిపిస్తాడు. అతనికి చిన్నతనం నుండి ఆధ్యాత్మికత పట్ల మక్కువ. రెనెగ్యునాన్ అనే ఫ్రెంచ్ తాత్వికుడు చెప్పిన ఆత్మతత్వం ఆస్బార్న్ బుర్ర కెక్కింది. అన్నింటికి ఆధారం ఆత్మ, మూలం ఆత్మ అన్నది ఆయన సిద్ధాంతం. రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వమే ఆస్బార్న్ రమణ మహర్షి గురించి వినడం, చదవడం జరిగింది. ఫోటో చూచాడు. ఆయన ఎవరినీ తన శిష్యులుగా అంగీకరించరని, ఆయనది ఒక నిర్దుష్టమైన విధానం కాదని అనుకునేవాడు. అంచేత రమణాశ్రమం రావడం వాయిదా వేస్తూ వచ్చాడు.

1945 చివర్లో తిరువణ్ణామలై వచ్చాడు. రమణాశ్రమం పరిసరాలలో ఇల్లు తీసుకున్నాడు. తర్వాత ఆశ్రమంలో ఆస్బార్న్ ప్రధాన వ్యక్తి అయినాడు. మొదటిసారి మహర్షిని చూచినప్పుడు అతను ఇంప్రెస్ కాలేదు. ఒక ఉత్సవంనాడు అకస్మాత్తుగా అతని మనస్సు మారింది. మహర్షి ఎదురుగా తిష్టవేసి ఆయనలోకి తీవ్రంగా చూడసాగాడు. మహర్షి అతనివేపు గుచ్చి గుచ్చి చూచారు. ఆ చూపు మెత్తని బాకులా అతని గుండెల్లో గుచ్చుకుంది.

"నీకు చెప్పినా నీలో మార్పు రాలేదు" అన్నట్లు అనిపించింది.

వెంటనే కళ్లు మూతలు పడ్డాయి. మైకం కమ్మింది. ఏదో వెలుగు ఆనందం. మహర్షి తనను శిష్యునిగా అంగీకరించిన అనుభూతి కలిగింది. తనకు గురువుగా ఉండే బాధ్యత మహర్షి తీసుకున్నారు. రమణునిమార్గం అతి ప్రాచీనమని, మౌలికమని గుర్తించాడు. అదే డైరెక్ట్ లైన్. సూటి మార్గం ఆత్మను చేరడానికి. మహర్షిని ఆ క్షణంలో తన హృదయస్థ గురువుగా, అంతరంగ గురువుగా ఆమోదించాడు. మహర్షి తనను ఆమోదించేవారికి, తనను ఆరాధించేవారికి ఎప్పుడు అందుబాటులో ఉంటారు. అండగా నిలుస్తారు. ఆస్బార్న్ రమణ మహా సమాధి వరకు ఆయన్ని అంటిపెట్టుకుని ఉన్నాడు.

"నేనెక్కడికి పోతాను. ఇక్కడే ఉంటాను" అన్న రమణ వాక్యం సత్యం.

రమణ మహర్షి నిర్యాణం తర్వాత వారి అనుగ్రహం ఎప్పటిలా కలుగుతుందనడానికి ఆస్బార్న్ ప్రత్యక్ష నిదర్శనం. ఆ తర్వాతనే ఆస్బార్న్ "రమణ మహర్షి – ఆత్మజ్ఞానం" గురించి పుస్తకాలు రాశాడు. పధ్నాలుగు సంవత్సరాల తర్వాత "The mountain path" అని పత్రికను ప్రారంభించి దానికి సంపాదకత్వం వహించాడు. అది ఎలా జరిగిందంటే ...

ఒకరోజు ఆస్బార్న్‌కు ఒక కల వచ్చింది. కలలో రమణ మహర్షి కనిపించి తన దగ్గరకు రమ్మని ఆహ్వానించాడుట. వెళ్లి ఆయన కూర్చునే సోఫా పక్కన కూర్చున్నాడు. "రమణ మహర్షి తన చేతులు నా తలపైన ఉంచి ఆశీర్వదించారు. ఆ క్షణంలోనే భగవాన్ గురించి రాయాలన్న సంకల్పం కలిగింది. రమణుల ఆత్మజ్ఞానం గురించి, ఆత్మబోధ గురించి రాయాలనుకున్నాను" అంటారు ఆర్థర్ ఆస్బార్న్.

## 13. మౌని సాధు

ఆయనకు రమణ మహర్షి గురించి బొత్తిగా తెలియదు. ఎప్పుడూ ఆ పేరు వినలేదు. 1945లో ఒక మిత్రుడు పాల్ బ్రంటన్ పుస్తకం బలవంతంగా చేతిలో



పెట్టి చదవమన్నాడు. మిత్రుని ఒత్తిడి మీద చదివాడు. మహర్షిని గురించిన రెండు అధ్యాయాలు చదవగానే "At last I had found my Master" అనిపించింది. ఆయన్ని దర్శిస్తే తొలి అడుగులోనే నేను గమ్యం చేరగలనని అనిపించింది. ఒక్కసారిగా అతని పూర్వసాధనలన్నీ ఆగిపోయాయి. పారిస్‌లో ఒక రోమన్ కాథలిక్ చర్చి ప్రాంగణంలో కూర్చుని ఆత్మ విచారణ ప్రారంభించాడు. ఏ మతం వారైనా ఆత్మ విచారణ చేయవచ్చునన్నది రమణ మహర్షి సిద్ధాంతం. అది ఆయనకు నచ్చింది.

పారిస్‌లో రామకృష్ణ మఠం ఉంది. అక్కడ స్వామి సిద్ధేశ్వరానంద మౌన మునితో మాట్లాడుతూ "ఆ రమణ మహర్షి నీకు సరైన గురువు. నీ ఆధ్యాత్మిక గురువు. ఆయన సహాయం అర్థించు. నీకు అందుతుంది" అని సలహా యిచ్చాడు. "ఓం రమణ ఓం" అని మంత్ర జపం చేయమని చెప్పాడు. ధ్యానం సాగింది. 1949లో గాని మౌనముని రమణాశ్రమం రావడం కుదరలేదు. ఆశ్రమానికి వచ్చిన రోజునే అతనిపై రమణ మహర్షి ప్రభావం సోకింది. కొన్ని నెలలపాటు ఆ ఆకర్షణలో పడి ఉక్కిరిబిక్కిరైనాడు.

"నేను ప్రాపంచిక విషయాలలో తలమునకలవుతున్నవాడిని. నాకు రమణ మాటలు శిరోధార్యాలు. ఆచరణీయాలు. 'నీలోపల చూడు, నిజాత్మ తెలుస్తుంది'. అని రమణ బోధ. మహర్షి సన్నిధిలో అసూయలు, ద్వేషాలు, విశ్వాసాలు అన్నీ నశిస్తాయి. "ఎప్పుడూ మహర్షి కళ్లలోకి చూస్తూ కూర్చునేవాడిని. అందరి హృదయాలలో ప్రేమను పండించడం మహర్షి పని. ముందు భక్తి కలుగుతుంది. తర్వాత విశ్వాసం పెరుగుతుంది. ఆ ప్రేమ 'శక్తి'గా మారుతుంది. డైరెక్ట్ పాత్ వల్ల మన లక్ష్యం మనకు తెలుస్తుంది. గమ్యం కనిపిస్తుంది. లాభాలు, ప్రయోజనాలు ఆశించనవసరంలేదు. మనం ఎంత అభివృద్ధి చెందితే అంత ఫలితం ఉంటుంది. మొదటి అడుగులోనే గమ్యం తెలుస్తుంది. మన జీవితానికి అర్థం, పరమార్థం అవగతమవుతాయి. ఎన్ని అనుభవాలు కలిగినా, ధ్యానం ఎంత తృప్తిగా సాగినా, 'గురుస్పర్శ' అవసరం. గురూపదేశం, సందేశం అవసరం".

ఆయన వెళ్లిపోతున్నప్పుడు మహర్షి వద్ద తలవంచి నమస్కరించాడు. మహర్షి ప్రేమగా అతని నుదురు స్పృశించారు.

"భగవాన్ నా తలపైన చేయి ఉంచగానే నాలో విద్యుత్ ప్రవహించింది. గొప్ప విస్ఫోటనం జరిగింది. అదే నన్ను జీవితాంతం నడిపిస్తోంది".

## 14. కృష్ణ రాజేంద్ర వడయర్



1937 ఫిబ్రవరి 28న మైసూరు మహారాజా కృష్ణ రాజేంద్ర వడయర్ మహర్షి దర్శనానికి వచ్చాడు. ఆయన మహర్షి వద్ద పదిహేను నిమిషాలు మాత్రమే ఉన్నాడు. ఇద్దరు ఒకరినొకరు మౌనంగా చూచుకోవడం తప్ప మాట్లాడుకోలేదు. మధ్యాహ్నం భోజనం సమయంలో ఆశ్రమవాసులు ఆ విషయమే చర్చించుకో సాగారు. మైసూరు మహారాజా వంటివాడు వస్తే ఆశ్రమానికి కనకవర్షం కురుస్తుందనుకున్నారు. మహర్షి అన్నారు "ఆయన చాలా పరిణతి చెందినవాడు. ఒక్క క్షణం ఒక్క చూపు చాలు, మాటల అవసరం లేకుండా మనస్సు గ్రహిస్తాడు."

"మహారాజా మిమ్మల్ని ఏం అడిగారు? మీరేం చెప్పారు?"

"ఆయన తన కార్యక్రమాలకు ఆశీస్సులు అడిగాడు. 'భగవాన్, ఇక్కడ మీ సమక్షంలో ఉండి మీసేవ చేసుకునే అవకాశం, అదృష్టం నాకు లేవు. సదా మీ అనుగ్రహం అర్థిస్తున్నాను' అని మౌనంగా చూపులతో అర్థించాడు. అంతకు మించి ఆయన అడిగింది లేదు."

## 15. బాబూ రాజేంద్ర ప్రసాద్



1938లో మహాత్మాగాంధీ ప్రతినిధిగా బాబూ రాజేంద్రప్రసాద్ రమణాశ్రమం వచ్చి మూడురోజులు గడిపాడు. ఆయనకు తోడుగా జమునాలాల్ బజాజ్ వచ్చాడు. బజాజ్ భగవాన్‌ని కొన్ని ప్రశ్నలడిగాడు.

ప్రశ్న : ఈ పోరాటంతో స్వరాజ్యం సంపాదించ గలిగితే అది ఎవరికైనా ఆనంద దాయకమే గదా భగవాన్ !

మహర్షి : త్యాగం ఒక్కటే చాలదు. త్యాగం వెనుక శరణాగతి ఉండవలె. భగవదిచ్ఛను, భగవచ్ఛక్తిని ఆమోదించాలి. అప్పుడే సత్ఫలితం. ఆ విషయం ఆయన (మహాత్మాగాంధీ) మరువకూడదు. అప్పుడు ఆనందపడవలసింది ఏముంటుంది? ఫలితం ఆశించకుండా కర్తవ్యం నెరవేర్చడం ముఖ్యం. దానిని నిష్కామయోగం అంటారు.

ప్రశ్న : భక్తుల్ని అనుగ్రహించే శక్తి భూమిపైన ఎవరికీ లేదంటారా? మీవంటి మహర్షులు స్వరాజ్యం సంపాదించవచ్చుగదా? మన ప్రాచీన మహర్షుల తపస్సు ఇప్పటికీ పనికొస్తుందా? దానిని మనం ఉపయోగించుకోగలమా?

మహర్షి : ఉపకరిస్తుంది. అది ఏ ఒక్కరి సొత్తు కాదు. మనుషులలో చైతన్యం కలగడానికి వారి తపోశక్తి పనికొస్తుంది.

ఆ ఇద్దరి సంభాషణ బాబూ రాజేంద్రప్రసాద్ మౌనంగా ఉండి విన్నారు.

చివరకు "మహాత్మాగాంధీ నన్ను తమ దర్శనానికి పంపారు. మీసందేశం?" అని అడిగాడు.

మహర్షి : ఏం సందేశం కావాలి? హృదయాలు పరస్పరం పలకరించుకుంటున్నాయి. అది చాలు. ఇక్కడ శక్తి అక్కడ తనలోనూ పనిచేస్తున్నదిలే.





# 28. అమ్మా, నాన్నా... రమణమహర్షి

**రమణ** మహర్షి మాతృమూర్తి అళగమ్మాళ్ నిర్యాణానికి, రమణాశ్రమ నిర్మాణానికి గొప్ప సంబంధం, ఆధ్యాత్మిక అనుబంధం ఏర్పడింది.

అళగమ్మాళ్ మాతృభూతేశ్వరిగా నిత్య పూజ లందుకొనడంలో ఆంతర్యం రమణమహర్షి ఆమెలో జగన్మాత అంశను గుర్తించడం. తను అరుణాచల నివాసం వదలి అమ్మగారి సమాధి వద్ద ఆశ్రమం ఏర్పాటు చేయడం, యాదృచ్ఛికం కాదు. అమ్మగారి సమాధి ప్రక్కన మహర్షి సమాధి ఏర్పాటు కావడం, రెండు సమాధులపైన ఆలయాలు నిర్మితం కావడం, నిత్యపూజలు ఆరాధనలు జరగడంలో విశ్వ శ్రేయస్సు ఉంది. 1922 డిసెంబరు 19న అరుణాచలం దక్షిణ దిక్కున పాలితీర్థం ప్రక్కన ఆమెను సమాధి చేశారు. రమణమహర్షి స్కందాశ్రమం వదలి అప్పటికింకా రూపుదిద్దుకోని రమణాశ్రమం చేరుకున్నారు. అమ్మగారి సమాధి చుట్టూ ఆశ్రమం ఏర్పడ్డది.

అమ్మగారి సమాధి సరే! తండ్రిగారి సమాధి ఎక్కడ? రమణ తండ్రిగారి ప్రస్తావన ఎక్కడ? రమణ మహర్షి అంతటి వ్యక్తి కన్నతండ్రిని చిన్న చూపు చూస్తారా? అలక్ష్యం చేస్తారా! పదిహేడవ ఏట ఇల్లు వదలి వచ్చిన వెంకట్రామన్ తిరిగి మదురైగాని, జన్మస్థలం తిరుచ్చులిగానీ వెళ్లింది లేదు. వెళ్లి అయినవారిని చూచిందీ లేదు. తనను గుర్తించి, పరామర్శించ వచ్చిన బంధువుల్ని బంధువులుగా చూచిందీ లేదు. ఆదరించిందీ లేదు. మొదట్లో తల్లిగారినీ పట్టనట్లు వదిలినా, ఆమె మహర్షి నీడన శేషజీవితం గడపాలని వచ్చిన తర్వాత, ఆమెను తన

భక్తులందరికీ మాతృదేవిని చేశారు. అందరికీ ఆమె 'అమ్మగారు'. ఎవరికైనా తల్లి రుణం తీర్చలేనిది. మరి తండ్రి రుణం? చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయిన వెంకట్రామన్‌కు తండ్రిగారి జ్ఞాపకాలు మిగలలేదు. అయినా ఒకమాట.

ఇల్లు వదలి వెళుతూ వెంకట్రామన్ రాసి పెట్టిన ఉత్తరంలో "నేను నా తండ్రిని అన్వేషిస్తూ పోతున్నాను." అని మాత్రం రాశాడు. ఈశ్వరుని కోసం వెడుతున్నానని లేదు. 'నా' తండ్రిని అనడంలో అర్థం? అన్వేషించడంలోని అంతరార్థం? అప్పటికి వెంకట్రామన్‌కే తెలియదు. వెంకట్రామన్ పితృదేవుని ఆత్మ ఆయనను నడిపిస్తున్నది. వెంకట్రామన్‌కు ప్రేరణ కలిగించింది తండ్రిగారి ఆత్మ శరీరమే. అందువల్లనే 'నా తండ్రిని అన్వేషిస్తూ' అన్నాడు. ఎక్కడో భౌతికంగా ఉన్న వ్యక్తిని చూడడానికి వెళ్లడం కాదది. 'అన్వేషణ'. కంటికి కనిపించని దాన్ని, సూక్ష్మ రూపంలో ఉన్నదాన్ని 'అన్వేషించడం' అంటాం. అంటే వెంకట్రామన్ ప్రస్థానం వెనుక తండ్రిగారి ఆజ్ఞ, ప్రేరణ, ప్రోత్సాహం ఉన్నట్లే.

ఆ లేఖలో అరుణాచలం వెడుతున్నానని గాని, తిరువణ్ణామలై ప్రస్తావన గానీ లేదు. 'భగవంతుని' అన్వేషించే అభిలాష లేదు. 1892లో, అంటే వెంకట్రామన్ పన్నెండవ ఏటనే తండ్రి కాలం చేశాడు. రమణునిలో తండ్రి జ్ఞాపకాలు ఉండ వనడానికి వీలులేదు. అంత పసితనం కాదు. అప్పటికి మదురైలో వెంకట్రామన్ మొదటి 'మరణానుభవం' తండ్రిగారి ప్రభావం కావచ్చు. సుందరం అయ్యర్ ఆత్మ వెంకట్రామన్‌ను వెన్నంటి ఉండేదనీ అనుకోవచ్చు. అది 'ఫలానా' అని తెలుసుకునే పరిజ్ఞానం అప్పుడు వెంకట్రామన్‌కి లేదు. సుందరం అయ్యర్‌కు తెలుసు – వెంకట్రామన్ 'ఆత్మ' సంస్కారం, ఆత్మ కథ. అందుకే ఇల్లు విడిచి వెళ్లిపోతున్న వెంకట్రామన్ వెన్నంటి నడిచింది సుందరం అయ్యర్ ఆత్మ. ఆయనలో 'తండ్రి' స్మరణ తప్ప మరే ఘర్షణ లేదు. తపస్సు తెలియదు. భగవద్భక్తి పెద్దగా లేదు.

తిరువణ్ణామలై చేరిన తర్వాత సరాసరి అరుణాచలేశ్వరుని ఆలయం ప్రవేశించి శివలింగాన్ని కౌగలించుకుని "నీ ఆజ్ఞ మేరకు నేను వచ్చాను తండ్రీ" అని విలపించాడు. ఆ మాటలోనూ 'తండ్రి' స్ఫురణ ఉంది. స్ఫూర్తి ఉంది. ఈశ్వరునిలో తన తండ్రి లీనమైన భావన ఉంది. ఈశ్వర సన్నిధికి చేర్చడం వరకే సుందరం అయ్యర్ 'ఆత్మ' బాధ్యత. ఆ తర్వాత వెంకట్రామన్ బాధ్యత అరుణాచలేశ్వరునిది. అంటే సుందరం అయ్యర్ ఆత్మ ఈశ్వరునిలో లీనమైంది. అరుణాచలేశ్వరాలయమే తండ్రిగారికి నెలవు. అరుణగిరి దక్షిణ పార్శ్వాన వెలసిన మాతృభూతేశ్వరాలయం అమ్మగారి ఆత్మవాసం. రమణుని రక్షిస్తూ వచ్చింది తండ్రి

ఆదరణ, తల్లి ప్రేమ. అమ్మగారి సమాధి నిర్మాణం వెనుక ఒక చిన్న కథ వుంది. మహర్షి స్కందాశ్రమం వదలి తల్లిగారి సమాధి వద్దనే ఉండసాగారు. సమాధిపైన మొదట ఒక తాటాకుల పాక మాత్రం ఉండేది. ఆ పందిరి నీడ. అదే ఆశ్రమం. ఆ సమీపంలో ఒక ఇటుకల బట్టీ ఉండేది. ఆ ఇటుకలు సరిగా కాలక మొరాయించాయి. వ్యాపారులు ఆ బట్టీలోని పనికిరాని ఇటుకల్ని వదలి వెళ్లిపోయారు. భగవాన్ దృష్టిలో సృష్టిలో ఏదీ నిరుపయోగం కాదు. ఆ కాలీకాలని ఇటుకలతో 'అమ్మ'గారి సమాధిపైన ఓ కట్టడం నిర్మిస్తే అన్న సదాలోచన వచ్చింది. కొన్నిరోజుల తర్వాత మహర్షి, ఆయన భక్తులు అర్ధరాత్రి పూట ఆ ఇటుకల్ని మోసుకువచ్చి, ఒకగోడ నిర్మాణం చేశారు – ఒక తాపీ పనివాని సహాయంతో అన్నిపనులు వాళ్లే చేశారు. గోడకట్టి తాటాకులపాక వేశారు.

1939 సెప్టెంబరు 1న మాతృభూతేశ్వరి ఆలయానికి ముహూర్తం నిర్ణయించారు. ఆగమశాస్త్ర రీత్యా దేవాలయ నిర్మాణం జరగాలని మహర్షి సంకల్పం. అప్పటికి శ్రీరమణులు తిరువణ్ణామలై చేరి 43 సంవత్సరాలు. దేవాలయ నిర్మాణం అంటే మాటలు కాదు. ఎంతో డబ్బు కావాలి. ఆశ్రమానికి డబ్బేముంది, విరాళాలు, చందాలు వసూలు చేయడం భగవాన్ అభిమతం కాదు. ఆడభక్తుల కోసం ఒక ధర్మశాల కట్టించాలంటేనే భగవాన్ విరాళాలు అనుమతించలేదు. “మనం సాధువులం. భగవంతుని నమ్మినవాళ్లం. సిగ్గువిడిచి డబ్బుకోసం దేహి అనడం తప్పు, అది ముష్టివాళ్లు చేసేపని. మనం ముష్టివాళ్లం కాదు” అని మందలించారు.

నెమ్మదిగా సాగినా మాతృమందిరం పని జరుగుతోంది. పూర్తికావడానికి పది సంవత్సరాలు పట్టింది. 1949 నాటికి నిర్మాణం పూర్తయింది. ఆ పది సంవత్సరాల కాలం 1939–49 మధ్య భగవాన్ దేవాలయ నిర్మాణంలో అత్యంత శ్రద్ధ చూపించారు. రాత్రి వేళల్లో ఒంటరిగా వెళ్లి తనిఖీ చేస్తుండేవారు. విగ్రహ మూర్తిని ప్రఖ్యాత శిల్పి వైద్యనాథస్థపతి తయారు చేశాడు. 1949 మార్చి 17న కుంభాభిషేక ముహూర్తం. గంగానది నుండి, మిగిలిన అన్ని జీవనదుల నుండి నీరు తెప్పించారు. మహర్షి స్వయంగా ఆలయంలో ప్రవేశించి లింగాన్ని, శ్రీచక్రాన్ని స్పృశించారు. తర్వాత ఆలయ ప్రదక్షిణ చేశారు. అయిదునిమిషాల మహర్షి స్పర్శతో లింగానికి, శ్రీచక్రానికి ప్రాణప్రతిష్ట జరిగింది.

మహర్షి ప్రాణ ప్రదంగా భావించిన మాతృభూతేశ్వరాలయం పూర్తయింది. రమణాశ్రమానికి పూర్ణత్వం లభించింది. అంతవరకు ఉన్న పర్ణశాలలు రాతి కట్టడాలైనాయి. పాశ్చాత్య దేశాల నుండి భక్తుల రాక పెరిగింది. వారందరికీ

ఆశ్రమంలో వసతి కల్పించడం కష్టం. 1941 వరకు పట్టణంలో అక్కడ ఇక్కడ ఉంటున్న విదేశీయులు, దేశీయ భక్తులు సైతం కొండ ప్రక్కనున్న అడవి భూముల్ని కొని చిన్న చిన్న భవనాలు కట్టుకోసాగారు. అయిదు సంవత్సరాల వ్యవధిలో ఆశ్రమం పరిసరాలలో ఒక టౌన్‌షిప్ ఏర్పడ్డది. దానికి ఆశ్రమానికి సంబంధం లేదు. దానిపేరే రమణ నగర్.

1946 వరకు దర్శన మందిరం ఒక్కటే పూర్వపు రూపు రేఖలతో ఉండేది. అందులోనే భగవాన్ భక్తులకు దర్శనం యివ్వడం, నిద్ర. ఆ మందిరం ఎప్పుడూ భక్తులతో నిండి ఉండేది. వరండాలో కూర్చుని భక్తులు ధ్యానం చేసుకునేవారు. 1946లో భగవాన్ స్వర్ణోత్సవాలు జరిగాయి. ఆనాటి నుండి రమణాశ్రమం ఆకర్షణ పదింతలు పెరిగింది. వేల సంఖ్యలో భక్తులు రాసాగారు. 1949లో ఆలయం అనుకుని జూబిలీ హాలు నిర్మాణం చేపట్టారు. దేవాలయంగా నిర్మాణానికి తెచ్చిన వస్తువులు మిగిలాయి. వాటితో జూబిలీహాలు నిర్మాణం పూర్తయింది. ఒక నల్లరాయితో భగవాన్ సోఫా తయారు చేయించారు. అది మహర్షి ఉపయోగార్థం కూర్చోడానికి, పడుకోడానికి. 1949 జూన్ ఒకటిన కొత్త దర్శన హాలు ప్రారంభించారు.

మహర్షి70వ సంవత్సరంలో ప్రవేశించారు. ఆరోగ్యం చెడింది. తిరువణ్ణామలై వచ్చిన కొత్తలో భోజనంలేక, నీడలేక అభోజనంగా తపస్సు చేసిన రోజుల్లో పట్టుకున్న జబ్బులు పైకొచ్చాయి. అప్పుడు శరీర పోషణను నిర్లక్ష్యం చేయడంవల్ల ఇప్పుడు ఆరోగ్యం దెబ్బతిన్నది. కొండపైన గుహలో ఉన్నప్పుడు ఉబ్బసం పట్టుకుంది. కీళ్ల నొప్పులు అప్పటినుండి ఇప్పటివరకు అలాగే ఉన్నాయి. ఇప్పుడు మరీ ఎక్కువైనాయి. 1947 నాటికి మహర్షిలో అనారోగ్య చిహ్నాలు బయటపడసాగాయి. గుండెకు నెమ్ము చేరింది. అప్పుడప్పుడు ఎక్కిళ్లు. ఎడమ మోచేతిపై లేచిన గడ్డ వ్రణంగా మారింది. ఆ వ్రణమే మహర్షి పాలిటి మృత్యువైంది.

1949-50 మధ్య కాలంలో ఆరోగ్యం బాగా విషమించింది. పైకి నవ్వుతూ ఓర్చుకున్నా లోపల చాలా బాధపడేవారు. చివరకు రేడియం ట్రీట్‌మెంట్. ఆపైన శస్త్ర చికిత్స వరకు వెళ్లింది. మహర్షి ఏదో మంత్రం వేసి, తన తపశ్శక్తితో వ్యాధి నయం చేసుకుంటారని భక్తులు భావించసాగారు. 1948 నవంబరులో ఎడమ మోచేతిపై పెసర బద్దంత ప్రమాణంలో గడ్డ లేచింది. ఆశ్రమ వైద్యులు, మరో స్థానిక డాక్టరు సాయంతో ఆగడ్డను తీసి వేయాలని ప్రయత్నించారు.

1949 ఫిబ్రవరి 9న ఆపరేషన్ జరిగింది. దురదృష్టవశాత్తు వెంటనే ఆ పక్కన మరొక కణితి లేచింది. మహర్షి సరదాగా అనేవారు "లింగోద్భవం"

అయిందని. మార్చి 27న మరొక ఆపరేషన్ జరిగింది. అయినా గుణం కనిపించలేదు. రేడియం చికిత్స చేశారు. దాంతో ఆరోగ్యం కాస్త కుదుట పడ్డది. అదీ తాత్కాలిక ఉపశమనమే. ఒక నెలరోజుల పాటు వైద్యం చేశారు. సెప్టిక్ అయింది. పెన్సిలిన్ ఇంజక్షన్ యిచ్చారు. ఆ చేయి తీయాలని డాక్టర్లు సలహా యిచ్చారు. మహర్షి ఒప్పుకోలేదు. ఆగస్టులో ఒకసారి ఆపరేషన్, డిసెంబరులో మరొకసారి ఆపరేషన్ చేశారు. విధి బలీయం. తర్వాత ఇంక చికిత్సలకు మహర్షి ఆరోగ్యం అనుకూలించలేదు. హోమియో, ఆయుర్వేదం, సిద్ధ వైద్యం ఎన్ని చేసినా ఫలితం లేకపోయింది. అంత యాతన పడుతున్నా, మహర్షి నిగ్రహం కోల్పోలేదు.

1950 జనవరి 1న ఆస్పత్రికి వెళ్లిన భగవాన్ తిరిగి దర్శనం హాలులో అడుగు పెట్టలేదు. సరాసరి తన పాతగదికి మకాం మార్చారు. అతి కష్టం మీద రోజుకు రెండుసార్లు గది బయటకు వచ్చి కూర్చునేవారు. మార్చి 28న అసలు లేవలేకపోయారు. ఏప్రిల్ 14 వరకు భక్తులు లోపలకు వెళ్లి దర్శనం చేసుకునేవారు. ఆ రోజు రాత్రి 7 గంటలకు ఆక్సిజన్ యిచ్చారు. అది పని చేయలేదు. మహర్షి వద్దని నిరాకరించారు. హాలు బయట ఆరు బయట అయిదువందల మంది భక్తులు నిర్వేదంగా నిరీక్షించసాగారు. ఏ క్షణంలోనైనా ప్రాణం అనంత వాయువుల్లో కలవవచ్చు. అందరూ అరుణాచల శివస్తోత్రం పఠించసాగారు. 8-47కి మహర్షిని బయటకు మోసుకువచ్చి యోగాసనంలో కూర్చోపెట్టారు. వార్త ఊళ్లోకి పాకింది. జనం తండోపతండాలుగా వచ్చి పడ్డారు. అంతిమ దర్శనానికి ఏర్పాట్లు జరిగాయి.

ఉదయం 11.30 దక్షిణంవైపు వరండాలో పూజ, అభిషేకం నిర్వహించారు. పాలు, పెరుగు, మజ్జిగ, పళ్లరసాలు, కొబ్బరి నీటితో అభిషేకించారు. పూలమాలలకు లెక్క లేదు. నలభై వేల మంది భక్తులు మహర్షిని దర్శించారు. ఖద్దరు సంచిలో పార్థివ శరీరాన్ని ఉంచి విభూతి, కర్పూరం, ఉప్పుతో నింపి త్రికోణాకారంలో గొయ్యితీసి అందులో సమాధి చేసి మూసివేశారు.

ఆశ్రమం నుండి ఒక నక్షత్రం అరుణాచలంవైపు పయనించి అరుణగిరి శిఖరంపైన అంతర్థానమైంది. అరుణాచల జ్యోతి కనిపించినంత మేర ఆనాడు రమణ జ్యోతి దర్శనమిచ్చింది.





# సద్గురువు లక్షణాలు

భగవాన్ రమణ మహర్షి బోధనలలో కెల్లా తలమాణికంగా నిలిచే రెండు జవాబులు సాధు నటవానంద సంపాదించారు.

ప్రశ్న : సద్గురువు లక్షణాలు ఏవి?

మహర్షి : ఆత్మలో స్థితమై ఉండడం. అందరినీ, అన్నింటినీ సమదృష్టితో చూడడం. అన్ని కాలాలలో, అన్ని తావులలో, అన్ని పరిస్థితులలో నిశ్చలంగా ఉండి, నిగ్రహం పాటించడం.

ప్రశ్న : మంచి శిష్యునికి ఉండదగిన లక్షణాలు ఏవి?

మహర్షి : అన్ని బాధలను, అవరోధాలను తొలగించుకుంటూ ఆనందం పొందాలన్న ఏకైక లక్ష్యంతో ముందుకు సాగడం.

## లక్ష్యశుద్ధి - లక్ష్యసిద్ధి

### సిద్ధులు రెండు రకాలు :

మనోబలాన్ని ఉపయోగించి చేసే ప్రయోగాలను సిద్ధులు అంటారు. అలాంటి సిద్ధుల వల్ల సాధకుని లక్ష్యం చెడుతుంది.

ఆత్మజ్ఞానం లక్ష్యంగా గలవారు సిద్ధులు ప్రదర్శించరు. వాటిని కోరరు. సిద్ధుల వల్ల కీర్తి ప్రతిష్టలు పెరుగుతాయి. కాని, మనో నిగ్రహం తగ్గిపోతుంది.

### రెండవ రకం సిద్ధులు :

అతీత మానసికం. వాటికి మనస్సుతో, మనోబలంతో సంబంధం ఉండదు. మనస్సు పని చేయనవసరం లేదు. శుద్ధమైన మనస్సుకు కోరికలుండవు.

రమణ మహర్షి సిద్ధులు ఈ రెండవ శ్రేణికి చెందినవి.

అవి ఎలా జరుగుతాయి?

జ్ఞానిలో అన్ని శక్తులు, సిద్ధులు నిక్షిప్తంగా ఉంటాయి. అవసరానికి ఆ శక్తులు అప్రయత్నంగానే బయటకొస్తాయి. అవి సహజ శక్తులు. అవి సహజ సిద్ధులు. అది భగవత్ కృపా కటాక్షం. వాటికి అపజయం అంటూ ఉండదు.

జ్ఞానికి సిద్ధులు, శక్తులు లభించకపోవడం అంటూ ఉండదు.


















# శ్రీ శార్వరి రచనలు

## ధ్యాన, యోగ, తాత్విక, చారిత్రక రచనలు

1. భగవాన్ చరణాలు (మార్మిక కవితలు) రూ. 250/-
2. వివేకానందం 200/-
3. ఇహం : పరం : మనం 200/-
4. యోగామ్యూజింగ్స్ 100/-
5. అతీత మానసం 100/-
6. మాస్టర్స్ యోగదర్శిని 100/-
7. ధ్యానం : యోగం ఎలా చేయాలి? 200/-
8. దివ్యజ్ఞానం (మహాచైతన్యం) 100/-
9. కుండలిని 100/-
10. శక్తిపాతం 100/-
11. సమాధి 100/-
12. మృత్యువు తర్వాత జీవితం 80/-
13. భృక్తం - రహితం - తారకం 80/-
14. యోగానంద లహరి 100/-
15. యోగవిజయాలు 100/-
16. స్పందన : యోగానుభవాలు 100/-
17. ఆత్మదీపాలు 100/-
18. కర్ణమహాభారతం 200/-
19. శ్రీశార్వరి ఆత్మయోగిసత్యకథ 200/-
20. సామ్రాట్ అశోక 150/-
21. ప్రియదర్శి - అశోక - II 150/-
22. సిద్ధార్థ 100/-
23. చాణక్య 100/-
24. శంబల 100/-
25. గురుగీత 100/-
26. ధర్మభిక్షువు మిలారేపా! 100/-
27. భగవాన్ బుద్ధ 200/-
28. మహాత్మా జీసస్ 100/-
29. సద్గురు సాయిబాబా 100/-
30. సద్గురు రమణ 200/-
31. అరవింద దర్శనం 100/-
32. కొత్తకోణంలో కృష్ణమూర్తి 100/-


















